# అందరిలో మీకో ప్రత్యేకత

నైపుణ్యంతా కూడిన
అందమైన నేతలతా
చూపరులను ముగ్ధులు చేసే
సహజమైన లేత ముదురు
వర్ణాలతా మీకో ప్రత్యేకతను
చేకూర్చే అన్నిరకాల పట్టు,జరీ
చీరలు మరియు అతివల
అందాలకు కాంతులు
వెదజల్లే ఫ్యాన్సీ చీరల
ప్రత్యేక నిలయం

# బొమ్మన

## సారీ మందిర్

తిలక్ రోడ్,ఆబిడ్స్,హైదరాబాద్. ఫోన్ 241504



# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

విడి ప్రతి వెల రు. 4-00

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి · 1914 మద్రాసు | సంచిక-50

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

(1938-1972 సంపాదకులు) శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్‌లు 75667, 61247, 61248


## బహుమతి పొందిన లేఖ

### సుభద్ర

మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో తాజాకాలమ్' చాలా బావుంది వారు వ్రాసిన దూరదర్శన్ మీద ప్రదర్శన" చాలా చక్కగా వివరించారు ఆంధ్ర సచిత్ర వారపత్రికను విమర్శించడం చాలా కష్టము అన్ని సమపాళ్ళలో వున్నాయి కాని ఏ పత్రికలోనూ పేపర్‌లోను టి వి సుభద్రగా రమ్యకృష్ణ ఎంపిక అయ్యిందని వ్రాయలేదు కాని మన పత్రిక, పేపర్‌లలో టీ వి సుబద్రగా రమ్యకృష్ణ అని వ్రాసినారు ఇది చాలా చిన్న లోపము

సి హెచ్ రామవయ్య (తణుకు)

## వీక్లీ పోస్ట్

### ఎట్లా సాధ్యం

14-7-89 తేది సంచికలో విద్యాశాఖ మంత్రిణిగారి ఇంటర్వ్యూ చదివాను ప్రతిభగల విద్యార్థులకి ప్రాదాన్యత కలిగిస్తామన్నారు ఈ రిజర్వేషన్ల ప్రపంచంలో అది ఎట్లా సాధ్యమో చెప్పలేదు "రెడ్డి వచ్చె మొదలాడమన్నట్లు" కొత్త మంత్రులు రాగానే సబా సంఘాల్ని వేయటం ఆ సంఘాల నివేదికలు వచ్చేసరికి వీరి టరమ్ అయిపోవటం కొత్తగాదు అసలు చదువుకోవటానికే స్థలం లేక బాదపడూ్త ఉంటే గ్రందాలయాలు పెట్టడం సాధ్యం అయ్యే పనేనా? ఫెయిల్యూర్ కాండిడేట్లకు శిక్షణ అంటే గతిలేక ఉద్యోగం చేసే వాళ్ళని అర్ధమా? మిగతా వన్నీ అయితే గియితే అన్నట్టుగా ఉన్నాయి

ఆర్ కె (హైదరాబాదు)

### పాఠ్యపుస్తకాలు

కిమీకాట్కర్ ముఖచిత్ర పత్రికలో ఆసక్తికరంగా చదివే అంశాలతో విద్యామంత్రితో ఇంటర్వ్యూ నాకు నచ్చింది ఆమెను పాఠ్య పుస్తకాల కొరత గూర్చి అడగవలసినది "పరుగు పందెం' కథ బాగుంది 'ప్లాస్టిక్- సర్జరీ" అందానికి అవసరానికి అంటూ ఉపయోగకరమైన విషయాలు తెలియ జేసారు

కాజ హనిత (ఏలూరు)

( 74 వ పేజీ చూడండి )

పఠండి తొలిపత్రిక!




ముఖచిత్రం:

నాకు నేనే పోటీ అంటున్న వాణీ విశ్వనాధన్

(ఫొటో: సత్యమూర్తి)

పై వారం:

రక్త పరీక్షవల్ల ఏమి తెలుస్తుంది?

ప్రత్యేక వ్యాసం

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

విజయవాడ ఎడిటోరియల్ అడ్వయిజర్ శివలెంక రాధాకృష్ణ ఎడిటర్ వీరాజీ
4-8-1989 ముద్రాపకుడు, ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు
శ్రీ శుక్లనామ సం
శ్రావణ శు తదియ


# ఇండో పాక్ "శిఖరాగ్ర" సమస్య "సియాచిన్"

**30** సంవత్సరాల తరువాత భారతదేశ ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ పాకిస్తానీ గడ్డమీద తన అధికార హోదాలో అడుగు పెట్టారు ఆయన చైనాలో పర్యటించ వెళ్లినప్పుడు కూడా యిదే మాటలుచాలా అపురూపమైన దౌత్య విజయనీతి ప్రదర్శనగా మనం చెప్పుకున్నాం శ్రీ రాజీవ్‌గాంధీ మాస్కో మీదుగా జులై 16న ఇస్లామాబాద్ విమానాశ్రయంలో దిగినప్పుడు తుపాకీ ధ్వనులతో ఘనస్వాగతంలభించినప్పుడు- బహుశా మన పంజాబ్ రాష్ట్రంలో శ్రీ రాజీవ్ పర్యటిస్తున్నప్పటికంటే రెట్టింపు రక్షణ భద్రతా బందోబస్తులు జరిగాయి శ్రీమతి బేనజీర్ భుట్టో రాజీవ్‌గాంధీలు 'సలామ్ ఆలేకుమ్ . నమస్కార్' అంటూ కలుసుకుని కరచాలనం చేస్తూ చిరునవ్వులు చిందిస్తున్నప్పుడు కూడా- హిమాలయపర్వత శిఖరాగ్ర సానువులలో 18వేల అడుగుల ఎత్తున వున్న నిర్జీవ మంచుగడ్డల మీద- భారతీయ పాకిస్తానీ సైన్యాలు 'హారా హుషార్' అంటూ మోహరించి వున్నారు ఈ రెండు దేశాల మధ్యగల వైరుధ్య సంబంధం ఒక ప్రక్క- పాకిస్తాన్ దేశంగా జన్మించిన దాదిగా తెగ కుండా కొనసాగుతూ వున్నప్పటికీ- మరొక వంక గర్వ శత్రుత్వం ఏనాడూ అణగారిపోకుండా సాగుతూనే వస్తున్నది దీనికి కారణం కేవలం జాతీయం కాకపోవచ్చును 'ఆఫ్ఘనిస్తాన్ వ్యవహారం' లాంటి అంతర్జాతీయం,వాషింగ్‌టనీయం అనుకున్నా తప్పు లేదు కాని యిది ఆత్మ వంచనే అవుతుంది ఆది నుంచి 'కాశ్మీర్' సమస్య రెండు దేశాల మధ్య అసలు కొరుకుడుపడని కొయ్యలాంటి సమస్య సిమ్లా ఒప్పందం తిరిగి అద్యతన భావిలో మరొకటి యీ రెండు దేశాల మధ్య జరిగినా కూడా కాశ్మీర్ లోయలో ప్రశాంతత నెలకొంటుందని వూహించడం కష్టం సియాచిన్ ఒక రకంగా 'కాశ్మీర్ కక్ష'కి యీ రెండు దేశాల మధ్య జరిగే ప్రతిరూప ప్రతిష్టాత్మక పోరాటం 18వేల అడుగుల ఎత్తున- మైనస్ 43 డిగ్రీల మృత వాతావరణంలో- అతి పల్చగా- వూపిరితిత్తులు నింపడానికి చాలనంత తక్కువ ప్రాణ వాయువు లభించే చోట ప్రపంచానికి పై కప్పు అనదగ్గ మంచు దిబ్బ మీద భారత పాకిస్తానీ దళాలు నిరంతరం రెండు పోరాటాలు చేస్తున్నాయి- ఒకటి 'మాతృభూమి' ప్రతిష్ట కోసం- రెండు వాతావరణాన్ని ఎదిరించి తమ ప్రాణాలు కాపాడుకోడం కోసం! దీన్ని అంతం చేయడానికి సూత్రప్రాయంగా అంగీకరించడం వేరు- ఉభయ సేనలు మంచుకొండలు దిగి మైదానంలోకి రావడం వేరు కాశ్మీర్ భూతల స్వర్గంగా పుస్తకాలలో అభివర్ణింపబడినప్పటికి- అది నిరంతర అశాంతికి ఘర్షణలకు యుద్ధాలకు మత కలహాలకు ఆలవాలమైపోయిన 'నరకం' యివాళ ఈ రాష్ట్రంలోని 86వేల చదరపు మైళ్ళ భూభాగం- భారత పాకిస్తాన్‌ల మధ్య- సాయుధ పోరాటాలు గాని, సామరస్యపూర్వక చర్చలు కాని కడతేర్చలేని 'పేచీ' గా వుండిపోయింది 1947లో 1965, 1971లలో జరిగిన యుద్ధాల తరువాత 'యుద్ధం' అనేది రెండు దేశాల మధ్య సమస్యలకు పరిష్కారం కాదని ఉభయులూ గ్రహించినట్లుకనపడ్డా- 'రక్షణ కోసం' అంటూ రెండు దేశాలు ఆయుధాలను సైన్యాలను ఆయత్తం చేసుకుంటూనే వున్నాయి సింధ్‌లో అల్లర్లకు భారతదేశం మద్దతు యిస్తున్నదని పాకిస్తాన్ అంటే- పంజాబ్‌లో టెర్రరిస్టులు పాకిస్తానీ ప్రేరణతో మద్దతుతో వస్తున్న వారేనన్న మాటకి భారత్ కుప్పలు కుప్పలుగా నిదర్శనాలుచూపెడుతూనే వున్నది

అందుచేతనే శ్రీ రాజీవ్‌గాంధీ పార్లమెంటుసమావేశాల్లో తాను ఎదుర్కొనబోయే బోఫోర్స్ తుఫానుకు ముందు- పాకిస్తాన్‌లో కూడా తన పర్యటన పరిస్థితుల్ని మరింత దిగజారకుండా జాగ్రత్త పడ్డారు శ్రీమతి బేనజీర్ భుట్టో కూడా ప్రజాస్వామ్య ప్రభుత్వానికే అక్కడ ఆధిపత్యం వహిస్తున్నారు ఆమెకు పక్కలో బల్లెంలాగ మాజీ ప్రధానమంత్రి శ్రీ జునేజో మహమ్మద్‌ఖాన్ కత్తిలాంటి నాలికతో- విమర్శల వర్షం కురిపిస్తూనే వున్నారు అందుకనే శ్రీ రాజీవ్‌గాంధీ శ్రీమతి భుట్టోలు తమ చర్చలను 'డిన్నర్ కబుర్లో'తోనే గడిపి- సంయుక్త ప్రకటన బాధ్యతను విదేశాంగమంత్రుల స్థాయి సంయుక్త సంబంధాల సంఘానికే వదిలిపెట్టారు ఈ సంఘం అటు తరువాత చేసిన ప్రకటన ఉభయదేశాల మధ్య వ్యాపారం, సినిమాలు పాటలు నటులు, నాటకాలు అటు యిటూ ప్రజలకు అందటానికి అనువైన కొన్ని ఒప్పందాలను ప్రకటించడంతో గత డిసెంబర్‌లో చేసుకున్న అంగీకారానికి మరింత వూతం యిచ్చినట్లయ్యింది ప్రస్తుతం వున్న పరిస్థితుల్లో- దేశంలో ఎన్నికలు ముంచుకు వస్తున్న తరుణంలో శ్రీ రాజీవ్‌గాంధీ దృష్టిలో 'ఇదే పదివేలు' ●

# రోజీ - రజియా - రజని
## మరో ఛాన్స్

చర్చి గేటు చప్పుడైంది.

ఆ చప్పుడు ఎంతటి నిద్రలోనైనా తెలివి తెప్పించగలదు రోజికి. "ఎటికేట్" మేనర్స్ అని ఆధునిక సమాజంలో చాలా అవసరం. నిలబడడం - కూర్చోవడం - తలుపు తట్టడం - నవ్వడం - భోంచేయడం ఇలా అన్నిటిని ఒక సిస్టమేటిక్‌గా ఒక లయకు స్పందిస్తున్న వారిలా చేయుగలగడమే "ఎటికేట్" మేనర్స్.

సుబ్బు అదే సుబ్రహ్మణ్యంలో అవేం కనిపించవు మనిషంత ఆకర్షణీయంగా ఉంటాడు గాని మిగతా బిహేవియర్స్ అంతా అయోమయంగా - తొందరపాటుతో- తొట్రుపాటుతో - ఇంకా సవాలక్ష అవలక్షణాలతో కూడుకొని వుంటాయి. ఇంకా నయమే రోజి సాహచర్యంలో కొంత కొంత నేర్చుకుంటున్నాడు ఈ "సుబ్బు"ని నేనెలా ప్రేమించానో నాకే ఆశ్చర్యంగా ఉంది అనుకుంటుంటుంది రోజి ఒక్కోసారి

లేచి టేబిల్ లాంప్ వెలుగులో వాచ్ చూసింది ఒంటిగంట కావస్తుంది

ఓహ్ తను చెప్పిందికదూ అక్కా- బావ ఊరెళ్ళుతున్నారని పిల్లలతో తనొక్కర్తే ఉంటుందని. అందుకని మాట వచ్చింది. ముందు తినడానికి ఏమన్నా ఉందో లేదో. మహానుభావుడు అర్ధ రాత్రి లేదు అపరాత్రి లేదు రాత్రి ఒంటిగంట అయినా రెండయినా తింటాడు అడిగిమరీ. ఈ అలవాటు ఒకటి మాన్పించాలి. లేకుంటే రేపు కలసి బ్రతకడం ప్రారంభించాక తన చేతకాని వ్యవహారం అది ఏమిటో ప్రపంచంలో ఎవరూ దొరకలేదా తన ప్రేమించడానికి సుబ్బు తలపులు వచ్చినప్పుడల్లా ఈ మాట అనుకోకుండా ఉండదు రోజీ.

అదో చర్చి- వెనుక విశాలమైన మైదానం చెట్లతో

చర్చి ముందుగా చిన్న క్వార్టర్స్ చర్చి మంచి చెడ్డలు చూడటానికి రోజీ బావ ఉంటాడు రోజి హాస్టల్‌లో ఉండి చదువుకుంటుంది. అక్కా బావ తెలిసిన వాళ్ల మేరేజ్‌కు వెళ్లారు

రాత్రి చేసిన కేక్ చిన్న ముక్క మిగిలింది అది కూడా "ఫిలిప్స్" రోజి వాళ్ళక్క చిన్న కొడుకు దాచుకున్నాడు.

బీరువాలో క్రీమ్ బిస్కట్స్ ప్యాకెట్ ఉంది. ఓకే అనుకుని గేట్ వైపుకు వడిచింది.

నైటీలో ఉన్న రోజి విరబోసిఉన్న జుట్టును సవరించి పూర్తిగా చుట్టి ముడిలా బిగుస్తూ

ఒక ఆవలింతతో పాటు వచ్చి గేట్ తీసింది.

"సారీ. . రోజి... అమ్మా... నాన్న వాళ్ళతో పెళ్ళికి వచ్చాను. రేపు ఉదయాన్నే సత్యనారాయణ వ్రతం. వాళ్ళుండిపోయారు. నేనింటికి వెళ్తానని ఇలా వచ్చాను. అర్ధ రాత్రి డిస్టర్బ్ చేసినందుకు సారి."

"సర్లే.. సర్లే. . చర్చి వెనక్కి వెళ్ళి కూర్చో.. టీ, బిస్కెట్స్ తెస్తాను."

"అమ్మో .. నాకు భయం..."

"ఈ పండు వెన్నెల్లో భయమా?... నాకు నచ్చదు సుబ్బూ...పిరికి వాళ్ళంటే నా అసహ్యం. తిన్నగా వెళ్ళి కూర్చో ." శాసించినట్లే అన్నది రోజీ.

అతని బలమైన బాహువుల్ని అందిపుచ్చుకుని చర్చి దగ్గర వరకు తీసుకు వెళ్ళింది

"చాంద్ చురాకే లాయా హు
చల్ బైఠే చర్చ్‌కే పీఛే
నాకోఈ దేఖే నా పహచానే
కరతే మీఠీ బాతేం..."

మధురభావన ముప్పిరికొన్నది రోజిలో... అంతలోనే వేడి నిట్టూర్పు వదిలింది.

విన్ని చాదస్తాలు వదిలించాలో ఈ మహానుభావుడికి. అయినా ఏమిటో అమాయకమైన సుబ్బు చూపులు- అతని స్పర్శ- ఎంత బాగుంటాయో ... సుబ్బు తెగించి లవ్ లెటర్ రాసినప్పుడే లాగి లెంపకాయ ఇద్దామనుకుంది కాని సాధ్యం కాలేదు.

"ఐయామ్ సారీ రోజి... ఏదో రాసేసాను" అన్నాడు సుబ్బు.

"అంటే నిజం కాదా.. ?" సూటిగ చూస్తూ అడిగింది.

"నిజమే అనుకో .." నసుగుడు

"నసుగుడొద్దు నాకు. ఓపెన్‌గా మాట్లాడే వాళ్ళంటేనే ఇష్టం. నువ్వు కాలేజికి చాల ఛాదస్తంగా వస్తావు. ఏదో ఒక బొట్టు నీ నుదుటను ఉండాల్సిందేకదా. శకునాలు చూసుకుంటూనే లేవడం, కూర్చోవడం చేస్తావు. ప్రతి పుస్తకం ఆరంభంలో ఏదో రాస్తావు ఇవన్ని నాకు నచ్చని విషయాలే. ఒక్కసారి కాకపోయినా క్రమంలో ఇవన్నీ నువ్వు వదులుకోగలగాలి...చాలా . చాలా ."

నవ్వుకుంది రోజి.

పాపం కుటుంబ వాతావరణానికి ఎదురీదడం ఎంత కష్టం?

అందులోను వ్యక్తిత్వాలను నాశనంచేసే వాతావరణం వాళ్ళింట్లోనే ఉంది.

బిక్కు బిక్కుమంటూ కూర్చున్నాడు సుబ్బు చర్చి వెనుక చప్టా మీద

వచ్చి పక్కన కూర్చుని బిస్కట్ల ప్లేట్ అందించింది.

సుబ్బు అందుకుని తినడానికి ఉపక్రమించాడు.

"అబ్బా... ఎవరూ ఎత్తుకెళ్ళరులే నెమ్మదిగా త్రుంచుకు తిను .. ఈ రాత్రి- ఈ ఏకాంతం- ఈ వెన్నెల . నీ పక్కన నేను... అయినా నీకు తిండి ధ్యాసే " రోజి చిరాకు.

నవ్వాడు సుబ్బు బిస్కట్స్ తింటూ

"చిత్రంగా ఉందిలే రోజి కనీసం నీమూలైనా నాన్ వెజ్ ఫుడ్ దొరుకుతుందేమో అనుకుంటే మీరూ వెజిటేరియన్స్ అయారు. నాన్న దొంగతనంగా హోటల్స్‌కు వెళ్తాడు. అమ్మేమో గప్‌చుప్‌గా తన స్నేహితురాలింటికి వెళ్ళి వచ్చేస్తుంది నేనే రెంటికి చెడ్డ రేవడ్ని "

"ఏముందని నాన్ వెజ్‌లో అలా ఇదయిపోతావు శాడిష్ట్ నైజం నువ్వునూ అంతేనా ఈ రాత్రంతా ఏదో ఒకటి తింటూ . ఆ తిండి గురించి- ఈ తిండి గురించి మాట్లాడుతావు. అంతేనా? ."

పక్కకు జరిగింది. అప్పుడు చూసింది నుదుటి మీద కుంకుమ బొట్టు దానిమీద రెండు బియ్యం గింజలు.

"వేసావన్న మాట వేషం.. " అంటూ చెరిపేసింది బొట్టును.

"మరచే పోయాను.. అని పేంట్ నుండి ప్యాకెట్ తీసి.. ఇది ఉదయం పూజా ప్రసాదం." అంటూ హల్వా అందించాడు

"నువ్వనుకో ప్రసాదమని నేను పదార్థం అని తింటాను " అని తీసుకుని పక్కన

ఒట్టింది ఆశ్చర్యంగా చూసాడు సుబ్బు

ఇంట్లో అయితే పక్కింటి నర్స్ మేరి ఎప్పుడైనా కేక్స్ అవి పంపిస్తే ఇంట్లో ఎవరూ తినరు. పని పిల్లకు ఇచ్చేస్తారు ఆ మాత్రానికే తీసుకోవడం ఎందుకు అనిపిస్తూ ఉంటుంది ఒక్కోసారి

"సుబ్బు ఆ విక్టర్ చూస్తున్న జాబ్‌లో సెటిల్ అయిపో హాయిగా మనింట్లోకి మనం వెళ్ళిపోదాం "

"అంతేనా రోజీ.. నీ ఇన్ని మాటలు నేను విన్నాను గదా . ఈ ఒక్క మాటా వినరాదు కనీసం రిజిష్టర్ మ్యారేజ్ అన్నా . "

"ఆ భయం నాకుండాలి- నీకు కాదు నేను రజియా- రజని ఒకటే అనుకున్నాం ఈ ఫార్మాలిటీస్ ఏమి లేకుండా ఎవరి ఆర్జన వాళ్ళకి వచ్చిన నాడు- ముగ్గురం ఒకే ప్లాట్‌లో ఉండదలుచుకున్నాం నువ్వు- రజియా మిగిలారు జాబ్స్ అన్వేషణలో అంతే "

సుబ్బుకు అప్పుడు మూడ్ స్టార్ట్ అయినట్లుంది

చెంపలను పెదాలతో రాయసాగాడు

"కనీసం ఈ చర్చిలో. "

"చెప్పానా . ఏ రూపంలోను పెళ్ళి అనేదానిని అంగీకరించనని స్త్రీ వలనే పురుషుడికి పాపం అంటిందని సైతాను ప్రేరణతో స్త్రీ పాపానికి ప్రేరేపించిందని విన్నప్పుడే స్త్రీగా నేను అవమానించ బడ్డాను అవమానించే వ్యవస్థలను దేనిని నేను అంగీకరించను ."

సుబ్బు ఆక్రమించేసుకున్నాడు రోజీని

"ఏవొచ్చినా రాకపోయినా ఇది మాత్రం బాగా వచ్చును పద ఇంట్లోకి" అన్నది రోజీ

"ఇంటికి వెళ్ళొద్దా-"

"వెళ్ళొద్దు. ఇలాంటి వేళ వస్తుందా? రాదు . రేపు ఆదివారం. ఉదయం జాలీగా గడుపుదాం. మధ్యాహ్నం పిల్లల్ని సినిమాకు పంపించేసి . పక్క వేసేద్దాం . రేపు నగ్నంగా చూసేసుకోవాలి ఒకరి నొకర్ని . అంతే . "

"ఏమిటి పట్ట పగలు పక్కా అందులో నగ్నంగానా?.. ఛీ . పగలలా కలువగూడదు అందులో నగ్నంగా పిల్లలు రాక్షస



ప్రవృత్తితో పుడతారట."

"అటలే గాని. నిజాలు కావుగా ఆకలికి పగలు రాత్రి ఏమిటి? . నీ-నా శృంగార జీవితం స్వేచ్ఛగా ఉండాలి. నా సర్వావయవాలపై సర్వాధికారాలు తీసుకో- నీ సర్వావయవాలపై సర్వాధికారాలు ఇవ్వు- అంతే మంచి బాలుడిలా లోపలకు రా బుద్ధిగా నిద్రపో"

అదే అదే రోజీలో విశిష్టత

తనకు ఇంట్లో- తప్పు- పాపం అని బోధించేవన్నీ.- తన మనసు చేయాలని పరుగులు తీస్తు ఉంటుంది. ఏదో భయం- నిజంగానే స్వర్గనరకాల మాయ భ్రమ రోజీ సన్నిధిలో అవేవి ఉండవు. ఫ్రీగా ఫ్రెష్‌గా ఉంటుంది. రోజీ చెబితే తను వింటున్నట్లు నటిస్తాడు కాని అవన్నీ తన మనసు కోరుకుంటున్నవే. ఈ రోజీకోసం ఏదన్నా చేస్తాను అనుకున్నాడు సుబ్బులు

వెన్నెల ఇంకా కాస్తూనే ఉంది

రోజీపై ప్రణయకౌముది ప్రసరిస్తున్నది

సుబ్బుపై నూతనకోణం ప్రకాశమౌతున్నది

చర్చి గంటలు మోగ్గానే తెలివొచ్చింది సుబ్బుకి

అప్పటికే రోజీ స్నానం చేసేసింది టిఫిన్ చేస్తున్నది కిచెన్‌లో ..

రోజీ అక్క పిల్లలు ముద్దుగా

"గుడ్ మార్నింగ్ అంకుల్" అన్నారు కోరస్‌గా

తనకు కళ్ళు మూసుకునే ఉండాలనిపిస్తుంది ఇంట్లో ఉదయాన్నే తల్లి తండ్రి చేసే పూజల హడావిడి రొటీన్ బాపతు చూస్తే. ఇప్పుడలా కాదు కళ్ళు విప్పి ఉదయాలు ఇంత అందంగా స్వాగతం పలుకుతాయా అని చూస్తున్నాడు సుబ్బు

* * * * * *

"హాయ్ విక్టర్ " రజియా విక్టర్ రూమ్‌లోకి అడుగు పెట్టింది.

పనిపిల్ల కిచెన్ నుండి బయటకు వచ్చింది

"నమస్తే మేడమ్ .." అంది.

"రాణీ నీకీ రోజు... జాలీడే మూన్‌షో చూసుకుని ఇంటికి వెళ్ళిపో ఉదయం రా" అని హాండ్ బ్యాగ్ నుండి ఇరవై రూపాయలు తీసి అందించింది. పద్నాలుగేళ్ళ ఆ పిల్ల సంబరంగా అందుకుంది హడావుడిగా కిచెన్‌లోకి వెళ్ళింది. వెనకే రజియా వెళ్ళింది పూరీలకు లాగుంది పిండి కలపబోతోంది రాణి వదిలేయ్ రాణి వెళ్ళు నే చూసుకుంటాను నువ్వు స్నానం అది చెయ్ అని రజియా కలగ చేసుకుంది

"ఈ విక్టర్ మహానుభావుడిది మొద్దు నిద్ర అందులో ఆదివారం " స్వగతంగా అనుకుంది రజియా

మరచే పోయాను అనుకుంటూ బ్యాగ్‌లోనుండి మువ్వల పట్టీలు తీసి కాలి వేలుకి ధరించింది నౌ అనుకుని . కిచెన్‌లోకి వెళ్ళి గరమ్ గరమ్ చాయ్ చేసి కప్పులో పోసి విక్టర్ బెడ్ దగ్గరకు వచ్చింది

"ఛీ వెధవ నిద్ర నువ్వును. అరమైలు దూరం నుండే నా ఉనికి తెలుస్తుందంటావు ఇదేనా- అరగంట అయింది లే " బుగ్గలు తట్టబోయింది అలాగే ఆ చేతుర్ని పట్టుకున్నాడు విక్టర్

ఆ చేతుర్ని అలాగే పెదాలకు ఆనించి ముద్దు పెట్టుకున్నాడు.

"అయితే .. అంతా దొంగ నిద్రన్న మాట "

"దొరనిద్రే " అని కళ్ళు తెరచి.. " వ్వాట్ ఏ గ్రేట్ రజియా .. ఈ నీలం దుపట్టాలో భలేగున్నావు "

"ఉంటాను- ఉంటాను. ముందు ఫ్రెష్ అయిరా " అని విడిపించుకుని కిచెన్‌వైపుకి కదిలింది రజియా అప్పుడు విన్నాడు కాలి మువ్వల చప్పుడు విక్టర్

"హాయ్ బాగుంది . రజియా ... కాని అవి హిందువుల అమ్మాయిలూ- అందులో పెళ్ళి అయిన అమ్మాయిలు పెట్టుకుంటారు తెలుసా?"

"అవొచ్చు నాకు లయ ఇష్టం. ప్రతీ శ్వాసలో లయ ఉంటుందనుకుంటాను నేను- కాకుల గోల- పక్కింటి ఆంటి అసలు రాని సంగీత పరిజ్ఞానంతో పాడే డోల.. వాళ్ళ బాబు ఏడుపు . అన్ని లయబద్ధంగా శ్రావ్యంగా ఉంటాయి అడుగడుగున నన్ను నేనే వినాలని మొన్న రమ పెట్టుకొస్తే అడిగి తీసేసుకున్నాను ఫార్మాలటీస్ జాన్తానై.. నీకు బాగుందా?" వెనక్కి తిరిగొచ్చి సంభ్రమంగా అడిగింది

"నువ్వేం చేసినా బాగుంటుంది" స్వచ్ఛమైన నవ్వుతో అంటూ లేచాడు

"విక్టర్‌ని వదిలేస్తున్నాను అన్నా!"

"అదీ బాగుంటుంది అని చూడరాదు " లుంగీ సర్దుకున్నాడు.

"ఛత్. అది సరే పూరీలలోకి ఏం కూర చేయను "

"అబ్బా- వెధవ పూరీలు . పరాఠాలు చేద్దు పరాఠ్ పరాటా "

"పిండి కలిపేసానే "

"ఉంచేద్దు అలా . నీ చేతి స్పెషల్ మళ్ళీ ఎన్నాళ్ళకో?"

"ఎన్నాళ్ళకి అంటే గుర్తు వచ్చింది నాకు సుబ్బుకి తొందరగా ఏదన్నా జాబ్ చూడు నేను ప్రయత్నిస్తున్నాలే రేపు విమల వాళ్ళ డాడీని కలవమంది ఎన్నాళ్ళు ఆ ఫ్లాట్‌నలా ఖాళీగా ఉంచుతాం ."

"ఓ కే " అన్నాడు విక్టర్.

"విక్టర్ " గోముగా అన్నది రజియా ఆగాడు విక్టర్

"నీకు కోపంగా లేదు గదా చర్చిలో మ్యారేజి ప్రపోజల్ కొట్టిపారేసానని "

విక్టర్ మెచ్చుకోలుగా నవ్వాడు

"లేదు డియర్- ముమ్మాటికి లేదు. నిఖా పద్ధతిని వ్యతిరేకించావు కదా- వివా-

## బోదకాలుకు చేప మందు!

బోదకాలువ్యాధి నివారణకు కేరళ శాస్త్రవేత్తలు ఒక ప్రక్రియను రూపొందించారట ఈ ప్రక్రియక్రింద పిస్తియా అనే కలుపుమొక్కను తినే 'గారామి' అనే చేపను వినియోగిస్తున్నారు

ఈ కలుపుమొక్కలవల్ల కాలువలు, సరస్సులలో దోమలు వృద్ధిచెందే అవకాశం వుందని, ఒక రకం దోమవల్ల బోదకాలు వ్యాపించే అవకాశం వుందని అందువల్ల రోజుకు 10 ఔన్సుల పిస్తియా మొక్కల్ని తినే 'గారామి' చేపలను వినియోగిస్తున్నారని ఆ శాస్త్రవేత్తలు తెల్పుతున్నారు

'గారామి' చేప నీటిలో తేలియాడే పదార్థంతో జలాశయాలలో గూడుకట్టుకుంటుందని వారు వివరించారు ఈ చేపలవల్ల బోదకాలు పూర్తిగా నివారింపబడుతుందని శాస్త్రవేత్తలు నొక్కి చెప్పున్నారు

హోలు- విడాకులు నిఖా- తలాక్‌లు ఎందుకీ తతంగాలు. . యు ఆర్ గ్రేట్ రజియా నిజంగా ముస్లిం అమ్మాయివై ఉండి "నమా-జు" లాంటివి పాటించవు అంటే చాలా గొప్ప విషయం ..."

"అదేం గొప్ప విషయం విక్టర్. స్త్రీలను పరదాలలో ఉంచి. సమస్త పాపాలకు మూలంగా ఎంచి వంచితుల్ని చేసే పద్ధతులను వ్యతిరేకించడం అభివృద్ధికరమైన విషయం గాని గొప్ప విషయం కాదు అన్ని మతాలు ఘోషించే భూతదయను మాత్రం ఈ మతానుసరులు ప్రక్కకు నెడ్తారు మాంసాహారం కావాలి నాకు నచ్చదు విక్టర్. అయామ్ సారి నువ్వు నాన్ వెజిటేరియన్‌వి కదూ"

"రజియా వాడినయాక ఇంకెక్కడి నాన్ వెజిటేరియన్‌నిలే ఇప్పటికే అలవాటు పడుతున్నాను ఆ ఆమ్లెట్ బారి నుండే తప్పించుకోలేక పోతున్నాను. ప్చ్"

"అది శాఖాహారమేలే- వెళ్ళు ముందు ఫ్రెష్ అయిరా చూద్దాం"

విక్టర్ రాబోయేసరికి డైనింగ్ టేబిల్‌పై డిష్‌లు అమర్చబడి ఉన్నాయి

"వాహవా రజియాబేగమ్ వారి ఘుమఘుమలు కూడా కలిసాయన్నమాట కూర్మాలో"

"ఆ ఫ్యూడల్ మాటలు వాడకు విక్ట-ర్.."

"గుర్తుందా రజియా మన పరిచ-యం" విక్టర్ నవ్వుతూ అన్నాడు

"చంపేసారు సార్ నిన్నటి వరకు "గైడ్" క్యాసెట్ అడిగే వాళ్ళే లేరు ఇప్పుడే ఈ మిస్ తీసుకున్నారు మీరడిగారు" వీడియో లైబ్రరి అతను అన్నాడు

"కావాలంటే తీసుకు వెళ్ళండి' గైడ్ క్యాసెట్ పట్టుకు నిలబడిన అమ్మాయి క్యాసెట్‌ను ముందుకు చాపింది

"నో నో ముందు మీరు తీసు-కున్నారు గదా." అతని సంకోచం

"ఫరవాలేదు లెండి- "పాకీజా" తీసుకు వెళతాను మీరింత వరకు గైడ్ చూడనే లేదా?"

"చదివాను కాని చూడడం అవలేదు,"

"అయితే మీరే చూడాలి. తీసుకోండి జీవితం లోని ఎన్ని కోణాలున్నాయో అన్ని కోణాలను దర్శింప చేసారందులో లత పాట-లు- వహీదా ఆట- దేవానంద్ నటన అదో అపూర్వానుభూతి లెండి" ఆ అమ్మాయి కళ్ళలో వేయి మతాబాల కాంతులు

"అంత అపూర్వానుభూతిని అందిస్తు-న్నందుకు థాంక్స్ ఇంతకీ మీ పేరు?"

"యు ఆర్ వెల్‌కమ్... రజియా."

"మై నేమ్ ఈజ్ విక్టర్. ఇక్కడికి దగ్గరే నా రూమ్"

అలా కేసెట్ లైబ్రరీలోని పరిచయమే ప్రేమగా పరిమళించింది.

"రజియాగారు స్మాల్ స్క్రీన్ ద్వారా పరిచయమైన మనం ఒకరి నొకరు అర్థం చేసుకున్నాం- దగ్గరయాం. బయటకు అనలేదు గాని ఇద్దరం అనాలనుకుంటున్నది ఒకటే "ఐ లవ్ యూ" నేను ఊహిం-చింది రైటే అయితే రేపు అలంకార్‌లో "మధుమతి"కి మీరు నాతో వస్తున్నారు లేదా అంటే స్నేహితులుగానే ఉందాం




స్మాల్ స్క్రీన్ పరిచయం వైడ్‌స్క్రీన్‌కు విస్తరిస్తుందని ఆశిస్తాను"

డైమండ్ పార్క్‌లో రోజాపువ్వు ప్రెజెం-ట్ చేస్తూ విక్టర్ విన్నపం చేసాడు

అలా దగ్గరయ్యారు వాళ్ళు

"మేం ముగ్గురం విక్టర్ అక్కాచెల్లెళ్లం కాదు. ప్రాణ స్నేహితులం నేను, రోజి, రజని- ముగ్గురం కూడా సహజీవన వ్యవ-స్థనే ఆహ్వానిద్దామనుకున్నాం ఒకే ఫ్లాట్‌లో ఉండాలనుకున్నాం. మాకు మాతో జీవితం పంచుకోబోయే వారికి కూడా అర్హత ఉండాలి అంతవరకు ఆగాలని షరతు ఇవన్నీ మీకు తెలియాలని చెపుతున్నాను."

రజియా గతంలోకి పూర్తిగా వెళ్ళిపో-యింది

"ఓయ్. పరారాలు వడ్డించు. చలో ఏక్ బార్ ఫిర్‌సే అజనబీ బన్ జాయే హమ్ దోనో అని ఆలోచిస్తున్నావా?"

"ఛత్." అని వడ్డించ సాగింది రజియా.

"ఇవాళ ఒక కేసెట్ సిద్ధం చేసాను ఏం కేసెట్టో చెప్పుకో చూద్దాం" విక్టర్ పరారాను త్రుంచుతూ అన్నాడు

"క్లూలు ఇవ్వండి ప్రయత్నిస్తాను" అన్న-ది రజియా

"ఏరువాక అమ్మాయి యవ్వనం- పాట-ల్ని తనదైన పద్ధతిలో దత్తు చేసుకున్న యువ హృదయాలని పిండి ఎండ వేస్తున్న గాయని పాటలు. ట్రాజెడీ క్వీన్ శిఖరాగ్ర నటన కళాపిపాసి భగ్న హృదయం నుండి వెలువడిన మరో మనోహర దృశ్యకావ్యం ప్రముఖ పాత్ర ధరించిన మరో నటుడి పేరు మాత్రం రెహమాన్.."

రజియా ఆలోచించ సాగింది

ఐదు నిముషాలు గడిచినా రజియా చెప్పలేక పోయింది

ఓస్ ఇంతేనా అన్నట్లు చూసాడు విక్టర్

ఆలోచిస్తూ కాలిని లయబద్ధంగా నేలకు ఆనిస్తుంటే మట్టెల మువ్వలు శబ్దం కాసా-గాయి.

విక్టర్ క్రిందనుంచి ఆ పాదాలను అలానే చూస్తూ ఉండిపోయి బల్ల క్రింద నుండి ఆ పాదాల దగ్గర వరకు పోయాడు

సున్నితంగా పాదాల దగ్గర స్పర్శకు ఈలోకం లోకి వచ్చింది రజియా

"మైగాడ్.. విక్టర్. లే. ఏమిటి-ది?"

"ఏం చేయను? నీ కాలి అందే మోగింది- నా కంటిచూపు రేగింది"

"బాగుంది లే లే ముందు"

"తప్పుతుందా లేవమన్న తరువాత ఆ సినిమా పేరు సాహెబ్- బీబీ- ఔర్ గులామ్ కాని డార్లింగ్- జోడించు రెండు చెక్కిళ్ళు- తగిలించు వలపు సంకెళ్ళు"

అని అలాగే రజియాను ఎత్తుకుని బెడ్ మీదకు విసిరేసి-

"లెట్ అజ్ లవ్- రజియా"

అని పక్కన చేరాడు విక్టర్

రజియా రసానుభూతిని విక్టర్‌కు ఇస్తున్నదో విక్టర్‌నుండి పొందుతున్నదో నిర్వచించలేని అపూర్వానుభూతి అణువణువున అలుముకున్నది ఇద్దరికి

* * * * * *

"ఒక్క ఐదు నిమిషాలు రియాజ్... హెయిర్ స్టైల్ మార్చేస్తాను జాజుల దండకి ఈ స్టైల్ బాగుండదు ఐదు నిమిషాలు డెబనీర్ చూస్తుండు"

చకచకా జుట్టు విప్పుకుంటూ అన్నది రజని

"డెబనీర్ చూసి ఇంకా ఫినిషింగ్ టచెస్ ఇవ్వని నిన్ను చూసి నో రజని నో నిన్నే చూస్తుంటాను రెప్ప ఆర్పకుండా కానీయ్ ఆగాగు కురులు విరబోసుకున్నావు గదా ఆ కురులలో నన్ను ఒకసారి దాచివదిలేద్దూ నా అయామ్ ఇన్ రొమాంటిక్ మూడ్"

అద్దం ముందు నిలబడి ఉంది రజని

వెనకనుంచి వచ్చి నడుంమీద చేయివేసి వాటేసుకున్నాడు రియాజ్

మత్తుగా మూలిగింది రజని మూలగడంలో పైట జారింది

రియాజ్ చేతుల్ని పైకి జరుపుతూ భుజాలను అఘ్రాణించసాగాడు

"సూపర్ పెర్‌ఫ్యూమ్ డార్లింగ్"

రజని మెలికలు తిరుగుతోంది

"రియాజ్ నీ స్పర్శలో నన్ను కరిగించే గుణం ఉన్న మాట నిజమే కాని అంతకంటే నన్ను క్రైపెక్కించేది నీ శరీరం నుండి వెలువడే ఘాటైన వాసన నిజంగా నిన్ను వదలబుద్ధి కాదు నాకు."

వెనుతిరిగి సగం విడి ఉన్న షర్ట్ బటన్స్ పూర్తిగా విప్పి అతని విశాల వక్షస్థలాన్ని చేతితో రాస్తూ ఆఘ్రాణిస్తూ ఉండిపోయింది రజని

రియాజ్ నిలబడే విజృంభిస్తున్నాడు.

అప్పుడు స్పృహ వచ్చింది రజనికి

"రియాజ్.. . ప్లీజ్ .. బయటకు వెళ్ళాలి మనం.." అని విడివడింది.

వదలలేక వదిలేసాడు రియాజ్.

"నువ్వు చాలా కఠినరాలివి రజని నిర్దయగా నన్ను చూస్తున్నావు."

"ఉండాలిలే ఈ మాత్రం కఠినం"

నవ్వుతూ తిరిగి తల దువ్వుకోసాగింది

తోచి తోచక ట్రాన్సిస్టర్ ఆన్ చేసాడు రియాజ్

"అపనీ కహానీ ఛోడ్ జా- దిల్ కీ నిషానీ ఛోడ్‌జా

కౌన్ కహే ఇస్ ఓర్- తూఫిర్ ఆయేనా ఆయే",

లత పాడుతున్నది

"రజని మన నిషానీగా ఎందర్ని తెద్దాం ఈ లోకంలో"

"నీ కెందర్ని తెద్దామని ఉంది?"

"ఇద్దరూ లేక ముగ్గురు"

"అంతేనా అంతే ఏం?"

"బాగుంది మరి పోషించవద్దు. పెద్ద చేయొద్దు. అయినా జనాభా సమస్య ప్రభుత్వానికి భారం కాదూ"

"వాళ్ళు తినడానికి నోరులేక పుట్టరు గదా. కాళ్ళు, చేతులు మెదడు అన్నీ ఉంటాయి. వాటికి పని కల్పిస్తే సరిపోతుంది గదా చిత్రంగా ఉందే నువ్వా మాట అనడం మొన్న ఒకరన్నారు ఈ ఫేమిలీ ప్లేనింగ్ తెచ్చి హిందువులకే రుద్దుతున్నారు ముస్లిమ్‌లు మతం ప్రకారం నడుచుకుంటూ జనాభా పెంచుకుంటున్నారు అని. నువ్వేమొ ఇలా అంటావు"

మోడల్‌గా హెయిర్ డ్రెస్ చేసి చూసుకుని తిరిగి విప్పుతూ అన్నది రజని

"ఈ కాలంవాళ్ళు ఎవరున్నారు రజని అలా మతం మతం. ఆ పేరు తీస్తేగాని ఉండలేరు అది సరే నువ్వేమిటి ఎందరినైనా కంటానంటావా ఏమిటి?"

"నేనన్నానా నువ్వనే ఉద్దేశంతో మాత్రం కాదు. నా ఆరోగ్యం దృష్ట్యా నేను జాబ్ చేస్తున్నాను కాబట్టి ప్రతిసారి కొంత కాలాన్ని ఇలా విశ్రాంతిగా గడపడం ఇష్టంలేక కుటుంబ నియంత్రణ పాటిస్తాను యామ్ ఐ రైట్"

"రజనీ ఈజ్ ఆల్వేస్ రైట్"

"రియాజ్ ఆల్సో. అది సరే చికెన్ బిరియానీలు- మటన్ బిరియానీలు ఇప్పుడే తినేయ్ సిగరెట్లు- సీసాలు అన్నీ సరదాలు తీర్చేసుకో సహజీవనం ప్రారంభించాక అన్నీ బంద్ మరి"

"ఎప్పుడో మానేసాన్లే దిక్కుమాలిన సర్దాలు .. రజని రెఫ్యూజ్ చేసింది రియాజ్ ఏక్సెప్ట్ చేస్తాడని ఎలా అనుకున్నావు ఇంతకీ పెళ్ళో- మ్యారేజో- నిఖానో- సహజీవనమో ఎప్పుడమ్మా?"

"ఎందుకంత తొందరమ్మా సుబ్బుకి- రజియాకి జాబ్ దొరకగానే. అయినా ఏం తక్కువయిందమ్మా?"

"లేదనుకో కాని నువ్వు చూపించిన కలను యథార్థంగా చూడాలని ఉంది సుబ్బు- రోజీ, రజియా- విక్టర్, నేను- నువ్వు . ఓహ్- వండర్‌ఫుల్"

"చూడు" అన్నది రజని ఎదురుగా నిలబడి

తలెత్తాడు రియాజ్ నీ చేతులిలా ముందుకు చాపు అంది రజని

అర్థంకాక రెండు చేతులు చాపాడు



# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం పరిపూర్ణ పోషకాహారపు మంచితనం అందజేస్తుంది 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్థాలు ప్రవేశ పెట్టేటప్పుడు నెస్టమ్‌తో ప్రారంభించండి బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్ తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది అంతేకాదు నెస్టమ్ ఇనుము విటమిన్‌లతో మరింత బల వర్ధకం చేయబడింది



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్ మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చే మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు పప్పు పండ్లు నెస్టమ్‌లో కలపండి

కేవలం రూ 9/-* కే డబ్బాలో 200 గ్రా. సంచీ




* స్థానిక పన్నులతో సహా

**ఉచితం !**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం 6016
న్యూ ఢిల్లీ 110 008

Nestlé®

ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది

R K SWAMY FSL 5327 TEL

## హారకులకో సవాల్!

# 31 టిట్ ఫర్ టాట్

**రైలుబండెక్కుదాం! దేశాలన్నీ చుట్టొద్దాం! వస్తావా?**

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి— ఆ రిపార్టీ గుచ్చుకోవాలేగాని బాధించకూడదు రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్లుండరాదు కార్డు మీద మాత్రం రాయాలి ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి మీ పూర్తి చిరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికీ రు 25, రు 15 చొప్పున బహుమతి వుంటుంది!— ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం

**11–8–'89 లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

చాలా మంది వెంటనే రిపార్టీల వర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక— మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి వాగ్బాణాలు స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్లీ ప్రయత్నించండి!

—ఎడిటర్

**'రమ్మంటే ఎందుకో అనుకున్నా. ఓస్! యిందుకా?'**

*రు. 25 బహుమతి పొందిన రిపార్టీ :

**"మరెందుకనుకున్నారు? ఈ దొంగ సచ్చిన బ్యాక్ హుక్స్ అందటం లేదు! కాస్త పెట్టి పెడుదురూ!"**

-ఎ దొరబాబు (పుత్తూరు)

*రు.15 బహుమతి పొందిన రిపార్టీ:

**"ప్లీజ్! తొందరగా చెప్పండి పప్పులో ఉప్పు ఎంత వేయాలో?"**

-కె జనార్ధన్ (వికారాబాద్)

**మరి కొన్ని వాగ్బాణాలు**

"మరి?! పిల్లనిచ్చి పెళ్లి చేస్తాననుకున్నావా!"

-ఎ వి ఆర్. ప్రసాద్ (నెల్లూరు)

"అందుకే అయితే! తగు పెద్ద మనిషినే పిల్చేదాన్నిగా..."

-ఎద్దుల హాయిగ్రీవం (పిఠాపురం)

"ఆ అయితే చాలా ఎక్స్‌పీరియన్స్ వుందన్న మాట ..."

-బి గంగాధరరావు (బేగాయమ్మపేట)

**లక్కీ పేర్లు**

కె గోపీనాథ్ (తుమ్మూరు), టి ఎస్ కృష్ణమోహన్ (అనకాపల్లి), ఎం చంద్రమౌళి (రఘుదేవపురం), కె పి కోటిరెడ్డి (వందివాడ), ఎం సత్యనారాయణ (గుడివాడ), కె రామారావు (జి కె పాలెం), బి ప్రశయకుమార్ (చీపురుపల్లి), డి విక్రమ్ (ఖమ్మం), కె శ్రీనివాసులు (ఊటుకూరు), టి రాజగోపాల్ (రాజమండ్రి), ఎం సూర్యప్రకాశరావు (రామరాజులంక), డి పున్నయ్య (విశాఖపట్నం), ఎన్ నరసింగరావు (అలమండ సంత), జి రమేష్‌బాబు (ప్రత్తిపాడు), కరీమున్నీసా (ఒంగోలు)

## రోజీ- రజియా- రజని

రియాజ్

నెయిల్ కట్టర్‌తో గోళ్ళు కత్తిరించేసింది రజని

"అదేమిటి ఉన్నట్టుండి వాటిమీద దండయాత్ర"

"అవి ఇందాక ప్రతాపం చూపాయిలే మండుతుంది నాకు" నవ్వుతూ అన్నది రజని

"ఆధారాలు చూపాలి నిరాధారమైన నిందలు వేయగూడదు" గుండెలపైకి ఆశగా చూస్తూ అన్నాడు రియాజ్.

"రాత్రికి చూపుతాలే ఇప్పుడవేం కుదరవు"

"రాత్రే ఆరోపించవచ్చుగా"

నాటీ అని మొట్టింది రజని.

"ఏమిటో రజని మైదానంలోని రాజేశ్వరి- అమీర్‌లు కాస్త గడుసుదేలి మన రూపంలో పుట్టారేమో అనిపిస్తూ ఉంటుంది నాకు. ."

"ఇంకా ఏమనిపిస్తుంది?"

రియాజ్ తలను గుండెల మీదకు లాక్కుని తల దువ్వుతూ అన్నది రజని

రియాజ్‌కు కావలసింది రజని-రజనికి కావలసింది రియాజ్ అనిపిస్తుంది నాకు.

రజనియే హత్తుకుంది గాఢంగా రియాజ్‌ను

* * * *

రోజీ-సుబ్బు, రజియా-విక్టర్, రజని-రియాజ్‌లు సహజీవనం ప్రారంభించారు. కామన్ కిచెన్. కామన్ డైనింగ్‌హాల్ బెడ్‌రూమ్‌లు వేరు వేరు తమకు కావలసిన సమస్తాన్ని వాళ్ళే అమర్చుకున్నారు

ఇల్లు విడిచాక వారందరికి తమ ఊపిరి తాము పీలుస్తున్నట్లు అనిపించింది.

నెల అంతటికి కావలసిన సామాన్ల లిస్ట్ ఉమ్మడిగా తయారు చేస్తున్నారు.

అందరూ లిస్ట్ అంతా ఒక్కోసారి చదివారు.

రోజీ చివర్న "కండోమ్స్" జెయింట్ ప్యాక్ అని రాసింది.

సుబ్బుకు అర్థంకాక తలగోక్కున్నాడు పాపం!

"అబ్బా రోజీ-- ఇంకా సుబ్బుని-- బుచ్చిబాబులానే ఉంచావే. ఈ రాత్రికే అదేదో చెప్పడూ." అన్నది రజియా.

రోజీ-రజియా-రజని కలకన్నారు.

ఆ కల ఫలించడానికి సుబ్బు-విక్టర్-రియాజ్ సహకరించారు.

వాళ్ళు వివాహ వ్యవస్థని- మత-వ్యవస్థని కాదని సహజీవన వ్యవస్థను ఆరంభించారు.

సీరియల్

# ద్రౌపది

ప్రయాగ రామకృష్ణ



## ఇంద్రప్రస్థం

(గత సంచిక తరువాయి)

> ఇంతవరకూ సాగిన *కథ-12:* పాంచాల దేశాధీశుడు ద్రుపదుడి వల్ల అవమానపడిన ద్రోణుడు అర్జునుడి ద్వారా తన ప్రతీకారం తీర్చుకుంటాడు. అర్జునుడు స్వయంవరంలో ద్రౌపదిని చేపడతాడు. వ్యాసమహర్షి ఆదేశంపై పాండవులయిదుగురికి ద్రౌపదినిచ్చి వివాహం చేస్తాడు ద్రుపదుడు. పట్టాభిషేకానంతరం ధర్మరాజు-ద్రౌపదిని, మిగిలిన సోదరులను తీసుకొని ఖాండవప్రస్థం చేరతాడు. నారదుడి సలహాపై రాజసూయయాగం పూర్తి చేసిన ధర్మరాజు కృష్ణుడుకి అర్ఘ్యమిచ్చేందుకు అభ్యంతరం తెల్పిన శిశుపాలుడిని కృష్ణుడు వధిస్తాడు. మయసభలో తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా పాండవుల సంపదను హరించేందుకు జూదం ఆడేందుకు రమ్మని కబురంపవలసిందిగా దుర్యోధనుడు తండ్రిని కోరతాడు.

ధర్మరాజు సింహాసనంమీద కూర్చునున్నాడు

తమ్ములు నలుగురూ చుట్టూరా వున్నారు

ధౌమ్యుడు గౌరవ పీఠంమీద సుఖాసీనుడై వున్నాడు

ఇంతలో ద్వారపాలకుడు వచ్చి 'మహారాజా! హస్తినాపురంనుంచి రాజ బంధువులెవరో వచ్చారు' అని వార్త అందించాడు

ఎవరై వుంటారా అనుకుంటూనే 'వారిని సకల మర్యాదలతో తీసుకురండి' అని మహారాజు ఆజ్ఞాపించాడు

సేవకులు విదురుణ్ణి వెంటపెట్టుకు వచ్చారు

ధర్మరాజూ, ఆయన సోదరులూ చేతులు జోడించి విదురుడికి నమస్కరించి, ఉచితాసనంమీద కూర్చోబెట్టి అతిధి మర్యాదలు చేశారు

కుంతివచ్చి కుశల ప్రశ్నలు వేసింది

ద్రౌపది వినయంగా నమస్కరించింది

'నీతి విశారదులైన మీ రాకతో మా నగరం పావనమైంది'అంది పాండవపత్ని

విదురుడు తలదించుకున్నాడు

అన్నింటికీ మౌనం వహిస్తున్నాడు

ధర్మరాజు కలవర పడ్డాడు.

'తండ్రీ! -చెప్పండి ఎందుకు విచారంగా వున్నారు? ధృతరాష్ట్ర మహారాజు క్షేమమేనా? హస్తినలో మన వాళ్ళందరూ బాగున్నారా? '

'అందరూ ఐశ్వర్యంతో తులతూగుతున్నారు ఎవరికీ ఏ లోటూ లేదు కాని, భోగం, భాగ్యం అనుభవిస్తూ ప్రాణం హాయిగావున్న వేళే కొందరి బుద్ధి పెడదారిన పడుతుంది. వక్ర మార్గాన నడుస్తుంది ఎదుటివాడి సంపదమీద మోజవుతుంది ధన మెక్కువవుతున్న కొద్దీ మనిషికి పేరాశ కలుగుతుంది ఆశ, అహం, అసూయ ఆవరిస్తాయి ...'

విదురుడు చెప్పినదంతావిని పాండవులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు

'నేను కేవలం వార్తాహరుడిగా వచ్చాను మహారాజా' అన్నాడు విదురుడు

ధర్మరాజు వినయంతో 'ముందు మీరు లేవండి భోజనం చేద్దురుగాని, అలసి వచ్చారు విశ్రమించండి తరువాత తీరుబడిగా మాట్లాడుకుందాం' అన్నాడు.

విదురుడు విషణ్ణ వదనంతో లోపలికి నడిచాడు

భోజనానంతరం, విదురుడు హస్తినాపురం నుండి మోసుకొచ్చిన వార్త ఏమిటా అని పాండుకుమారులంతా ఆయన చుట్టూ చేరి కూర్చున్నారు

చెప్పలేక చెప్పలేక చివరికి విదురుడు చెప్పాడు - 'నాయనా! మీ పెదతండ్రి హస్తినాపురంలో కనకరత్నమయమైన క్రీడా ప్రాంగణాన్ని నిర్మించాడు అది చూడడానికి మిమ్మల్ని రమ్మనీ, సరదాగా పిల్లలు జూదమాడుకుంటారని నాతో' చెప్పి పంపాడు జూదానికి నేను అంగీకరించలేదు జూదంవల్ల వినాశనం సంభవిస్తుందని చెప్పాను. ఆయన నా మాట వినలేదు రాజాజ్ఞకు తిరుగేముంది కనుక కాదంటే కోపగిస్తాడని వచ్చాను నువ్వు యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడివి నువ్వే ఆలోచించుకో.'

విదురుడి కళ్ళల్లో నీళ్ళు నిండాయి

ధర్మరాజు ఆయనకు కళ్ళతోనే వందనం చేసి 'తండ్రీ! ఇందుకు మీరింతగా బాధపడడమెందుకు? ధృతరాష్ట్ర మహారాజుకి పుత్రవాత్సల్యం ఎక్కువ నూరుగురు బిడ్డల తండ్రయి, తన పిల్లల మంచి చెడ్డలు తెలిసుండికూడా వాళ్ళని జూదానికి ప్రోత్సహించాడంటే విధి లిఖిత మనుకో-

**బహుమతులు గెలుచుకోండి!**

# ద్రౌపది సీరియల్

**విడువకుండా చదవండి**

**బహుమతుల పథకం ఉన్నది!**

—ఎడిటర్

వారి ఆయన వెళ్ళమన్నారు మీరు వచ్చారు మీ తప్పేముంది? సభను చూడడానికి రమ్మనడం బాగానేవుందికాని, అందులో కొడుకులు జూదమాడాలనుకోవడం మాత్రం నాకు నచ్చలేదు ఆ జూదంవల్ల మాలో విభేదాలు కలిగినా కలుగవచ్చు మీ పిలుపునూ, ధృతరాష్ట్రుని ఆజ్ఞనూ మేము కాదనలేం పదండి పైన దేవుడున్నాడు' అన్నాడు ధర్మరాజు తమ్ములతో సహా హస్తినాపురానికి బయలుదేరాడు

ద్రౌపదికూడా ప్రయాణమైంది

ముఖ్యమైన పరివారాన్నీ, ధౌమ్యాది విద్వజ్జనులనూ వెంటబెట్టుకుని ధర్మరాజు విదురుడితో సహా హస్తినాపురం చేరుకున్నాడు

* * *

సభామందిరంలో ధృతరాష్ట్రుడు కురువృద్ధులతోనూ, పెద్దలతోనూ, నూరుగురు కొడుకులతోనూ కొలువుతీరి వున్నాడు

'ఇంద్రప్రస్థ మహారాజు విజయం చేస్తున్నారు' అని భటులొచ్చి చెప్పారు

'మహాద్వారంవద్ద నిలబడి పాండవులకు స్వాగతం చెప్పండి సుమంగళీ జనం చేత ద్రౌపదీ దేవికి మధుపర్కాలిప్పించండి' అని ధృతరాష్ట్ర మహారాజు కొడుకులకు ఆజ్ఞ జారీ చేశాడు

దుర్యోధనుడు శకునిని పక్కకు పిలిచి 'నువ్వెళ్ళి వాళ్లకు మర్యాదలు జరిపించు విదురుడు వాళ్ళతో ఏం చెప్పాడో ఏమో పాండవులను జాగ్రత్తగా ఓ కంట కనిపెట్టి వుండు. అవసరమైతే గూఢచారులను నియమించు' అన్నాడు

శకుని హ హ్హ హ్హ అని నవ్వి 'మన పాలబడ్డవాళ్ళు అంత తేలికగా తప్పించుకోలేరులే శకుని కుశాగ్రబుద్ధేమిటో నువ్వే చూద్దువుగాని' అన్నాడు

దుర్యోధనుడు సంతోషించాడు.

ఇంతలో పాండుకుమారులు లోపలికి వచ్చారు

వాళ్ళ వెనకనే ద్రౌపదీ వచ్చింది

సభా భవనాన్ని ఆమె తన అందంతో వెలిగించింది అందరూ సమ్మోహితులై చూస్తున్నారావిడ్ని

పాండవులు ధృతరాష్ట్ర మహారాజుకూ, అక్కడున్న పెద్దలందరకూ పేరు పేరునా నమస్కరించారు. అక్కడినుంచి అంతఃపురంలోకి వెళ్ళారు నక్షత్రాలమధ్య రోహిణిలా, కోడళ్ళ మధ్యవున్న గాంధారీదేవికి ప్రణామం చేశారు

ద్రౌపది పెద్దత్తగారి పాదాలంటి నమస్కరించింది ఆమె వంగినప్పుడు ఆమె కోమల శరీరంలోని కళాభిరమ్యములైన ఆ వంపులు, సుకుమారములైన ఆ గుండ్రని కైదండలు, ఆ అపూర్వ సౌందర్యం చూసేసరికి గాంధారి కోడళ్ళకు శ్వాస గొంతులోనే నిలిచిపోయింది

ఆమె కళ్ళూ, కనుబొమలూ
ముక్కూ, చెక్కిళ్ళూ
పెదవులూ, పలువరుసా
జుట్టూ, చీరకట్టూ
నవ్వూ, నడక తీరూ

నడకలో, ఆ కదలికలో తరంగిత మవుతున్న లావణ్యం చూసి గాంధారి కోడళ్ళు అసూయ పడ్డారు.

ఆరోజల్లా కబుర్లతో గడిచిపోయింది
తెల్లారింది

ధర్మరాజు తమ్ములతో క్రీడా ప్రాంగణం చూడడానికి వెళ్ళాడు

దుర్యోధనుడూ, శకునీ మార్గం చూపిస్తున్నారు అనర్ఘమణి ప్రభలతో వెలుగుతున్న ఆ సభనుచూసి ధర్మరాజు మెచ్చుకున్నాడు

మందిరమంతా చూసిన తరువాత ఆ అపూర్వ సభామణి కుట్టిమంలో పాండవులూ, కౌరవులూ ఆసీనులయ్యారు

'ధర్మరాజా! సరదాగా కొంచెం సేపు జూదమాడుకుందామా! ఆటలో తేలికగా పొద్దుపోతుంది పైగా నీకు జూదంలో మంచి ప్రవేశముందని విన్నాను' అన్నాడు దుర్యోధనుడు

'దుర్యోధనా! వంచనా, జూదమూ క్షత్రియులకు ఉచితమైనవికావు ధర్మ పరులెవరూ వాటిని అంగీకరించరు అందులోనూ రాజులకు జూదం పాపమని అంటారు జూదంవల్ల ధర్మార్థాలు రెండూ నశిస్తాయి. జూదంలో జయించిన సొమ్ము సొమ్ముకాదనీ, ఏదైనా ధర్మంగా సక్రమ మార్గంలో సంపాదించిందే పదికాలాలపాటు నిలుస్తుందనీ మహర్షి దేవలుడు చెప్పాడు అయినా పొద్దుపోవాలంటే ఎన్ని



## తాటిచెట్టు బాబుకి వివాహం!

పాకిస్తాన్‌లో వున్న ఆలమ్ చెన్న ప్రపంచంలో బ్రతికున్న వారందరికన్నా పొడగరి. అతని నిడివి 2మీటర్‌ల 53సెంటీమీటర్‌లు ఈమధ్యనే అతనికి వివాహమైందిట సంప్రదాయబద్ధంగా- ఒక ముస్లిం యువకుడు ఏ విధంగా తల్లి దండ్రులు ఏర్పాటు చేసిన పెళ్లికి అంగీకరిస్తాడో తానూ అట్లాగే యీ పెళ్లికి ఒప్పుకుని ఒక "బెలూచిస్తానీ" అమ్మాయిని వివాహం చేసుకున్నానని ఆలమ్ చెప్పాడు. పెళ్లి అయ్యే దాకా వధువును తాను చూడనే లేదుట పాశ్చాత్య దేశాలలో అతనికి సరితూగే పొడగరిని పెళ్లాడవచ్చును కదా అంటే తాను "మతం జాతి"గల వాణ్ణి అని అన్నాడు.

వ్యాపకాలు లేవు కనుక! సద్గోష్టులు లేవా? సజ్జన సాంగత్యంలేదా?' అని ధర్మరాజు దుర్యోధనుడ్ని వారించాడు

'ధర్మరాజంటే ఇంకా ఏమో అనుకున్నాను. ఇంతేనా! జూదమాడడానికి పిలిస్తే రాననేవాడూ రాజేనా! రాననడం రాచరికానికి తలవంపుకదూ! లోకజ్ఞుడూ, బుద్ధిమంతుడూ, రాజనీతి కుశలుడూ అయినవాడే జూదంలో ఎత్తుకు పైఎత్తు వేస్తాడు. అంతమాత్రం చేత అది మోసమంటే ఎలా? బలహీనులు బలవంతుల్ని జయించాలంటే మాయోపాయాలు తప్పనిసరని రాజనీతే చెబుతోంది. లక్ష్యమల్లా గెలుపు ఇందులో దోషాలూ, మోసాలూ ఏముంటాయి? అయినా నీకంతగా భయమైతే ఆడడం మానెయ్యి అన్నాడు శకుని మధ్యలో కల్పించుకుని.

'భయమేం కాదు. నేను వున్న సంగతి చెప్పాను. మీరు అంతగా కాదు, కూడదు అంటే పిరికితనం ప్రదర్శించేటంత పౌరుషహీనుణ్ణి కాదు. ఆటకు సిద్ధమే' ధర్మరాజు అభిమానంగా అన్నాడు.

శకుని చాటుగా దుర్యోధనుణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు.

### పాచికలాట

చందన, కర్పూర, కస్తూరీ జలాలతో అలికి క్షణాలమీద ద్యూతరంగాన్ని సిద్ధం చేశారు.

కౌరవులూ, పాండవులూ చుట్టూరా కూర్చున్నారు

గంధ పుష్పాలతో అర్చించిన అక్షాలలో తనకు కావల్సినవి ధర్మరాజు తీసుకున్నాడు.

'ఇంతకూ నాతో జూదమాడే వాళ్ళెవరు?' పాచికలు చేతబట్టి అడిగాడు అజాత శత్రుడు.

'శకునిమామ నా పక్షాన నీతో ఆడతాడు. అతను ఒడ్డిన ధనరాసులేవైనా నేను నీకు కాదనకుండా ఇస్తాను' దుర్యోధనుడు శకుని వైపు చూస్తూ అన్నాడు.

'ఒకరు ఆడాల్సిన ఆట మరొకరు ఆడటం ధర్మం కాదు.'

'ఎవరాడితే నీకేం. మాలో ఎవరైనా ఒక్కరేగా నీతో ఆడేది'

ధర్మరాజుకి మనసంతా పాడైంది.

శకునితో ఆడాల్సొస్తుందని తెలిస్తే తను అసలీ ఆటకు ఒప్పుకునేవాడు కాదు






'శకునీ నువ్వంటే నాకు అసహ్యం, నిజం చెప్పాలంటే నువ్వున్నచోట నేను పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టను నీతో ఆట పాముతో చెలగాటం నువ్వు మాకు మామవని చెప్పుకోడంకూడా నాకు సిగ్గు' అని పెద్దగా అరవాలనిపించింది కాని అరవలేకపోయాడు

శకుని విరగబడి నవ్వాడు

'పాపం! యుధిష్ఠిరుడికి భయంగా వున్నట్టుంది రాజసూయం పుణ్యమా అని కోశాగారం నిండింది తీరా యిప్పుడు పాచికలాటకు కూర్చుంటే కూడబెట్టు-కున్నది కాస్తా ఎక్కడ మాయమ-వుతుందోనని దిగులుపడుతున్నట్టున్నాడు పోన్లే భయపడుతూ మాత్రం ఆడకు' అన్నాడు శకుని వెక్కిరింపుగా ధర్మరాజుకి తలకొట్టేసినట్టయింది

తనకు డబ్బు మోహమే తెలీదన్నట్టు మాట్లాడుతున్నాడీ శకుని

'ఇదిగో నా బంగారు ఆభరణాలూ, ముత్యాల హారాలూ పందెంగా పెడుతున్నా-ను' అన్నాడు ధర్మరాజు శకుని దుర్యో-ధనుని వైపు చూసాడు

'మామా! అంతకు అంతా పందెం-గా పెట్టు' అని మెళ్ళోని గొలుసులూ, చేతి-కున్న రత్న కంకణాలూతీసి శకుని చేతిలో పెట్టాడు దుర్యోధనుడు

ఆట ప్రారంభమైంది

భీష్మ, ద్రోణ, విదుర కృపాచార్యులు ఆటను ఆసక్తితో చూస్తుకూర్చున్నారు

శకుని పాచికలు చేతిలోకి తీసుకుని నేలమీద దొర్లించాడు

శకునే పందెం గెలిచాడు

గెలుపు నాస్వంతమన్నట్టు అతను చిరునవ్వు నవ్వాడు

పాండవాగ్రజుడికి పట్టుదల ఎక్కు-వైంది

వేలకొద్దీ బంగారు నాణేలనూ, వజ్ర వైఢూర్యాలనూ పందెంగా పెట్టాడు

దుర్యోధనుడు కూడా ఆ పందేనికి సరేనన్నాడు

శకుని మళ్ళీ పాచికలు వేశాడు

ఈసారికూడా అతనే జయించాడు

ధర్మరాజు మొహంలో రక్తం అంతా ఇంకిపోయినట్టు పాలిపోయింది జరగ-కూడని అన్యాయమేదో జరిగిపోయినట్టు స్పష్టంగా తెలుస్తోంది కాని ఏమీ చెయ్యలేని అశక్తుడు

ఏదో అనబోయి వూరుకుని 'వజ్ర వైఢూర్య, మరకత, మౌక్తిక, నీలప్ర-వాళ, పద్మ రాగ మణులతో కూడిన రత్న భాండాగారాలన్నీ పణంగా పెడ్తున్నా-ను' అన్నాడు

జూదం తాలూకు నిషా ధర్మరాజు-కి అప్పటికే ఒళ్లంతా పాకింది శకుని వుచ్చులో ధర్మరాజు తేలికగా పడ్డాడు

- స్త్రీ లోలత, డబ్బు సంపాదన, జూదం, మధుపానం ఇవన్నీ కొండచరియల్లో సన్నటి జలపుట్టినట్టు మనిషిలో మెల్లగా ప్రారంభమై ఉవ్వెత్తుగా లేచి సాధుతత్వా-న్నీ సజ్జనత్వాన్నీ అధిగమించి మనిషిలోని మృగాన్ని మేలుకొలుపుతాయి

ఇవన్నీ మొదట్లో అలవాట్లు
ఆ తరువాత వ్యసనాలు.

వ్యసనాల్లో చిక్కుకోకుండా వుండడ-మే తేలిక, కాని ఆ అలవాట్లకు బానిస-యిన వాణ్ణి ఆపటం మాత్రం తేలికకా-దు అందులోనూ జూదం, అదీ రాజుల మధ్య, దుర్యోధనుడి నోటికి భయపడి భీష్మ, ద్రోణ, కృపాచార్యులెవరూ నోరు మెదపలేదు ధర్మరాజు వైపు జాలిగా చూశారు తానెలా వంచింపబడుతున్నా-డో తెలియకుండా అమాయకంగా శకుని మాయలో పడి ధర్మరాజు తన ఆస్తంతా దోచిపెడుతున్నాడని వాళ్ళు బాధపడ్డారు

పాచికలువేసి ఈసారి నేనే గెలిచా-నన్నాడు శకుని అతని మొహంలో గర్వం కొట్టొచ్చినట్టు కన్పించింది

ధర్మరాజు ఆ గర్వం సహించలేక పోయాడు

తనకున్న ధన, కనక, వస్తు వాహ-నాలన్నీ ఒడ్డి ఆడడం మొదలుపెట్టాడు

ఏ ఒక్కసారీ గెలవలేదు

బంగారం, వెండి, రత్నాలూ, ముత్యా-లూ, రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, యోధులూ, సేవకులూ, చివరికి ఆహా-రధాన్యా లూ, వంట పాత్రలూ కూడా పణంగా పెట్టాడు

ఫలితం లేకపోయింది

ధర్మరాజు ఆవేశపడ్డాడు

దేవ బ్రాహ్మణులకిచ్చిన అగ్రహారాలు తప్ప మిగిలిన రాజ్యాన్నీ, తన సామంతుల-నూ, ప్రజలనూ కూడా ఈసారి పందెంగా పెట్టాడు

ఈసారీ శకునే గెలిచాడు

అదిచూసి విదురుడు భయపడ్డాడు

'ఇది అన్యాయం' అని అరిచాడు గట్టిగా పళ్ళు బిగించి క్రీడా మందిరం-లో ఒక్కసారిగా నిశ్శబ్దం వేరుకుంది విదురుడు ధృతరాష్ట్రుడి దగ్గరకు వెళ్ళి ఎదురుగా నిలబడ్డాడు అందరూ ఆయన వైపు కళ్ళప్పగించి చూస్తున్నారు

'మహారాజా! సర్వ నాశనం సంభ-వించబోతోంది, నీ కొడుకు పుట్టడమే అపశకునాలతో పుట్టాడు ఆనాడు నక్క-లు ఎంత హృదయ విదారకంగా అరిచా-యో నీకు గుర్తుండే వుంటుంది వంచ-న, పాపం, మోసం, ద్వేషం, ఈర్ష్య, అసూయ అంటే తెలియని ప్రతీప, శంతన మహారాజుల కులం నీ కొడుకువల్ల మయ-లపడింది పాపభూయిష్ఠమైంది గుణహీ-నుడైనవాడు కొడుకైనా సరే వాణ్ణి చంపి కులాన్ని రక్షించడం ధర్మమని శుక్రుడు చెప్పాడు వంశ గౌరవాలు మంట గలిసి-పోకుండా వుండేందుకే అంధక, యాదవ, వృష్ణి వంశ వీరులంతా కలసి కంసుణ్ణి కృష్ణుడి చేత చంపించారు నా మాట విను పక్షపాతం విడిచి చెబుతున్నాను

నీ కొడుకు చాలా దుర్మార్గుడు అతనిని రాజ్యంనుంచి బహిష్కరించి కౌరవ వంశాన్ని రక్షించు ధన వ్యామోహంతో నీ కొడుకు కురుకులానికే హాని తలపెట్టాడు పాండవులతో వైరం సామాన్యం కాదు గడ్డితినే ఎద్దు కొండను ఢీకొంటే జరిగేదేమిటో నీకు తెలుసు ఇంక ఉపేక్షించకు లే ఈ జూదం వారించు' అన్నాడు విదురుడు

కాని ముసలి రాజేం మాట్లాడలేదు

క్రీడాభవనమంతటా మళ్ళీ నిశ్శబ్దం అలుముకుంది నేలమీద పాచికలు దొర్లుతున్నప్పుడయ్యే చప్పుడు మినహా మరే రకమైన శబ్దమూ లేదు

' ఇదిగో ఈయన సంగతేదో కాస్త చూడండి' అని సైగ చేసినట్టున్నాడు దుర్యోధనుడు నలుగురు భటులొచ్చి విదురుడి చుట్టూ నిలబడ్డారు

వాళ్ళు వచ్చి విదురుడ్ని బయటకు తీసుకు వెళ్లేలోపున దుర్యోధనుడు అరిచేడు -

' నువ్వనవసరంగా మా విషయాల్లో జోక్యం చేసుకోకు మా సొమ్ము తింటూ, మమ్మల్ని నిందిస్తూ, మాకు ఇష్టం లేని పాండవులను పొగడడానికి నీకు సిగ్గులేదూ।

తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టే నువ్వా, నేనా పాపాత్ములం నిన్ను దగ్గర పెట్టుకోవడం తొడమీద త్రాచుపామును పెట్టుకున్నట్టుంది నాకు ఉపాయంతో శత్రు సంపదను స్వాధీనం చేసుకోవడం రాజ ధర్మం కాదా!''

విదురుడు మాట్లాడలేదు

'చెప్పవేం?'

. .

'నాకు తెలుసు మా గెలుపు నీకు ఎప్పుడూ ఆనందంగా వుండదు '

విదురుడు నిర్లిప్తంగా నవ్వి 'ఎదుటివాళ్ళ మంచితనాన్ని నువ్వూ, నీ మామా కలిసి మాయోపాయాలతో మోసం చెయ్యటం రాజధర్మమా?'' అన్నాడు

'ఇందులో మోసం ప్రసక్తి ఏముంది? ఇద్దరమూ ఆడుతున్నాం అతను ఓడిపోతున్నాడు '

'ఇదంతా న్యాయబద్ధమేనంటావా?'

'న్యాయం కాకేముంది? పాచికలేస్తున్నాం పందెం గెలుస్తున్నాం '

'ఆత్మ వంచన చేసుకోకు దుర్యోధనా, అసలు జూదమే రాజులకు నిషిద్ధం పందేలు కాయడం, మనుషుల బలహీనతల మీద స్వారీ చేయడం రాజులకు తగని పని అర్థలోభంతో మాయోపాయాలు పన్నడం మంచిదికాదు కోశాగారం నింపుకోవడం కోసం ఏ ఉపాయాలు చేసినా ధర్మ మార్గాన్ని అతిక్రమించనివిగా వుండాలి '

దుర్యోధనుడిలో కోపం కట్టలు తెంచుకుంది

'అసలు నిన్నువెవరడిగారని సలహా చెప్పొచ్చావు? నా ఉప్పు తింటూ నన్నే ఇలా నోటికొచ్చినట్టు మాట్లాడతావా! నువ్వు నాకేం బుద్ధులు చెప్పక్కర్లేదు నువ్వంతగా చూడలేకపోతే ఇక్కడనుంచి వెళ్ళిపో' అన్నాడు తిరస్కారంగా.

'వినాశకాలే విపరీత బుద్ధిః' అనుకున్నాడు విదురుడు

(ఇంకావుంది)

# నిద్ర కూడ సౌందర్య సాధనమే!

అందంగా ఉండాలని అందరూ ఆశపడతారు అలా ఉండాలని సౌందర్య సాధనాలకై బోల్డంత ఖర్చు పెడతారు

ప్రొద్దుటే హడావుడిగా నిద్రలేచి మోగుతున్న అలారం పీక నొక్కి అర్జెంటుగా కాలకృత్యాలు తీర్చుకోవడం, బాత్రూం లోకి పరిగెత్తిన చాలమందిని అక్కడి అద్దం మన ప్రతిబింబాన్ని చూపించి వెక్కిరిస్తుంది

మన ప్రతి రూపాన్ని చూసి మనమే ఆశ్చర్యపోతూ "నేను వాడుతున్న ఈ క్రీమ్‌లు, పౌడర్లు, విటమిన్ టాబ్లెట్స్- అన్నీ ఏమైపోతున్నాయ"ని వాపోతాం

జీవం లేని కళ్ళు, కాంతి లేక పాలిపోయినట్లున్న చర్మం, పీక్కు పోయిన శరీరం- మనల్ని వెంటాడి నిస్సత్తువకి గురి చేస్తాయి అలా కొన్నాళ్ళు సాగేసరికి అది మనకొక తీరని సమస్యగా తయారవుతుంది

ఇది ఒక పెద్ద సమస్య కాదని నిద్రలేమి మాత్రమే దీనికి కారణమని తెలియగానే మనం నిజంగా ఆశ్చర్యపోతాం

కాని ఇది నిజమే! నిద్రకూడ ఒక సౌందర్య సాధనమే!

అందంగా మెరిసే కళ్ళకి, కాంతివంతమైన శరీరానికి, గులాబీ కాంతులీనే బుగ్గలకి- నిద్ర చాల అవసరమే కాదు, ముఖ్యం కూడ!


మన్నెం శారద

"మేం చాలసేపు పడుకుంటాం అయినా మా మొహాలు పీక్కు పోతూనే వుంటాయ"ని కొందరనుకోవచ్చు, అంటే వీరు సరైన పద్ధతిలో నిద్రపోలేదని అర్థం

నిద్ర ప్రకృతి పరంగా మనిషికి విశ్రాంతి నివ్వడానికి దేవుడిచ్చిన వరం నిద్ర కావాల్సినంత లేక పోతే మానవ యంత్రం సవ్యంగా నడవదు

నిద్రకి ఉపక్రమించే ముందు మనం దాన్నొక దిన చర్యగా భావించక మనం ఎంత బాగా విశ్రాంతి తీసుకోగల్గుతున్నా 'మనే ది ఆలోచించాలి. అంటే రాసికన్నా వాసి ముఖ్యమన్న మాట!

విశ్రాంతికి బాగా ఉపయుక్తమైనది శవాసనం ఈ ఆసనం వేసి కొన్ని క్షణాల్లో ఎన్నో గంటల నిద్రపోయిన విశ్రాంతిని పొందవచ్చు

చాప మీదగాని, దళసరి దుప్పటి మీదగాని వెల్లికిలా పడుకొని కాళ్ళు చేతులు సడలిం

# విద్యార్థులలో అశాంతి ఎందుకు?

## సంఘ జీవనం

విద్యార్థులలో 'అశాంతి' అవధులుదాటి ప్రవహించి విద్యా వ్యవస్థను అస్తవ్యస్తం చేస్తున్నదీనాడు ఈ అశాంతికి సంఘం, తల్లి-దండ్రులు, ఉపాధ్యాయులు ఆపైన స్నేహితులు నాలుగు స్థంభాలై నిలిచారు అంటున్నారు ప్రొద్దుటూరు వ్యాయామ కళాశాల ప్రిన్సిపాల్ డా పరమేశ్వరరామ్

రెండవది- విద్యార్థుల తల్లిదండ్రులు వీరు తమ పిల్లలు ఎలా ప్రవర్తిస్తున్నారు, ఏం చేస్తున్నారని సరిగా గమనించడము లేదు తల్లిదండ్రుల ప్రవర్తన క్రమబద్ధంగా వుంటే పిల్లలు చెడిపోయే అవకాశము చాల తక్కువనే చెప్పాలి.

మూడవది- విద్యార్థుల ప్రవర్తనపై ఉపాధ్యాయుల ప్రభావం ఎక్కువగా వుంటుందనేది సత్యం కొందరు 'టీచ్' చెయ్యడానికి బదులు 'చీట్' చేస్తున్నారంటే అతిశయోక్తి కానేరదు ఆదర్శప్రాయుడుగా వుండవలసిన అధ్యాపకుడు, అధ్వాన్నంగా ప్రవర్తిస్తే, విద్యార్థుల జీవితములో అశాంతి అలుముకుంటుంది కుల, మత, వర్ణ, వర్గ దురభిమానాలతో అధ్యాపకులు ప్రవర్తించిననాడు కళాశాలలు అశాంతికి స్థావరాలు కాక మానవు



డా పరమేశ్వరరామ్,
ప్రిన్సిపాల్, వ్యాయామకళాశాల, ప్రొద్దుటూరు

నాల్గవది- ఓ వ్యక్తి చెడిపోవడానికిగానీ, బాగుపడటానికిగానీ స్నేహితుల ప్రభావం ఎక్కువగా వుంటుంది తీరిక సమయాల్లో ఏ సెంటర్‌లోనో, ఏ సినిమాహాలు దగ్గరో గడిపే కంటే క్లాస్ అయిన తరువాత, ఆటల మైదానములోనో, లైబ్రరీలోనో విద్యార్థులు గడపగలిగితే ఈ అశాంతి సగం తగ్గుతుంది అశాంతికి అసలు కారణం కొన్ని వార్తా పత్రికలు, మాగజైనులంటే ఆశ్చర్యపడనవసరము లేదు ఏదో కాలేజీలో ఏదో విషయములో అధ్యాపకుల నెదిరించిన విద్యార్థుల విజయం అంటూ పతాక శీర్షికలో ప్రచురిస్తే, ఎదిగీ ఎదగని మనస్తత్వమున్న విద్యార్థులు, తాము కూడా ప్రయోగం చెయ్యాలనుకోవడంలో పొరపాటేముంటుంది అందువలన విద్యార్థులలో అశాంతికి సంఘం, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, స్నేహితులు నాలుగు స్తంభాల వంటివారు ఈ నాలుగు స్తంభాలలో ఒకదాన్నైనా నశింపజేయగలిగితే అశాంతి భవనం అదే పడిపోతుంది'

(ఇంటర్వ్యూ:
శ్రీమతి వి. విజయలక్ష్మిరెడ్డి)

---

చినట్లు వదిలి కళ్ళు మూసుకొని నిశ్చింతగా పడుకోవడాన్నే శవాసన మంటారు

# నిద్రకి ఏమి కావాలి?

మంచి నిద్రకి కావల్సినవి రెండేరెండు ఒకటి మంచి వాతావరణమైతే రెండవది ఆరోగ్యమైన శరీరం

వాతావరణంలో మొదట గుర్తుంచుకోవాల్సింది మంచి పక్క

మనం వేసుకొనే పరుపు మరీ కఠినం, మరీ మెత్తగానూ ఉండకూడదు మెత్తటి పక్క తప్పని సరిగా వెన్నెముకకి హాని చేసి తీరుతుంది తలగడ కూడ వత్తుగా, ఎత్తుగా ఉండకూడదు అలాంటి దిండు మెడ ఎముకలకి, కండరాలకి హాని చేస్తుంది

ఇక పోతే పడక గది ధారాళంగా గాలి వచ్చేది గాను ఇంట్లో ఒక పక్కకి ప్రయివసి కల్గి ఉండేదిగానూ వుండాలి కాంతి నిద్రని భంగం చేస్తుంది కాబట్టి వీలయినంత వరకు పడక గదిలో దీపాలు ఉంచకూడదు మురికి, తడి లేకుండా పడకగదిని శుభ్రంగా ఉంచుకోవాలి అంతే గాక పిల్లల్ని పక్కల మీద ఆడనివ్వకూడదు అలాగే చెప్పులు, మురికి పట్టిన బట్టలు, తడి టవల్సు పక్కగదుల్లో ఉంచకూడదు

తాగేసిన పాలగ్లాసులు, తినేసిన ప్లేట్లు మంచాల మీద వదలకూడదు పడుకునే ముందు దులిపిన శుభ్రమైన లేత రంగు దుప్పట్లు మంచం మీద పరచాలి. జుట్టుముడి వదులు చేసుకొని, పిన్నులు తీసేసి పడుకోవాలి.

ఇక శరీరారోగ్యం గురించి వస్తే ముఖ్యంగా మలబద్ధకం లేకుండా చూసుకోవాలి. నిద్రకి రెండుగంటల ముందర భుజించాలి అలాగే మసాల వున్న ఆహారం రాత్రి పూట తినకూడదు. కొంతమంది పడుకోగానే అప్పుడే సమయం దొరికినట్లు సమస్యల గురించి ఆలోచించడం మొదలు పెడతారు. దానితో వినుగు, అసంతృప్తి, స్వయం సానుభూతి మొదలై నిదుర పట్టదు.

నిదుర పోయేముందు కొంచెం సేపు ఎవరైన స్నేహితులకి ఉత్తరం కాని, ముఖ కండరాలకి విశ్రాంతి నిచ్చే కొద్దిపాటి వ్యాయామం కాని, ఏదైనా సంతోషకరమైన జ్ఞాపకాలని గుర్తుతెచ్చే ఫోటోలు చూడటం గాని, మంచి పాట వినడం కాని చేయాలి ఇవి మెదడుకి ఎంతో హాయిని, సంతోషాన్ని కల్గించి విశ్రాంతి నిస్తుంది

పగటి శారీరక శ్రమ రాత్రిపూట నిద్రకి టానికలా పని చేస్తుంది

# నెలరోజుల తర్వాత అద్దంలో చూసుకోండి

# నిద్రలో భంగిమ

నిద్రపోయే పొజిషన్ కూడ సక్రమంగా ఉండాలి. ఏటవాలుగా పడుకొని వెన్నెముకని వంచకుండా మోకాళ్ళు కొద్దిగా వంచి పడుకోవడం మంచి పద్ధతి ముఖ కండరాలకి చేతులు వత్తిగిలి పెట్టకూడదు. 'బాగా నిద్రపో బాగా కనిపించు' అంటే పగలు కూడ నిద్రపొమ్మని అర్థం కాదని గుర్తుంచు కోండి. ఈ విషయంలో త్వరగా పడుకొని త్వరగా లేవమనే సిద్ధాంతాన్ని గుర్తుంచు కోవాలి.

ఇలా చేసి ఒక నెల తర్వాత మీ మొహంలో వచ్చే మార్పుని మీరే గమనించుకోండి!

ఒకటే తళతళ! ఒకటే మిలమిల!

సీరియల్

# పంచశూలమ్

విశ్వప్రసాద్

> ఇంతవరకూ సాగిన కథ-*16:* జోషి కేసు దర్యాప్తులో భాగంగా పంచశూలమ్ పంపిన యువకుడు ఇన్‌స్పెక్టర్'షా'గా చెలామణి అవుతుంటాడు. జయరాజ్ కొడుకు మోహన్‌తో పెళ్లి కావల్సిన గురూజీ కూతురు మీనాక్షి అంధురాలై తర్వాత కన్నుమూస్తుంది. పంచశూలమ్ మోహన్‌ని కిడ్నాప్ చేసి హత్య చేయిస్తాడు. ఎం.ఎల్.ఎ. దీపాదేవి మాజీ భర్త భీమరాజు పోలీసు లాకప్‌లో హత్యకు గురవుతాడు. తన కుటుంబానికి చేసిన అన్యాయానికి ప్రతీకారంగా పాకిస్తాన్ పారిపోతున్న దీపాదేవిని భీమరాజు కూతురు ఊర్వశి కాల్చి చంపుతుంది. తన కారు డిక్కీలో వున్న తెగిన తలకాయ కొడుకు మోహన్‌దని తెలిసి అవాక్కవుతుంది పరిమళ. తన మరో కొడుకు మదన్- మోహన్‌ని చంపాడని పంచశూలమ్ పరిమళకు తెలియజేస్తాడు.

(గత సంచిక తరువాయి)

అదే సమయంలో-

'ధన్ '

ఓ రివాల్వర్ గుండు ఆమె గుండెల్లో దూసుకుపోయింది

కెవ్వున అరిచింది పరిమళ

ఉలిక్కిపడ్డాడు వెనక్కి తిరిగి చూశాడు పంచశూలమ్

పరశురాముడిలా - రివాల్వర్ పట్టుకుని, గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడు మదన్!

అతన్ని చూసి, మరో మారు కెవ్వున అరిచి, నేల మీద కూలిపోయింది పరిమళ

ఆమె రక్తంతో తడిసి, ఆరిపోయింది ఫిల్మ్!

కొన్ని క్షణాలపాటు స్తంభించిపోయాడు శాంత గంభీరంగా నిలబడిపోయాడు పంచశూలమ్

అతని ముఖ కవళికలు, ఆకారం చూసేసరికి ఒణికిపోయాడు మదన్ "శూలమ్ సాబ్!" అన్నాడు కంగారుగా

అప్పటికీ పంచశూలమ్‌లో చలనం కలగలేదు చూపులో కదలిక లేదు నోటి నుంచి మాట రాలేదు

"క్షమించండి, సాబ్! అలాంటి రాక్షసి ప్రాణాలతో ఉండకూడదు" నెమ్మదిగా అన్నాడు మదన్

మాట్లడలేదు పంచశూలమ్ చిన్నగా నిట్టూర్చాడు సోఫాలో కూర్చున్నాడు తల వెనక్కి వాల్చాడు భారంగా కళ్లు మూసుకున్నాడు "మదన్!" అన్నాడు అస్పష్టంగా

"సాబ్!"

"మంచినీళ్లు "

పరిమళను తను చంపడం వల్ల, అతని హృదయానికి ఎంతో బాధ కలిగించిందని అర్థంచేసుకున్నాడు మదన్

గబ- గబా ఫ్రిజ్ దగ్గరకెళ్లి వాటర్ బాటిల్ తీశాడు పెద్ద గాజు గ్లాసులో నీళ్లు పోశాడు "సాబ్! మంచినీళ్లు" అన్నాడు మదన్

కళ్లు తెరవలేదు పంచశూలమ్ రెండు గుక్కలు నీళ్లు తాగాడు కళ్ల జోడు తీసి, పక్కన పెట్టాడు చేతిలో నీళ్లు పోసుకున్నాడు చన్నీళ్లు కళ్ల మీద చల్లుకున్నాడు బొట బొటా కారుతున్నాయి నీళ్లు!

"స్థాణువులా అయిపోయాడు మదన్

పంచశూలమ్ కళ్ల మీద నుండి జారుతున్నవి చన్నీళ్లో, వేడి కన్నీళ్లో అర్థం కాలేదు అతనికి!!!

జేబు రుమాలు తీసుకున్నాడు పంచశూలమ్ చాలా సేపటివరకు కళ్లు ఒత్తుకుంటూనే ఉండిపోయాడు

చన్నీళ్లు ఆరిపోయాయి

కాని, కన్నీళ్లు కారుతూనే ఉన్నాయి!

"వెరీ వెరీ సారీ సాబ్!" అపరాధిలా నిలబడి, నెమ్మదిగా అన్నాడు మదన్

"దట్సాల్ రైట్ మై బోయ్! కాని, ఆమె ఎవరో తెలుసా?" బరువుగా ప్రశ్నించాడు పంచశూలమ్

"రాక్షసి విష జంతువు క్రూరమృగం . "

"కావచ్చు కాని, ఆమె నిన్ను కన్న తల్లి "

పంచశూలమ్ యింకా ఏదో అనబోతుండగా మధ్యలో అందుకున్నాడు మదన్

"క్షమించండి, శూలమ్ సాబ్, మీరు చెప్పినంత మాత్రాన ఆమె నా తల్లి అని ఎలా అనుకోను? ఆమె పాలివ్వలేదు నాకు ఆమె చేత్తో అన్నం ముద్దలు తినలేదు ఆమె లాలన పాలనలు పొందలేదు ఆమె ఒళ్లో పడుకోలేదు ఆమె అదుపాజ్ఞలో పెరగలేదు అకస్మాత్తుగా ఓ ఆడదాన్ని చూపించి - ఆమె నా తల్లి అంటే, నమ్మలేను నమ్మినా, గౌరవించలేను ఆదరాభిమానాలు చూపించలేను, శూలమ్ సాబ్! నేను పెరిగిన వాతావరణంలో స్నేహానికి, మమకారానికి, రక్తసంబంధానికి, బంధుప్రీతికి తావులేదు "

అతని మాటలు విని, మరో మారు భారంగా కళ్లు మూసుకున్నాడు "ఆల్ రైట్ మై బోయ్! నీతో వాదించడానికి గాని, నిన్ను ఒప్పించడానికి గాని నా దగ్గర పాయింట్స్ లేవు నో ఆర్గ్యుమెంట్స్ ఆమె శవాన్ని వాళ్ల యింటి దగ్గర విడిచిపెట్టిరా" అని, గ్లాసులోని నీళ్లన్నీ ఒక్కసారిగా కళ్లమీద పోసుకున్నాడు పంచశూలమ్

## 64

తెల్లవారబోతోంది కాని, యింకా చీకటి తెరలు తొలగలేదు జయరాజ్ భవనం

ముందు గుంపులు- గుంపులుగా పోగయ్యారు జనం!

నౌకర్లు, పనివాళ్లు ఎక్కడి వారక్కడ నిలబడిపోయారు!!

స్తంభానికి జారబడి, జీవచ్ఛవంగా నిలుచున్నాడు జయరాజ్!!!

అతనికి రెండు వైపుల ఉన్న విశాలాక్షి, గురూజీలు తలలు వంచుకుని, నేలను చూస్తున్నారు

ఎవరి ముఖంలోను రక్తంలేదు, జీవం లేదు, తలెత్తుకునే ధైర్యంలేదు

ఆ యింటికి కొంత దూరంలో, తన టూరర్ కారును ఆపుజేశాడు మదన్

అతని పక్క సీటులోనే కూర్చుని ఉంది ఊర్వశి దృష్టిని జయరాజ్ భవనం వైపుకు సారించింది కెవ్వున అరవబోయింది

చటుక్కున ఆమె నోరు నొక్కాడు మదన్. "నువ్వింత పిరికిదానివనుకుంటే, తీసుకొచ్చేవాడిని కాను అదేం నీ అమ్మా, నీ అత్తా? ఎందుకంత కంగారు పడతావ్?" - అన్నాడు

మరోమారు భవనం గేటు మీదకు దృష్టిని సారించింది ఊర్వశి

అయిదు మీటర్ల ఎత్తుగల యినుప గేటు 'అది'

ఓ గేటుకు - పై నుండి వేలాడగట్టబడి ఉంది పరిమళ శవం!!

ఆ చివర, ఈ చివర తాడు కట్టిన చిన్న బోర్డు- మంగళసూత్రంలా శవం మెడలో వేలాడుతోంది!!!

అందులో-

'నీతి, జాతి లేని పతితల జీవితాలకు యిలాంటి దుర్గతే పడుతుంది' - అని ఉంది

శవాన్ని చూసి, బోర్డు మీది అక్షరా-



# ఆంధ్ర సచిత్ర వార పత్రిక



## వినాయక చవితి సంచిక

ఎప్పటివలె యీ సంవత్సరం వినాయక చవితి సంచిక కూడా ఆంధ్ర సచిత్ర వార పత్రిక జన్మ దిన సంచికగా వెలువడుతుంది ! రచయితలు, చిత్రకారులు ప్రత్యేక రచనలను వినాయక చవితి సంచిక, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం అన్న చిరునామాకి పోస్టు చేయాలి కార్టూనిస్టులు "విఘ్నేశ్వరు"ని మీద వ్యంగ్య చిత్రాలు పంపనక్కరలేదు. వ్యాసకర్తలు హాస్య రచనలు పంపినట్లే కార్టూనిస్టులు కూడా యితర అంశాలపై కడుపుబ్బ నవ్వించే కార్టూన్‌లు పంపడం మంచిది.

- ఎడిటర్

లు చదువుకుని దుఃఖంతో, భారంగా కళ్లు మూసుకుంది ఊర్వశి

"డార్లింగ్! నువ్వెందుకు బాధపడతావ్?"

"రేపు నా గతీ యింతేగా?"

"నువ్వు పతితవు కాదు- వెలయాలివి"

"అంటే?"

"నీ శరీరాన్ని అమ్ముకుంటున్నావు పతివ్రతనని చెప్పకోవడం లేదు డబ్బిచ్చిన వాళ్లకు కొంత సేపు నీ వొళ్లిస్తున్నావు "

"ఆమె?"

"ఓ వ్యక్తిని ప్రేమించినట్లు నటించింది అతనితో తన కామాన్ని తీర్చుకొంటూ ఓ కొడుకును కన్నది మరొకణ్ణి పెళ్లి చేసుకుని యింకో కొడుకును కన్నది అది పతిత, వంచకి, మోసగత్తె "

"ఈ వ్యత్యాసం నా కర్థం కాలేదు"

"వెరీ సింపుల్ ఒకరికి వొళ్లిచ్చి, నమ్మించి, మోసగించేది పతిత, కులట, చరిత్ర హీనురాలు... తను వెలయాలునని చెప్పకుని, డబ్బు తీసుకొని సుఖాన్ని యిచ్చేది వ్యభిచారిణి మాత్రమే "

మౌనం వహించింది ఊర్వశి

కొన్ని క్షణాలు వూరుకున్నాడు మదన్ "నీకు పిల్లలున్నారా? " చటుక్కున ప్రశ్నించాడు

అతని ప్రశ్న విని ఉలిక్కిపడింది "లేరు " అంది ఊర్వశి

"పిల్లల్ని కనాలనే కోరిక లేదా?"

"ఉంది కాని, అణుచుకుంటున్నాను."

"ఎందుకు?"

"పుట్టిన బిడ్డకు తండ్రి ఎవరని అడిగితే- ఏమని చెప్పను? ఎవరని చెప్పగలను?? గద్గద స్వరంతో అంది

"నా వల్లే నీకు ఆ అవకాశం వస్తే పుట్టబోయే బిడ్డకు నేనే తండ్రినని అంగీకరిస్తే ఏం చేస్తావ్?"

"లక్షణంగా బిడ్డను కంటాను "

"తర్వాత?"

"ప్రాణానికి ప్రాణంగా పెంచుతాను "

"కాని, ఆమె అలా చెయ్యలేదు బిడ్డను కని, ఓ భిక్షగత్తెకు పారేసింది ప్రేమ మమకారాలు తెలియని మృగంలా ప్రవర్తించింది పాతికేళ్ల పైబడిన కొడుకు కనిపించేసరికి ఈనాడు పోలీసులకు అప్పగించడానికి సిద్ధమైంది. అందుకే, ఆమె అలాంటి క్రూరమైన శిక్షకు గురి అయింది "

"భగవంతుడా! అటువంటి దుర్గతి పట్టకుండా కాపాడు."

"డోంట్ వర్రీ డార్లింగ్! నేను బతికున్నంత వరకు నీకు ఏ కష్టం కలగదు అంతవరకు గ్యారంటీ కాని, నా జీవితానికి గ్యారంటీ లేదు " ఇంకా ఏదో చెప్పబోయాడు మదన్.

అదే సమయంలో-

ఓ పోలీసు జీపు, వేను, అంబులెన్సు వరుసగా వచ్చాయి మదన్, ఊర్వశి ఉన్న టూరర్ కారు ముందు నుండి వెళ్లి, గేటు ఎదుట ఆగాయి జీప్‌లో కూర్చున్న సుభాష్ వాళ్లిద్దర్నీ చూశాడు కాని, చూడనట్లు నటించాడు.

వాళ్లిద్దరు అతన్ని చూశారు కాని విష్ చెయ్యలేదు

జీప్‌లోంచి దిగి "జనాన్ని తొలగించండి" అని ఆజ్ఞాపించాడు షా వేషంలో నున్న సుభాష్- తన అనుచర బృందానికి

"పరిమళ కారు డిక్కీలో ఆమె కొడుకు తల దొరికింది నిన్న ఇన్‌స్పెక్టర్ షా కూడా చూశాడు తన కొడుకును ఆమె హత్య చెయ్యదని, ఎవరో విరోధులు ఆ పని చేసి, అతని తల ఆమె కారు డిక్కీలో పెట్టారని భావించాడు షా అలా క్కాకుండా, అనుమానం మీద ఆమెను నిన్న అరెస్ట్ చేసి ఉంటే, యింత ఘోరమైన చావు చచ్చేది కాదు." కసిగా అన్నాడు మదన్

అక్కడిపరిస్థితులు, వాతావరణంచూస్తుంటే ఊర్వశి హృదయం ద్రవించుకు పోయింది ఎవరో కడుపులో చెయ్యి పెట్టి కెలికినట్లయింది "డియర్! నా తల తిరిగిపోతోంది వెళ్లిపోదాం, పద" అంది

ఆ భయంకరమైన దృశ్యాన్ని కర్మకాండను ఆమె చూడలేకపోతున్నదని అర్థం చేసుకున్నాడు మదన్ మారు మాటాడకుండా, టూరర్ స్టార్ట్ చేసి, ముందుకు పోనివ్వనారంభించాడు

## 65

క్షణ క్షణానికి పరిమళ శవం మహామారిలా కనిపించసాగింది- ప్రేక్షకులకు సినిమాహోలు ముందు 'కటవుట్' లా భయంకరంగా ఉన్న ఆమె రూపాన్ని, మంగళసూత్రంలా కట్టబడిన ఆమె జాతకాన్ని చూసి అసహ్యించుకోనారంభించారు చుట్టు పక్కల స్త్రీలు

ప్రెస్ రిపోర్టర్లు, పోలీసువారు- ఆమె శవాన్ని రక రకాల భంగిమల్లో ఫోటోలు తీశారు. వేలిముద్ర నిపుణులు తమ కార్యక్రమాలను పూర్తి చేసుకున్నారు

నలుగురు కానిస్టేబుల్సు, నర్సులు- గేటుకు కట్టబడిన పరిమళ శవాన్ని కిందకు దించారు

అంతవరకు దుఃఖాన్ని బిగబట్టుకున్నాడు జయరాజ్. శవాన్ని కిందకు దించే సరికి శోకాన్ని ఆపుకోలేకపోయాడు "పరిమళా!" అంటూ చిన్నగా అరిచి, రెండు చేతులతో ముఖం కప్పకొని ఏడవనారంభించాడు

విశాలాక్షి, గురూజీలకు కూడా దుఃఖం ఆగలేదు

అదే సమయంలో- ఒక స్పోర్ట్సు కారు వచ్చి, గేటు దగ్గర ఆగింది ఎర్రటి పైపు పీలుస్తూ, కారులోంచి దిగాడు పంచశూలమ్ ఓమారు ఆ పరిసరాలను పరీక్షగా చూశాడు సరాసరి, జయరాజ్‌ని సమీపించాడు అతని

భుజం మీద చెయ్యి వేశాడు "జయరాజ్! జీవితంలో ఏదైనా సాధించవచ్చు కాని, పోయిన పరువును, చనిపోయిన బంధువుల్ని తిరిగి పొందలేమురా కష్టాల మీద కష్టాలు వచ్చి పడ్డాయి చివరకు ఏకాకివై పోయావు ఏం చేస్తాం, ఓర్చుకోక తప్పదు" అంటూ సానుభూతి తెలపనారంభించాడు

అతని స్పర్శకు కంపించిపోయాడు జయ-రాజ్ కళ్లు తెరిచి అతని రూపాన్ని చూసేస-రికి యముణ్ణి చూసినట్లు అదిరి పోయాడు ఏదో షాక్ తగిలినట్లు రెండడుగులు వెనక్కి వేసి నిలుచున్నాడు

విశాలాక్షి, గురూజీలు కూడా భయం-తో అటు- యిటూ దిక్కులు చూడసాగారు

ఇంతలో-

శవాన్ని అంబులెన్స్‌లోకి ఎక్కించారు పోలీసులు

ఆ దృశ్యాన్ని చూసేసరికి మళ్లీ ముగ్గు-రూ భోరుమన్నారు

వారి దగ్గరకు వచ్చాడు సుభాష్

అతన్ని చూసి, "హలో, ఇన్‌స్పెక్టర్!" అన్నాడు పంచశూలమ్- తన మామూలు ధోరణిలో

తను సుభాష్ అని తెలిసినా, అతను 'యిన్‌స్పెక్టర్' అని పిలవడం, తన రహస్యాన్ని రహస్యంగానే ఉంచడం ఆశ్చర్యాన్ని కలిగిం-చింది సుభాష్‌కి అయినా గతంలో మాదిరి "హలో, సార్!" అన్నాడు

"ఇన్‌స్పెక్టర్!" ఏదో చెప్పబోయాడు జయరాజ్

మధ్యలోనే "మీ బాధ, ఆవేదన నాకు తెలుసు మీకు కలిగిన నష్టానికి రెట్టిం-పు శిక్ష వేయిస్తాను హంతకుల్ని పట్టుకుని ఉరికంబమెక్కిస్తాను మీరు కాస్త ధైర్యంగా ఉండాలి" అన్నాడు సుభాష్

"మీ డిపార్టు మెంటువారు ఏమైనా చెయ్యగలరు, ఇన్‌స్పెక్టర్! కాని, మీనాక్షి, మోహన్, పరిమళను తిరిగి బతికించ లేరు ఆ నష్టానికి పరిహారం లేదు "

"ఐ అగ్రీ ఆ లోటు మేము పూర్తి చెయ్యలేము "

"ఇంత వరకు జరిగిందేదో జరిగి పోయిం-ది కాని, ముమ్మందు వీళ్ళ ప్రాణాల మీదకు ప్రమాదం రాకుండా చూడండి "

పంచశూలమ్ మాటలు విని జయరాజ్, విశాలాక్షి, గురూజీలు అదిరి పోయారు

దుఃఖాన్ని, కోపాన్ని ఆపుకోలేక పోయా-డు జయరాజ్ "ఇన్‌స్పెక్టర్! ఈ చావు లన్నిటికీ కారకుడు యితనే ఇతనే మీనాక్షి, మోహన్, పరిమళ, ఎమ్మెల్యే దీపాదేవిని చంపాడు ముందు యితన్ని అరెస్ట్ చెయ్యం-డి " అన్నాడు పిచ్చిగా

అక్కడున్న వారంతా ఆశ్చర్యంగా అతని వంక చూశారు

బలవంతంగా నవ్వు తెచ్చుకున్నాడు పంచశూలమ్ "నా మీద నేరాలు మోపడం నీకు అలవాటై పోయిందిరా, జయరాజ్! అయినా, నీ మిత్రునిగా నేను బాధ పడటంలేదు ఇలాంటి సమయంలో మనిషికి పిచ్చి పట్టడం కూడా సహజం నీ ఆవేదనను, పిచ్చిని నా మీద కాకుంటే, ఎవరి మీద చూపిస్తావ్! కాని, కాస్త మనసును నిగ్రహ పరచుకుని, ధైర్యంగా ఉండరా " అన్నాడు

"నువ్వు చస్తేనే మాకు ధైర్యం వస్తుం-ది ఏదో కక్ష లోపల పెట్టుకుని నువ్వే ఈ హత్య లన్నీ చేస్తున్నావ్ రేపో, మాపో మమ్మల్ని కూడా చంపేస్తావ్ " ఆవేశంగా అన్నాడు జయరాజ్

"అహింసా వాదిని నేను హింస అంటే పరమ అసహ్యం మీ మీద పగబట్టి ఎవరో ఈ దౌర్జన్యాలు చేస్తున్న మాట నిజమే వాళ్ళెవరో తెలుసు కోడానికి నేను కూడా

ప్రయత్నిస్తాను ”

“ఎవరో కాదు- నువ్వే నువ్వే ” పిచ్చిగా అరిచాడు జయరాజ్

“ఔను, నువ్వే ” అన్నాడు అప్రయత్నంగా గురూజీ

“అయితే నా తల తీసేయండి లేదా, త్వరలో మీ తలలు కూడా ఎగిరి పోతాయి వస్తా ” అంటూ, చర చరా తన స్పోర్ట్స్ కారు వైపుకు నడిచాడు పంచశూలమ్

అక్కడ ఉన్న ప్రజలు, పోలీసులు, విశాలాక్షి, గురూజీ, జయరాజ్‌లు అతని వంకే చూస్తూ స్థాణువులా నిలబడి పోయారు!

## 66

అర్ధ రాత్రి దాటి పోయింది

మన్మథ సామ్రాజ్యం విజయ విహారం చేస్తోంది మదన్ పడక గదిలో

అతని పెదవుల కింద పద్మజ పెదవులు పరవశించి పోతున్నాయి

చంచల సౌందర్యం అతని చేతుల్లో సుడులు తిరుగుతోంది

శ్యామల శరీరం అతని శరీరం కింద నలిగి పోతోంది

మంచం పక్కన ప్రేక్షకురాలిలా కూర్చుంది ఊర్వశి

“కమాన్ డార్లింగ్!” ఉత్సాహంగా అన్నాడు మదన్

మాట్లాడ లేదు ఊర్వశి అతని వంక చూస్తూ వూరుకుంది

“కమాన్ ” మళ్ళీ పిలిచాడు

“ఇవ్వాళ నన్ను విడిచి పెట్టేయ్ ”

“ఎందుకని?”

“మూడ్ బాగాలేదు ”

వీపు మీద కొరడాతో చరిచినట్లయింది మదన్‌కి చటుక్కున మంచం మీద నుండి లేచాడు మొలకు టవల్ చుట్టు కున్నాడు “మీరు వెళ్ళిపొండి” అన్నాడు

అతని మాటకు తిరుగులేదు కాని, సాహసించింది ఊర్వశి “నో యూ ఎంజాయ్” అంది వినయంగా

“నాకూ మూడ్ లేదు ” అని ముగ్గురికి మూడు వందలిచ్చాడు మదన్

పద్మజ, చంచల, శ్యామల ఐదు నిముషాల్లో డ్రస్ చేసుకున్నారు అక్కడి నుండి వెళ్ళి పోయారు

ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో అర్థం, కాలేదు మదన్‌కి “ప్లీజ్, విస్కీ ” అన్నాడు- మతి పోయిన వాడిలా

గ్లాసులో విస్కీ పోసి, సోడా కలిపి యిచ్చింది ఊర్వశి

గడ గడా తాగేశాడు గ్లాసు పక్కన పెట్టాడు “డార్లింగ్! నేను అజ్ఞానిని, మూర్ఖుణ్ని, మొరటు మనిషిని ఓ భిక్షగత్తె దగ్గర పెరిగాను చదువు ఒంట బట్ట లేదు ఓ గూండా దగ్గర తర్ఫీదు పొందాను నాకు హృదయం లేదు ఎదుటి మనిషి హృదయాన్ని అర్థం జేసుకునే తెలివి, సహనం లేదు ఇంత వరకు ఎవరి ముందు తల వంచ లేదు నేను ” అని, ఆగాడు

తలెత్తి అతని ముఖంలోకి చూసింది ఊర్వశి

“కాని, నిన్న శూలమ్ సాబ్ ఎదుట, ఈనాడు నీ ముందు తల వంచుకున్నాను నా వల్ల ఏదైనా తప్పు జరిగితే క్షమించు ”

అతని మాటలు విని ఆశ్చర్య పోయింది ఊర్వశి అతని పెదవుల దగ్గర చెయ్యి పెట్టింది “నాకు తెలుసు మదన్!- నువ్వు ముక్కుకు సూటిగా పోయే మనిషివి కాని, ఇప్పుడే కాదు- ఎప్పుడూ, ఎవరి ముందు తల వంచవద్దు నేను సహించ లేను ” అంది

“నిజమే నా ప్రవర్తన నాకే ఆశ్చర్యంగా ఉంది కాని, నాకూ హృదయం ఉందని తెలుసు కున్నది మీ యిద్దరి దగ్గరే అందుకే, మిమ్మల్ని పూజించాలని పిస్తోంది ”

“వద్దు, మదన్! నన్ను పూజించ వద్దు గద్దె ఎక్కించ వద్దు నీ నీడలో కొన్నాళ్ళ పాటు బతకనియ్, చాలు ”

“అదే, డార్లింగ్- నీలోని గొప్పతనం ”

“ఏమిటది?”

“మంత్రుల్ని, కామందుల్ని, ధనికుల్ని- ఎంతో మందిని చూశావు నువ్వు అడిగిన వారికి కాదనకుండా నీ శరీరాన్ని యిచ్చావు కాని, నేను దొంగను, హంతకుణ్ని ఈ విషయం తెలిసి కూడా ఎప్పుడూ నా మంచి, నా సుఖం కోసమే ఆరాట పడుతున్నావ్ అందుకే నువ్వంటే ప్రేమ, గౌరవం, అభిమానం ”

“హత్యలు కూడా చేశావా నువ్వు?” త్రుళ్ళిపడి, ప్రశ్నించింది ఊర్వశి

“ఔను ”

“ఎవర్ని?”

“నన్ను కన్న ఆడదాన్ని, ఆమెకు పుట్టిన మరొకడిని.

“నీ తమ్ముణ్ని, తల్లిని చంపావా?” రెట్టించింది ఊర్వశి

“వాడు నా సొంత తమ్ముడు కాదు నా తండ్రీ వాడి తండ్రీ ఒకరు కాదు ”

“ఎవరతను?”

“మోహన్ ”

“పరిమళగారు మీ అమ్మగారా?” ఆశ్చర్య పోయింది ఊర్వశి

“అది నా అమ్మకాదు- తోలు బొమ్మ ”

కెవ్వున అరవ బోయింది ఊర్వశి- గేటుకు వేలాడుతున్న పరిమళ శవం గుర్తుకొచ్చి

ఆమె నోరు నొక్కాడు మదన్ “డార్లింగ్! ప్రేమలు, మమకారాలు, అనుబంధాలు, అను రాగాలు, ఆప్యాయతలు తెలియవు నాకు చిన్నప్పటి నుంచి నేను పెరిగిన పరిసరాల్లో యిలాంటి భావాలకు తావులేదు అందుకే మృగంలా తయారయ్యాను కాని, శూలమ్ సాబ్ తోను, నీతోను పరిచయమయ్యాక ‘నేనూ ఓ



మనిషినే' అనిపిస్తోంది ”

అంత గంభీర మైన మాటలు అతని నోటినుండి ఎప్పుడూ వినలేదు ఊర్వశి ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది

“నువ్వు, నీ చెల్లెలు పుట్టాక నీ తల్లిని విడిచి పెట్టేశాడు- మీ నాన్న అయితే, నీ తల్లి మరో మగాడిని పెళ్ళి చేసుకోలేదు, మరొకడితో కాపరం చెయ్యలేదు, వ్యభిచరించ లేదు భిక్ష మెత్తుకుని మీ యిద్దర్నీ పోషించింది కాని, నన్ను కన్న ఆడది నన్ను విసిరి పారేసింది, నా తండ్రిని మోసగించింది, మరొకణ్ని పెళ్ళి చేసుకుంది అది కులట వ్యభిచారి ”

“నేనూ వ్యభిచారినే ”

“నీ విషయం వేరు- కుళ్ళిన శరీరంతో మరొకణ్ని పెళ్ళి చేసుకునే ఆడదాని కంటే, నీలా నిర్భయంగా 'వ్యభిచారి' నని చెప్పుకునే ఆడది మేలు నన్ను ప్రసవించి పారేసిన కులటను నా 'తల్లి' అని చెప్పుకోలేను అందుకే, దానిని చంపేశాను కాని కాని ”

“ఏమిటి?” చెప్పమన్నట్లు అతని ముఖంలోకి చూసింది

“శూలమ్ సాబ్ సింహం లాంటి మనిషి ఆయనకు అండగా ఎంతోమంది గూండాలున్నారు ఆయన ఎన్ని అపరాధాలు చేశాడో, ఎన్నెన్ని చేయించాడో నాకు తెలీదు రిటైర్డ్ మిలిటరీ ఆఫీసరు కళ్ళెదుట ఎంత మంది చనిపోయినా, ఎన్ని రక్తపు టేరులు పారినా చలించే మనిషికాడు ఆయన కాని, కాని ఊర్వశీ ”

“ఏమయింది?” ఆతురతగా ప్రశ్నించింది.

“ఆ దౌర్భాగ్యపు స్త్రీ శవాన్ని చూసే సరికి చలించి పోయాడు ”

“ఎవరిది?- పరిమళ గారిదా?”

“ఔను ఆయన కళ్ళ ముందే ఆ కులటను చంపేశాను నేను దాని శవాన్ని చూసి, చాలా సేపటి వరకు ఆయన నోట మాట రాలేదు. కన్నీళ్ళు కప్పిపుచ్చుకోడానికి కళ్ళ మీద చన్నీళ్ళు జల్లుకున్నాడు ఆయన ఆవేదన చూసి, జీవితంలో మొదటిసారి బాధ పడ్డాను. నువ్వు దిగులుగా కూర్చోవడం చూసి, రెండో సారి బాధపడ్డాను అంటే, మీరిద్దరు నాలోని మానవుణ్ని, మానవత్వాన్ని మేల్కొలిపారు నేనూ ఓ మనిషినే అన్న విషయం గుర్తు చేశారు అందుకే, మీ యిద్దరి ముందు తల వంచుతున్నాను ”

చిన్నగా నిట్టూర్చింది ఊర్వశి “కాని, డియర్! ఈనాడు నేను వ్యభిచారం మానేస్తానన్నా, నువ్వు దొంగతనాలు చెయ్యడం విడిచి పెడతావన్నా ఈ లోకం మనల్ని నీతిపరులుగా గుర్తించదు, స్వీకరించదు ” అంది

“వద్దు, మనకు ఈ లోకం వద్దు ఈ లోకంలో మనుషులుగా నాకు కనిపించింది యిద్దరే వ్యక్తులు- ఒకరు శూలమ్ సాబ్, రెండు నువ్వు ఈ క్షణం నుండి ఆయన్ని నా తండ్రి గాను, నిన్ను నా భార్యగాను స్వీకరిస్తున్నాను మీరే నా లోకం ”

“టూ లేట్, మై బోయ్- టూ లేట్” అన్న మాటలు గుమ్మం దగ్గర నుండి వినిపించాయి

అదిరి పడి అటు వైపుకు చూశారు- ఊర్వశి, మదన్ లు

తాపీగా పైప్ పీలుస్తూ, శాంత గంభీరంగా గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాడు పంచశూలమ్.

“ఒప్పుకుంటాను, శూలమ్ సాబ్! మంచి గాని, చెడుగాని నేను అర్థం జేసుకునే టప్పటికి చాలా లేటైపోతుంది ”

“దట్సాల్ రైట్, మై బోయ్! కాని, నీ బాధ్యతలు మరచిపోకు ”

“ఏకాకిని నేను ఏ బాధ్యతలు లేవు నాకు ”

“ఇప్పుడు నువ్వు ఏకాకివి కావు నన్ను తండ్రిగాను, ఊర్వశిని భార్యగాను అంగీకరించిన గృహస్తుడివి మరచిపోయావా?”

“లేదు సాబ్! మాటంటే మాటే- కోటి రూపాయలిచ్చినా మాట తప్పను మీరు నా తండ్రే, ఊర్వశి నా భార్యే” దృఢంగా ఉన్నాయి అతని మాటలు

“సో, మై గుడ్ బాయ్! ఊర్వశి భర్తగా నీకు ఎన్నో బాధ్యతలున్నాయి ”

“శక్తివంచన లేకుండా నా బాధ్యతలు పూర్తి చేస్తాను మీ వంటి వారు చెప్పిన పనులు చెయ్యడం తప్ప సొంతంగా ఆలోచించే శక్తి లేదు నాకు ఏం చెయ్యమంటారో సెలవివ్వండి ’

“ఊర్వశి చెల్లెలి పెళ్ళి బాధ్యత నీ మీద వేసుకున్నావు ఆ శుభ కార్యం జరుగుతుందో, లేదో తెలుసుకో ”

“ఎందుకు జరుగదు సాబ్! మీ దగ్గరో, మరొకరి దగ్గరో ఇంకో లక్ష రూపాయలు తీసుకుని మరో మంత్రి కిస్తాను ఆ అబ్బాయికి ఉద్యోగం వేయిస్తాను లేదా, ఎక్కడో మరో లక్ష దొంగతనంచేసి అతనికి కట్నంగా యిస్తాను ”

“కాని, మదన్ ! ఆత్మాభిమానంగల వారిని డబ్బుతో కొనలేవు నువ్వు ”

“అంటే?”

“ఊర్వశి యింటికి వెళ్లు నీ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది ” అని, మరో మాటకు అవకాశం ఇవ్వకుండా అక్కడి నుండి వెళ్లిపోయాడు పంచశూలమ్

అతని ఔన్నత్యాన్ని, ఆధిక్యతను, ఆత్మపరిశీలనను అర్థం చేసుకొని ఆశ్చర్యపోయింది ఊర్వశి ప్రశ్నార్థకంగా మదన్ వంక చూసింది

“పద, మీ యింటి కెడదాం” అన్నాడు అయోమయంగా మదన్

(ఇంకా వుంది)

# నలభీమపాకం

## బర్ఫీ



**కావలసినవి:-**

గోధుమపిండి- ఒక గ్లాసు
పంచదార- రెండు గ్లాసులు
నెయ్యి- పావుగ్లాసు
జీడిపప్పు, యాలకులు- కొద్దిగా

**తయారు చేసే పద్ధతి:-**

గోధుమపిండిని వ [illegible] నేతిలో వేయించి ప్రక్కన పెట్టుకోవాలి. పంచదార కళాయిలో వేసి, తీగపాకం వచ్చిన తరువాత ప్రక్కనపెట్టి గోధుమ పిండి వేసి బాగా కలపాలి తరువాత జీడిపప్పు, యాలకులు పొడివేసి ఒక ప్లేటులో నెయ్యిరాసి ఈ మిశ్రమాన్ని పోయాలి. కొంచెంసేపు ఆరనిచ్చి, ఇష్టమైన షేపులో ముక్కలుగా కోసుకోవాలి

ఎ శ్రీనివాసకుమార్
(నెల్లూరు)

# కర్మణ్యేవాధికారస్తే...

కె.వి.యస్.యన్.మూర్తి



''నమస్కారం గురువుగారూ'

మృదంగాన్ని సవరిస్తోన్న పరుశురామ బాగవతార్ తల పైకెత్తి చూశాడు

పసిమి చాయా గుండ్రటి మొహం పొట్టీ కాదు పొడుగూ కాదు బొద్దుగా వున్నాడు పదమూడు, దాటదు వయసు వినయంగా ముకళిత హస్తాలతో ముద్దొస్తున్న ఆ చిన్న వాడిని ముచ్చటగా చూస్తూ చిరంజీవ' ఏం కావాలి బాబూ? అని అడిగారు దాసుగారు

ఆ పాపడు దాసుగారి అబిమాని ఆయన ప్రదర్శనలనేకం చూశాడు ఆయనతో ఎప్పుడూ ముఖాముఖి మాట్లాడి ఎరుగడు తన అబిమానితో ఎకాఎకి మాట్లాడుతోన్న సంతోషం అతన్ని కదిపి వేసింది ఎలా మొదలు పెట్టాలో తెలియక వుక్కిరి బిక్కిరి అయ్యాడు చివరకు తమరి రుక్మిణీ కల్యాణం అమోఘం' అన్నాడు

వెండి తీవల్లా మెరిసిపోతున్న దుబ్బు మీసాల్ని సవరించుకొంటూ దాసుగారు అల వోకగా నవ్వారు ఆయనకు యిది మామూలే రోజూ ఎవరో ఒక అబిమాని వస్తోంటాడు మీరు చెప్పిన ఫలానా కథ బావుంది- ఫలానా రాగం- ఫలానా తాళం సెహబాష్- అంటాడు కానీ అలా అన్న ప్రతీ వాడు సాదారణంగా మూడు పదులు దాటిన వాడై వుంటాడు కానీ ఈ రోజు- పస వాసనయినా పూర్తిగా పోని ఓ చిన్నారి తనను మెచ్చుకున్నాడు దాసుగారు ఆనందడోలికలలో వూగిపోయారు ఆ ఎల్లడి ముగ్ధ మనోహర విగ్రహాన్ని తనివితీరా చూస్తోన్నారు అతని నడతకూ నమ్రతకూ అచ్చెరువొందారు

ప్రస్తుతం పరుశురామ బాగవతార్‌కు మిగిలినది అదే హరికథకు ఆదరణ తగ్గింది ఆరు పదులు దాటిన ఆయనకూ సత్తువ తగ్గింది అయితే తెలుగు నాడులో ఆయన పేరూ తగ్గలేదు ఆయనలో గళ పటుత్వమూ పోలేదు ప్రస్తుతం మాత్రం ఆయన విశ్రాంతి తీసుకుంటున్నారనే చెప్పాలి కాని హరికథ అంతరించిపోకుండా వుండటానికి ఆయన అనేక మంది శిష్యులను తయారు చేసి కళామ తల్లికి యితోదికంగా సేవ చేస్తున్నాడు ఆయన శిష్యులు దేశం నలుమూలలా వున్నారు కానీ ఆయనలో ఒకే ఒక ఆశయం చివుళ్ళు తొడుక్కొని నిలకడగా వుండిపోయింది తనంతటి మరో వ్యక్తిని తయారు చేయాలన్నదే ఆ ఆశయం దీనిక తోడు మరోదాన్ని దీనికి ఆయన ముడి పెట్టుక కూర్చున్నాడు

కూర్చో బాబూ' అని అమ్మా' శారదా' దాహం

తీసుకురా' అంటూ మనవరాల్ని పిలిచారు దాసుగారు

అతడు చాప వారగా వొదిగి కూర్చున్నాడు

దాసుగారి మనవరాలు అతనికి ఆపుకారతో మజ్జిగ తేట అందించింది అతడు దానిని అందుకుని గడగడా తాగేశాడు

ఏ వూరు బాబూ' మీది? అడిగారు దాసుగారు

అమలాపురం' అండి'

' నీ పేరు?

అశ్వనండి'

నీ వయసెంత నాన్నా'

మొన్న పుష్య బహుళ చవితికి పద్నాలుగు వచ్చిందండి

ఏం పని మీద వచ్చావు?

అది అది సమాదానం కోసం తడుముకున్నాడు- అశ్వని

పర్వాలేదు' చెప్పు బాబూ' ప్రోత్సహించారు దాసుగారు

మరండి మీ దగ్గర హరి కథ నేర్చుకుందామని

దాసు గారు అశ్వనిని ఆప్యాయంగా చూశారు ఓ చిన్న పిల్లడు స్వయంగా తనంత తానుగా కథ నేర్చుకునేందుకు వచ్చినందుకు ఆయనకు ముద్దనిపించింది సంతోషం బాబూ' మీ యింటి పేరు? అన్నాడు

అచ్చే పల్లి వారండి'

దాసుగారి మొహం ఆదోలా మారిపోయింది ఆయన మొహంలో ఒక రకమయిన బాధ మిగిలిపోయింది వైశ్యులా? అన్నాడు

కాదు' బ్రాహ్మలం'

దాసుగారు రెండు నిముషాలు మౌనంగా వుండిపోయాడు మీ నాన్నగారు ఏం చేస్తున్నారు? అన్నాడు

చిన్నప్పుడే పోయారండి' తాతగారి దగ్గర వుంటున్నాను

తాతగారు ఏం చేస్తున్నారు?

వేదం చెప్తుతున్నారు సభలకు వెళుతూ వుంటారు

మరింకేం' నీకూ వాక్శుద్ధి వుంది శుభ్రంగా తాతగారి దగ్గర వేదం చెప్పుకో' పండిత సభలకి కూడా వెళ్ళొచ్చు' మీ తాతగార్కి కూడా తృప్తి వుంటుంది'

అశ్వని బుర్ర గోక్కున్నాడు మీరు చెప్పింది నిజమే' కానీ నాకు పాట మీద వున్న సరదా పన్నాల మీద లేదు కథలో మనసు పెడితే బాగా రాణిస్తాననుకుంటున్నాను అదీ గాకుండా- వేదం చెప్పుకుని సన్మానాన్ని పొందితే వచ్చే పేరు కన్నా ఈ కళలో రాణిస్తే వచ్చే పేరు మహా దొడ్డది మా తాతగార్నే తీసుకోండి- వేద పారాయణ వల్ల ఆయన పళ్ళు సగం పై చిలుకు దాకా అరిగిపోయాయి ఆయన తల దన్నేవారు దాదాపు లేరనే చెప్పాలి కానీ ఆయనకు మికున్న పేరులో సహం కూడా లేదు.

దాసుగార్కి ఆ పిల్లాడి మాటలు తమాషాగా తోచాయి అప్పుడు తను యింత వరకు అటు వయిపు ఆలోచించనే లేదు ఎన్ని వయసులోనే అంతర్యాలను మాతృత్వంలో చూడగల లేమనసు నాయన అభినందించకుండా వుండలేకపోయాడు ఆయనకు ఎందుకో గర్వం అనిపించింది కుర్రాడికి కథ చెప్పాలనే అనుకున్నాడు కానీ ఆయనకు యిదివరలో బ్రాహ్మణ భాగవతార్లను తను కథ నేర్పమంటే వాళ్ళు తన్ను బయటకు పొమ్మన్న విధానమూ- చివరకు తన వాడు తాళాబత్తుల భాగవతార్ చేరదీసిన విధమూ గుర్తొచ్చాయి అశ్వని పుట్టిన కులం మీద ఆయనకున్న యించుక ఈర్ష్య



అతనిని సందిగ్ధంలో పడవెయ్యగా- తన కులం మీదున్న అభిమానం ఆ కుర్రాడికి కథ చెప్పొద్దు అని బోధించింది అది గాక తన మనవరాలు శారద తన యింట్లో వుంది దానికి తాను తప్ప మరెవరూ లేరు తన పెన తండ్రి కూతురు రుక్మమ్మ దాని నాలుగో కొడుకు రామబ్రహ్మం వాడి గళం బావుంటుంది ఆ రామబ్రహ్మాన్ని తనింట వుంచుకుని మంచి కథకునిగా తయారు చేసి తన మనవరాల్నిచ్చి అతడికి పెళ్ళి చెయ్యాలన్న తలంపు దాసుగారికి వుంది కారణం ఏదయితేనే ఆయన అశ్వనికి కథ చెప్పకూడదనే నిశ్చయానికి వచ్చాడు అయినా కుర్రాడిని బాధ పెట్టకుండా పంపించి వెయ్యాలన్న వుద్దేశ్యంతో నీకు ఈ వూళ్ళో చుట్టాలు ఎవరయినా వున్నారా? అని అడిగారు

లేరండి

మరయితే బోజనం వగైరా?

కథ నేర్చుకోవటానికి సంవత్సరాలు పడుతుంది నీది బ్రాహ్మణ వంశం తినటానికి నీకు అభ్యంతరం లేకపోయినా నీకు మా యింట్లో బోజనం పెడితే నీ కులస్థులు నన్ను బ్రతకనీయరు నీ కులాన్ని భ్రష్టు పట్టిస్తున్నానని నన్ను ఆడిపోసుకుంటారు అందుకని బాబూ' వాక్శుద్ధి వుంది కాబట్టి వేదం చెప్పుకో లేదా మంచి తెలివయిన వాడివి మంచి చదువయినా చదువుకో పదీ పరకా అవసరమయితే నన్నడుగు ఏపెద్దవారి చేతో యిప్పిస్తాను అన్నారు దాసుగారు

అశ్వనికి వుసూరుమంది ఎవో విధంగా కథ నేర్చుకోవాలని యిక్కడకు వచ్చాడు అక్కడికీ తాతయ్య ముందే చెప్పాడు- ఆయన నీకు కథ చెప్పతురా – అని అయినా యింట్లో తగువాడి మరీ వచ్చేశాడు తీరా యీయన చెప్పనంటే తాతయ్యకు తను మొహం ఎలా చూపించగలడు? అందుకే ఏదోలా పనిని సానుకూలం చేసుకునే వుద్దేశ్యంతో వానీ వారాలు చేసుకుని మీ దగ్గర నేర్చుకుంటానండి అన్నాడు

దాసుగారికి మనసు పీకింది కుర్రాడు చాకులా వున్నాడు కథ మప్పితే ఆంధ్రదేశాన్నే గడగడలాడిస్తాడు తన పేరూ- హరి కథ ప్రతిష్ఠా నిలబెడతాడు కానీ అంతలోనే ఆయనలో స్వార్థం పిశాచిలా బోర విరుచుకు ప్రవేశించింది ఇతడితో పోలిస్తే రామబ్రహ్మం ఎందుకూ పనికి రాడు ఇద్దరికీ కలిపి కథ చెపుతే రామబ్రహ్మం పేరూ పూరూ వుండదు అప్పుడు తన మనవరాలు ఏమయిపోతుంది ఎవరో పరాయివాడు- అందులోను తనను క్రిందకు తొక్కేయాలని ప్రయత్నించిన బ్రాహ్మణ కులం వాడు తన మనవడిని ఎందుకూ పనికి రాకుండా చెయ్యటమా' అదీ తన సహాయంతోనా వీల్లేదు దాసుగారు మనసును పాషాణం చేసుకున్నారు బాబూ' మీ తాతగారు వేద పండితులు గదా' మా కులం కుర్రాడిని ఒకడిని మీ తాతగార్ని దగ్గరకు

పంపిస్తాను ఆయన మా వాడికి వేదం చెపితే నేను నీకు కథ మప్పుతాను అన్నారు

అశ్వని నీళ్ళు నమిలాడు దాసుగార్ని విచిత్రంగా చూశాడు ఎందుకో అక్కడ అతనికి మరో క్షణం వుండబుద్ధి కాలేదు గిరుక్కున వెను తిరిగి రోడ్డు మీదకు వచ్చేశాడు

అలా వెళ్ళిపోతున్న అశ్వనిని చూసి దాసుగారి మనసు విల విలలాడింది గుండెను ఎవరో పట్టుకుని కసిగా పిండుతున్నట్టు బాధ పడ్డాడాయన అశ్వని పడిన బాధ ఎటువంటిదో ఆయనకు స్వానుబవం వలన తెలుసు తెలిసీ తను జీవితంలో మొట్టమొదటి తప్పు చేశాడు ఏ కుల వైషమ్యమయితే వుండకూడదని చిన్నతనంలో తను మనసారా వాంచించాడో? ఏ కుల నిర్మూలనకు పాటు పడదామని తానభిలషించాడో! నేడు తానే కుల సర్పాన్ని తట్టి లేపాడు కులమనే పడగకు తానో కోరయ్యి ఓ కుర్ర కుంకను అంట బొడిచాడు తన పాపానికి నిష్కృతి లేదు కళామతల్లికి తీరని ద్రోహం చేశాడు తనకు ఈ వుసురు ఎప్పుడోప్పుడు- ఏదో విదంగా తగిలి తీరుతుంది కళ్ళు మూసుకొని నిస్సత్తువగా గోడకు జేర్లబడ్డాడాయన

* * * *

పై సంఘటన జరిగి పది సంవత్సరాలు దాటింది

ఈ పది సంవత్సరాలలోనూ రామబ్రహ్మం గురువును మించిన శిష్యుడైపోయాడు ఆదిబట్ల నారాయణదాసూ, దీక్షిత దాసుగార్ల తరువాత రామబ్రహ్మమే అన్నారందరూ 'మన ముదపాకను మరిపించాడోయ్ అన్నారు దాసుగారి- మనవాళ్ళందరూ

పరుశురామ బాగవతార్‌కయితే వూపిరి సల్పని పనులొచ్చి పడిపోతోన్నాయి మనవడికి ప్రోగ్రాంలు పిక్సు చెయ్యటం దగ్గర నుండి అతడి సంరక్షణ చూడటం వరకు ఆయనే బుజాన్న వేసుకున్నాడు మనవడిని చూసి ఆయన మురిసిపోతోన్నాడు తన కుల ప్రతిష్టను నిలబెట్టి తనను అజ్జాడవారి సరసన నిలిపినందుకు మనవడిని మనసులో తెగ అబినందించాడు మనవరాలి అదృష్టాన్ని తలచుకుని మురిసిపోయ్యాడు

రామబ్రహ్మం కూడా తాతయ్యను వదలి ఒక్క క్షణం వుండే వాడు కాదు ప్రతి చోట తాతగార్ని పొగడి ఆయనకు పాదాబివందనం చేసి మరీ కథను మొదలు పెట్టేవాడు శారద కూడా అతనితో చాలా సరదాగా ఆత్మీయంగా వుండేది

కాలం చక్కగా దొర్లిపోతోంది

మనసులోని ఆలోచనను కూతురుకు చెప్పి, మనవరాల్ని ఓ యింటిదాన్ని చేసేద్దాం- అనుకుని కూతురు రుక్మమ్మకు కబురంపబోయాడు దాసుగారు కానీ ఓ రోజు రుక్మమ్మ- అమె భర్త తాతాచారీ వూడి పడ్డారు

దాసుగారూ, శారదా వాళ్ళకు సకల మర్యాదలూ చేశారు

మధ్యాహ్నం బోజనాలయ్యాక వీధి గుమ్మం దగ్గర పొగడ చెట్టు నీడలో మంచాలు వాల్చుకుని పిచ్చాపాటీ మొదలు పెట్టారు

'మీ మేలు మర్చిపోలేం మామయ్యా! మట్టి వెదవను సాన పెట్టి వజ్రంలా తయారు చేశారు అన్నాడు తాతాచారి కృతజ్ఞతగా

"నాదేముంది బాబూ! అంతా ఆ బగవదనుగ్రహం" అన్నాడు దాసుగారు

పిచ్చాపాటీ సాగిపోతోంది

' వాడిని మీరు యింత వాడిని చేశారు మీ చేత్తోనే వాడినో యింటి వాడిని చేసేస్తే మీకు రుణపడ వుంటాం!" అన్నాడు తాతాచారి

వస్తున్నాడు- తన దారికేవస్తున్నాడు శుబస్య శీఘ్రం- ఆలస్యం దేనికీ!' అన్నారు దాసుగారు

అదే నాన్నా! మన వూళ్ళో లక్కోజువారట మంచి కుటుంబం అని విన్నాము పెద్ద బజార్లో బంగారం కొట్టు వుందట " చెప్పుకు పోతోంది రుక్మమ్మ

దాసుగారి ఎడమ కన్ను అదిరింది ఆయనకు



ఎతమ పార్శ్వం అంతా మొద్దుబారిపోయినట్టనిపించింది చల్లా ముంతా సామెత గుర్తొచ్చింది దాసుగార్కి ఇక తాత్సారం అనవసరమనుకొని అదేంటే రుక్కూ! మరి శారదను నీ కోడలని అనుకున్నాం కదే' అన్నారు

కాదని ఎవరన్నార్నాన్నా? కానీ ప్రస్తుత పరిస్థితి వేరు కానీ వాడికి యిది జోడీ కాదు వాడా చూడబోతే పెద్ద బాగవతారయ్యాడు ఆ లక్కోజు వారి అమ్మాయికయితే ఆటా పాటా కూడా వున్నది మన వాడికి తోడుగా బావుంటుంది కట్నం కూడా దండిగానే యిస్తారట మన బ్రహ్మనికి కూడా ఆ పిల్ల నచ్చిందట మాటల సందర్భంలో వాళ్ళ నాన్న దగ్గర తేలాడట' అంటోంది రుక్కమ్మ

ఆలోగా రామబ్రహ్మం అక్కడకు వచ్చాడు అక్కడ వున్న తల్లిదండ్రులనూ మ్లానమై వున్న దాసుగారి మొహాన్ని చూసి జరిగింది గ్రహించాడు నేల చూపులు చూసుకుంటూ లోపలకు వెళ్ళిపోయాడు అక్కడ శారద వెక్కి వెక్కి ఏడుస్తోంది

రామబ్రహ్మం ఆమె దగ్గరకు వెళ్ళాడు శారదా! అన్నాడు ఆప్యాయంగా

అతడిని చూసి శారద మొహం తిప్పేసుకుంది

'నేను నీ పట్ల ఎప్పుడయినా అసభ్యంగా ప్రవర్తించానా?

లేదన్నట్లు తల వూపింది శారద

పోనీ నేను నీలో లేనిపోని ఆశలను ఎన్నడయినా కల్పించానా?

శారద చివ్వున తలెత్తి అతన్ని చూసింది బావా నేనోటి అడుగుతాను సమాదానం చెపుతావా? అంది

'అడుగు!'

"తాతయ్య వుద్దేశ్యం మీకు తెలియదా? అత్తా మామయ్యలకు కూడా తెలుసుగా? నిన్ను ఖర్చుకు వెనుకాడకుండా యింత వాడిని చెయ్యటానికి తాతయ్య అంత కష్టం ఎందుకు పడ్డాడో కూడా మీకు తెలుసుగా?

బాణాల్లా సూటిగా తగిలిన ఆ ప్రశ్నలకు మతి పోయి నిలబడిపోయాడు రామబ్రహ్మం

'ఏం బావా? అంతా తెలిసే మీరు ఎందుకు యిలా మోసం చేశారు నన్ను చేసుకునే వుద్దేశ్యం లేదని చెబితే మాత్రం తాతయ్య నిన్ను యింత గొప్ప వాడిగా చేసి వుండే వాడు కాదా? ఎందుకు బావా యిలా చేశావు? నీ పబ్బం గడుపుకోవటానికి ఎరగా నేనే దొరికానా? గొల్లుమని ఏడిచింది శారద

'నన్ను క్షమించు '

'ఎంత తేలికగా చెప్పేశావు బావా? ఆడదాని మనసులో పడిన ముద్ర చెరిగిపోదు బావా చెరిగిపోదు నన్ను కాదనటానికి కారణం ఏమిటి బావా?

ఆ లక్కోజు వారు చాలా డబ్బున్న వాళ్ళు నేను పైక రావాలంటే డబ్బు కావాలి ఆమెను చేసుకుంటే— కనీసం నేనయినా సుఖపడతాను నిన్ను చేసుకుంటే సుఖపడటం మాట అలా వుంచి అందరం పస్తులుండాలి అతని మాటల్లో కరకుదనం స్పష్టంగా కనుపిస్తోంది

నువ్వంత అసమర్థుడివా! బావా? అంటోంది శారద

ఈలోగా దాసుగారు అక్కడకు వచ్చారు వాడితో మనకేంటమ్మా? ఈ తాత బ్రతికున్నంత కాలం నీకు ఏ బాధా ఉండబోదు వాడో విశ్వాసఘాతకుడమ్మా నా పేరుకు తగ్గట్టే నాకు గనక శక్తి వుంటే— స్టేజి ఎక్కగానే కథ మర్చిపోగాక— అని వీడిని శపించి వదేద్దును అంటూ తన అక్కసును కక్కేశారు దాసుగారు

సాయంత్రం రుక్కమ్మా, భర్త, బ్రహ్మం బయలుదేరారు పోతూ పోతూ రామబ్రహ్మం చేత దాసుగార్కి పళ్ళెంలో పెట్టి— పట్టు పంచా తాంబూలం వెయ్యినూటపదహార్లు— గురు దక్షిణగా యిప్పించింది రుక్కమ్మ

మేన కోడలికి బిన్నీ సిల్కు చీరను బొట్టు పెట్టి చేతిలో పెట్టింది

వాళ్ళు అలా బయటకు వెళ్ళారో లేదో దాసుగార్కి గుండెల్లో సన్నగా నొప్పి ప్రారంభమయింది

*  *  *  *

నా స్టెత్ తీశారా? ' దాదాపుగా అరిచాడు అశ్విని

'అబ్బబ్బా హాస్పిటల్‌కు వెళ్ళడం కాదుగానీ మా ప్రాణాలు తీసేస్తున్నారు ఆప్యాయంగా విసుక్కుంది కల్పన మూడేళ్ళ బాబిగాడి మెడలో ని స్టెత్ తీసి భర్తకు అందించింది

నేను వెళుతున్నాను

కల్పన— బాబిగాడిని ఎత్తుకుని గుమ్మందాకా వచ్చింది

అశ్విని స్కూటర్ దాకా వెళ్ళాడు అంతలోనే ఏదో గుర్తొచ్చి ఆ టి వి రాక్ మీద తాళాలున్నాయి! అంటూ భార్యకు అభ్యర్థనతో కూడిన హుకుంను జారీ చేశాడు

కల్పన ముసి ముసిగా నవ్వుకుంటూ లోపలకు వెళ్ళి తాళాలు తీసుకుని వచ్చి అతడికి అందిస్తూ పర్సు తీసుకున్నారో లేదో చూసుకోండి' అంది

సరేలేవో! పెద్ద అంటూ భార్య నెత్తిమీద చిన్నగా చిలిపిగా మొట్టి స్కూటరు స్టార్టు చేసి ముందుకు వురికించాడు- అశ్విని

అతడు హాస్పిటల్ చేరుకునేసరికి అక్కడ చాలా హడావుడిగా వుంది స్కూటరు పార్కు చేసి వార్డు వయిపు అడుగులు వేశాడు అతడిని చూసి అప్పటి వరకు వార్డులో వున్న కోలాహలం సద్దుమణిగింది పేషెంట్లు అతడిని చూసి తాము తాగుతున్న చుట్టలీ సిగరెట్లనూ పారవేశారు వార్డులో ఖాళీ లేక కొందరు రోగులు వరండాలోనే పడుకుని వున్నారు

అందర్నీ పలుకరించుకుంటూ ముందుకి సాగిపోతున్నాడు అశ్విని ఉన్నట్టుండి అశ్విని చూపు ఓ మూలగా పడుకున్న వ్యక్తి మీద పడింది అతడి ప్రక్కనే ఓ ఇరవై ఏళ్ళ పడుచు కూర్చుని బత్తాయి రసం తీస్తోంది

అశ్విని తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ అక్కడకు వెళ్లాడు

ఎనభై సంవత్సరాల దగ్గర వయసున్న స్ఫురద్రూపి వెనక్కు వ్రేలాడుతోన్న వెండి వుంగరాల జుత్తూ గుబురు మీసాలూ నుదుటిన త్రిచూర్ణపు బొట్టు

## ప్రపంచంలో ఎత్తైన స్తంభం!

కెనడాలోని టొరాంటోలో నిర్మితమైన ఈ టవర్ ప్రపంచంలోనే ఎత్తైనదట ఆకాశాన్ని తాకుతున్నట్లున్న ఈ టవర్ ఎత్తు 1822 అడుగులట 1973 ఫిబ్రవరి 12న ప్రారంభమైన ఈ టవర్ నిర్మాణం 1975 ఏప్రిల్ 2న పూర్తయిందట

1140 అడుగుల ఎత్తులో 416 సీట్లుగల ఒక రెస్టారెంట్‌ను కూడా ఏర్పాటు చేశారట అక్కడ నుంచి 120 కిలోమీటర్ల దూరంలోవున్న వాటిని చూడవచ్చునట అంత ఎత్తున్న టవర్‌ను చూసితీరవల్సిందే మరి!

# కర్మణ్యే వాధికారస్తే

అశ్వని అతడిని మరో క్షణం చూసి నమస్కారం దాసుగారూ! అన్నాడు

దాసుగారికి ఓ నిముషంపాటు భుజాలు వెదల్పయ్యాయి తను కథ చెప్పటం మాని దాదాపు పన్నెండేళ్ళయినా ఈ దేశంలో తనకింకా గుర్తింపురాదన్నమాట ఆయన అశ్వనిని తన్మయంగా చూస్తూ చిరంజీవ! అన్నాడు

నన్ను గుర్తుపట్టారా?

ఎవరూ?

అశ్వనినండి! తమబోంట్లకు గుర్తుండి ఉండకపోవచ్చు శతకోటి లింగాల్లో బోడి లింగంగాడిని సరిగ్గా పది సంవత్సరాల క్రితం తమరి దగ్గరకు కథ చెప్పమని వచ్చాను తమరు నన్ను మంచి చదువు చదువుకోమని దీవించి పంపారు తమ ఆశీర్వా ద బలం వుండటం వల్ల నేను కష్టపడి చదివాను డాక్టర్నయ్యాను నాలుగేళ్ళ క్రితం పెళ్ళయింది ఓ పిల్లాడు కూడా!'

దాసుగారు బాధగా కళ్ళు మూసుకున్నాడు కనురెప్పల్లోంచి నీటి బిందువులు చిప్పిల్లాయి ఆయన గుండెల్లో గతం ఓ ముల్లులా కసిగా దిగి గుండెనంతటినీ కెలికి పారేసింది నన్ను క్షమించు బాబూ! అన్నాడు దాసుగారు

ఏమయిందని మీరంత బాధ పడుతున్నారు మీరు నాడు నా అభ్యర్ధనను మన్నించి నాకు కథ చెప్పితే ఎలా వుండేదో తెలీదుగానీ మీరు కాదు పొమ్మనటం మాత్రం నాకు చాలా వుపకారం చేసింది ఈ రోజు పదిమందికి వైద్య సహాయం చెయ్యగలుగుతున్నాను బయట ప్రపంచాన్ని చూడగలిగాను అటు మా తాతగారి ప్రభావంగాని యిటు మరెవరి ప్రభావం గానీ నా మీద పడలేదు హృదయ వైశాల్యం పెరిగింది '

అశ్వని మాటలు దాసుగారి ఎదకు సూటిగా తగిలాయి ' నా స్వార్ధం నన్ను పూర్తిగా దహించి వేసింది బాబూ! నాకు కులాభిమానం కంటే స్వాభిమానం ఎక్కువగా వుండేది నిన్ను కాదనటానికి బలమైన కారణం నా మనవరాలే బాబూ! కథ నేర్పి రామబ్రహ్మానికి- దీన్నిచ్చి చేద్దామనుకున్నాను ఆయన ఆయాస పడుతూ యింకా ఏదో చెప్పుకుపోతున్నాడు

అశ్వని ఆయనను వారించాడు "మీరు అట్టే ఆవేశపడకండి ఇక్కడ పని ముగించుకొని మా యింటికి వెళదాం మీరేం మనసులో వుంచుకుని బాధ పడకండి అన్నాడు అశ్వని

నేను నీకు ఏం చేశాన ని బాబూ! నా మీద నీకు యింత అభిమానం

మీలో వున్న కళను నేను ఎప్పుడూ గౌరవిస్తాను దాసుగారూ మీరు విశ్రాంతి తీసుకోండి నేను పెద్ద డాక్టర్లతో మాట్లాడి వస్తాను అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయాడు అశ్వని

దాసుగారికి, ఎక్స్‌రే- బ్లడ్ టెస్టు కార్డియోగ్రాఫూ మొదలైనవన్నీ అయ్యేటప్పటికి సాయంత్రం అయిపోయింది అన్నీ అయ్యాక దాసుగార్ని శారదనీ తీసుకుని యింటికి బయలుదేరాడు అశ్వని

* * * *

కర్మణ్యే వాదికారస్తే! మా ఫలేషు కదాచన
మా కర్మ పలహేతుర్భూ! ర్మాతే సఙ్గో
స్త్వకర్మణి

'కర్మను- ప్రవృత్తి, నివృత్తి అను రెండు మార్గములలో చేయవచ్చును మొదటిది ఫలమును కోరి రెండవది ఫలాపేక్ష లేక, కర్మను చేయుటకు రెండవ మార్గమే సరైనది మొదటిది కష్టమైనదనే చెప్పాలి రెండోది స్వచ్ఛందము అదీ కాక పలాపేక్ష కోరి పని చేస్తే ఆశించే ఫలితం మాత్రమే దక్కవచ్చు ఫలం రాకపోతే బాధ కలుగుతుంది పలాపేక్ష లేక పని చేస్తే వచ్చిన ఫలం కొంచెమయినా బహు గొప్పగా వుంటుంది మామిడి టెంకను పాతితే అది నీడ, తోరణాలు, పలుదోము పుల్లల్ని కూడా పళ్ళతో

హాస్య నవలిక

# భలే పెళ్ళి

జి పద్మినీప్రసాద్

### బహుమతి పొందిన వ్యాఖ్య

"పీకలండి పీకలూ, రబ్బరు పీకలూ
పిచ్చివేషాలేస్తే లేచిపోవు మీ పీకలూ!"
- కె. సుభాషిణి (నంద్యాల)

"వూసలోల్ల చిన్నదాన్నిరోయ్!
వూసులెన్నో నేర్చినదాన్నిరోయ్!"
-బి. కృష్ణప్రసాద్ (హైదరాబాద్)

"నిన్న తెరమీద మురిపించిన ముద్దుగుమ్మా
నేడు వీధిన పడ్డా వేంటమ్మా!"
-బత్తుల లక్ష్మి (విజయనగరం)

" పిచ్చిదానిని కాను నేను
పిచ్చెక్కించే స్టార్ ని నేను!"
-జి. దుర్గారావు (గోపాలపురం)



### లక్కీ పేర్లు

జె. వరలక్ష్మి (నర్సీపట్నం), ఎ ఎ ప్రదాయిని (గుమ్మలూరు), పి జానకిరామ్ (గుంటూరు), జి సుబ్రమణ్యం (విశాఖపట్నం), కె పార్థసారధి (బాపట్ల), కె యస్. మాచన్న (తాళ్లపూడి), బి సాయిబాబా (ఒంగోలు), ఎ సుందరం (మద్రాసు), యస్ కె నాగ్ (పెనుగొండ), ఎం సంపత్ కుమార్ (రేపల్లె)

పాటు యిస్తుంది మనం కోరనటువంటి సకలైహికాముష్మిక సుఖాలూ బగవదనుగ్రహం వలన కలిగి తీరతాయి

కర్మలు చేయటంలో ఒక జాతి ఎక్కువా మరో జాతి తక్కువా- అన్న భేదం వుండదు ఈ ప్రపంచ గడియారంలో అన్ని చక్రాలూ సరిగా పని చేస్తేనే గడియారం తిరుగుతుంది మానవుని ప్రతిష్ఠ అతని జాతిని బట్టి కాక తన కర్మ మీద ఆధారపడి వుంటుంది

ఇంక ముఖ్యమయినది-

పలాపేక్ష వుండకూడదు కర్మలు మాత్రం చేసి తీరాలి అందలి పలా పలాలు దైవాదీనాలు కర్మ చేయుట తన వంతు పలమిచ్చుట భగవంతుని వంతు చేసిన కర్మకు తగిన పలం పూర్వజన్మ సుకృతాన్నిబట్టి వస్తుంది

రేడియోలో సూక్తి ముక్తావళి శ్రావ్యంగా వినిపిస్తోంది

అశ్విని కాఫీ గ్లాసుతో దాసుగారి మంచం దగ్గరకు వెళ్లాడు

దాసుగారి కను గుడ్లు ఎరుపెక్కి వున్నాయి

'నిద్ర పట్టలేదా?' అడిగాడు అశ్విని- కాఫీ గ్లాసును దాసుగారికి అందిస్తూ

ఇంకా ఎక్కడ నిద్ర నాయనా! నీ సుఖాన్నంతా ఆ రామబ్రహ్మంగాడు కొల్లగొట్టుకు తీసుకుపోయాడు నాగు పామని తెలియక పాలు పోసి పెంచాను వాళ్ళమ్మ ఓ యిచ్చకాల బుచ్చని అప్పట్లో కనుక్కోలేకపోయాను నా పిల్లను ఆ యింటికి తీసుకుని వెళ్తారనుకొన్నాను నా సర్వస్వాన్నీ దారబోశాను

వెదవ- కోరల్లో నింపుకున్న విషాన్ని నేను పాలు పోస్తే పెరిగిన విషాన్ని మాతో పూర్తిగా ఓంపిపోయాడు నా పురుగు పడా తగలకపోయే నా వాడు పురుగులోంచి

దాసుగారూ! అశ్విని ఆవేశ బరితమయిన కేక దాసుగారి శాపనార్థాలకు ఆనకట్ట వేసింది

దాసుగారు నీళ్ళు నిండిన కళ్ళతో అశ్విని చూశారు

అయ్యా! తమరికి నేను చెప్పాల్సిన వాడిని కాదు ఇప్పుడే రేడియోలో సూక్తి ముక్తావళిని మీరు వినే వున్నారు మీకు చాతయ్యింది మీరు చేశారు పలితం మీ చేతుల్లో లేదు మీకొచ్చిన కళని అతనికి పంచి యిచ్చారు అతడు మీ అంతటి వాడయ్యాడు నన్నడిగితే మీకు మంచి పలమే లబించింది ఇక మీరు నాకేదో అన్యాయం చేశానని బాద పడ్డారు అది అన్యాయం కాదు మీ మనవరాలి పెళ్ళి ప్రయత్నం మీరు చేశారు అందుకు నన్ను కాదన్నారు అలా చెయ్యటం మీ బాద్యత కానీ యిక్కడ మీకు పలం దక్కలేదు అయినా మీరు బాద పడకండి చెల్లెమ్మ పెళ్ళి నేను జరిపిస్తాను అన్నాడు అశ్విని

బాబూ! నీ రుణం

వద్దు దాసుగారూ! ఇక్కడ రుణాల ప్రస్తావన వద్దు కానీ నాదో చిన్న విన్నపం కుల ప్రసక్తి లేకుండా మీకున్న విద్యను పదిమందికీ పంచి పెట్టండి మీ కళకు సార్థకత కూడుతుంది

అవును బాబూ! తప్పకుండా నీ మాటను పాటిస్తాను అన్నారు దాసుగారు

తాతా! తాతా! అంటూ మంచం దగ్గరకు వచ్చాడు బాబిగాడు

రారా! నాన్నా రా! అంటూ చేతులు చాచారు దాసుగారు అంతలోనే ఆయనకు గుండె నొప్పి ఎక్కువయింది భగవాన్ నేను చేసిన తప్పును దిద్దుకునే అవకాశాన్ని నాకు లేకుండా చేస్తున్నావా? అంటూ గుండె పట్టుకుని వెనక్కు వాలిపోయారు దాసుగారు ●

# కవితానందం

## ద్వానా శాస్త్రి

ఎటు నుంచి చదివినా ఒకే విధంగా వుండే మాట చెప్పమంటే మనకి వెంటనే వికటకవి గుర్తుకు వస్తాడు అలాగే కవులు పద్య పాదాన్ని లేదా పద్యాన్ని ఎటు నుంచి చదివినా ఒకే విధంగా ఉండేలా రాశారు మొదటి నుంచి చివరికి చదవటాన్ని సాహిత్య భాషలో అనులోమం అనీ, చివరి నుంచి మొదటికి చదవటాన్ని విలోమం అని అంటారు ప్రబంధ కవుల్లో ఇటువంటి గారడీ ఎక్కువగా కనిపిస్తుంది పిల్లలమర్రి పినవీరభద్రుడు రాసిన జైమినీ భారతము కావ్యంలో ముక్కు తిమ్మన్న రాసిన పారిజాతాపహరణము కావ్యంలో ఎటు చదివినా ఒకటే అనే పద్యాలు కనపడతాయి పిల్లలమర్రి నాలుగు పాదాలూ ఇలాగే రాసిన పద్యం ఇది–

వీరవర స్థిరవరవీ
సారసవర సాదయూద సారవసరసా
హారణరస్వరణరహా
తార జవనతానమానతా నవజరతా

ముక్కు తిమ్మన ఇంకాస్త గడుసరి మొదటి రెండు లైన్లు తిరగేసి చదివితే చివరి రెండు లైన్లు వచ్చేస్తాయి చివరి రెండు లైన్లు తిరగేసి చదివితే మొదటి




రెండు లైన్లు వచ్చేస్తాయి–

ఆ తమాషా పద్యం చూసి మీరూ పరీక్షించండి!

నాయశరగసారవిరయ
తాయనజయసారసుభగదరధీనియమా
మాయనిధీరదగభసుర
నాయజనయతాసురవిరసాగరశయనా!

వీటికీ అర్థాలుంటాయి– కాకపోతే దూరాన్వయం! ఇదొక కవితానందం– అంతే!

* * *




పైకి కనిపించే పద్యం ఒకటే కాని– వెదికితే పద్యంలో పద్యాలుంటాయి! ఆశ్చర్యపోకండి– ఇది కవుల ప్రతిభవల్ల ఏర్పడిన గారడీ! ఇటువంటి పద్య రచనా పద్ధతిని 'గర్భ కవిత్వం' అంటారు అంటే ఒకే పద్యంలో అనేక పద్యాలు ఇమిడ్చి రాయటం అన్నమాట! నన్నయ తర్వాత వచ్చిన నన్నెచోడుడు అనే కవి 'కుమార సంభవం' రచించాడు అందులో ఒకే కంద పద్యంలో నాలుగు కంద పద్యాలు ఉండేలా రాశాడు ఆ పద్యం ఇది–

' సుజ్ఞాన యోగ తత్త్వవి
దిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో
సజ్ఞాన పదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్చు రచల భావనఁదవులన్''

ఇందులో రెండో లైనులో రెండో గణం నుంచి- అంటే 'భవ' నుంచి ప్రారంభిస్తే భవబంధనముల సుజ్ఞాన యోగతత్త్వవిదిజ్ఞుల్'' అనే కంద పద్యం వస్తున్నది మళ్ళీ దీంట్లో రెండో లైను రెండో గణం నుంచి ప్రారంభిస్తే మూడో పద్యం- మూడో పద్యం రెండో లైను రెండో గణం నుంచి ప్రారంభిస్తే నాలుగో పద్యం వస్తాయి ఒకే పద్యంలో ఇలా నాలుగు పద్యాలుండేలా ఎలా రాశాడబ్బా అని ఆశ్చర్యపోకండి- ఎందుకంటే ఒకే పద్యంలో రెండు పద్యాలుండేలా- ఒక పద్యానికి రామాయణార్థం, రెండో పద్యానికి భారతార్థం వచ్చేలా రామపాటి లక్ష్మీనారాయణకవి 'భారత గర్భరామాయణ కావ్యం'' రచించాడట! బాప్‌రే!

* * * *

కవితా కసరత్తులు చెయ్యటం మాటలు కాదు అద్భుతమైన పాండిత్యం ఉండాలి పద్య రచనలో అపూర్వమైన నేర్పుండాలి ధారణా బలం వుండాలి అక్షరాలతో, పదాలతో, అర్థాలతో సమర్థవంతంగా గమ్మత్తుగా ఆడుకోగల సమయస్ఫూర్తి ఉండాలి ఇవన్నీ ఉన్న కవులే 'ఏకాక్షరి ద్వ్యక్షరి మొదలైన ఫీట్స్ చేశారు

ఒకే అక్షరంతో పద్యాన్ని రాయటం 'ఏకాక్షరి అవుతుంది అంటే అచ్చులు వేర్వేరుగా ఉండవచ్చు- హల్లు మాత్రం ఒకటే ఉండాలి నానననునిన నూనున నేను నిను ననన్ను అనే ఏకాక్షరి పద్యాన్ని జంట కవులైన నందిమల్లయ-

అబ్బెబ్బే- ఉన్నట్టుండి సత్తి
రావేదు! మీరేం కంగారుపడకండి!
మీ ఆయన ఇన్ని కవితా
కసరత్తులు చేస్తున్నారంతే!

మంటిసింగన వరాహ పురాణం'' కావ్యంలో రచించారు వీటికి అర్థాలు ఏకాక్షర నిఘంటువు చూసి లాగి లాగి చెప్పారు ముక్కుతిమ్మన కూడా 'ద్వ్యక్షరి రాశాడు ఆ తమాషా పద్యం ఇది-

మనమున ననుమానము నూ
నను నీ నామ మనుమను మననమును నేను
మ్మునమాన నన్ను మన్నన
మనుమను నానామును నీ నమానానూనా

# అంతరిక్ష పథాన భారత్ జెండా!

## మున్ముందు అమలుకానున్న పథకాలు

ప్రశ్న రోహిణీ ఉపగ్రహాల్ని మినహా, మీ సంస్థ యిప్పటివరకూ ఉపగ్రహాలనూ విదేశీ భూభాగాలనుండే ప్రయోగించింది కదా' మరి బహుళార్థసాధక ఉపగ్రహాలను మన భూభాగం నుండి ప్రయోగించగలిగే స్తోమతకు మీరు ఎప్పుడు చేరుకుంటారు?

ప్రొ పి యస్ యల్ వి ప్రయోగం విజయంతో?

ప్రశ్న ప్రస్తుతం మన కమ్యూనికేషన్ దూరదర్శన్, ఆకాశవాణి, వాతావరణ పరిశోధనా సంస్థలన్నీ ఇన్సాట్ ఉపగ్రహం మీదే ఆధారపడి ఉన్నాయికదా' ఒకవేళ దురదృష్టవశాత్తూ ఇ న్సాట్'లో అనుకోని అవాంతరాలూ, సాంకేతిక పరమైన యిబ్బందులూ ఏర్పడితే

ప్రొ అటువంటి ప్రమాదమే రాదు మీరన్నట్టు ఏ రకమైన ఇబ్బందులు వచ్చినా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాం

### ఉపగ్రహ గ్రహణం

ప్రశ్న అపుడపుడు దూరదర్శన్‌వారు వారి ప్రసారాల్లో ఫలానా టైములో ఉపగ్రహపు గ్రహణం కారణంగా ప్రసారాలు ఉండవు అంటూ ప్రకటనలిస్తూ వుంటారుకదా- అవి కూడా సూర్యచంద్ర గ్రహణాల మాదిరేనా? ఉపగ్రహ గ్రహణాల్ని నిరోధించే అవకాశాల్ని ఎవరూ కనిపెట్టలేదా?

ప్రొ రావు (నవ్వుతూ) అవి ప్రకృతి సహజంగా వచ్చే అడ్డంకులు సూర్యచంద్ర గ్రహణాల్లాగనే- వీటిని ఓవర్‌కమ్ కాలేము

ప్రశ్న ఇంగ్లండ్ దేశంలో లాగానే మనదేశంలోనూ 5-6 చానల్స్‌లో 24 గంటలూ దూరదర్శన్ ప్రసారాలు జరుపుకునే అవకాశం ఉంటుందాసార్?

ప్రొ రావు మనకూ అటువంటి అవకాశాలు వున్నా అది ప్రభుత్వంవారి నిర్ణయం

ప్రశ్న రష్యావారి మోల్‌నియా అమెరికా వారి ఇంటిల్‌శాట్ వంటి గ్లోబల్ శాటిలైట్ల అవసరం మనకుందాండీ?

ప్రొ వాటి అవసరం ప్రస్తుతానికి మనకు లేదనుకుంటాను

ప్ర అంతరిక్షంలోకి మనుషుల్ని ప్రయోగించే విషయం?

ప్రొ ప్రస్తుతానికి అటువంటి ఆలోచనలు లేవు

ప్రశ్న అంతరిక్ష పరిశోధనలు జరిపే ప్రపంచ దేశాల్లో మనది అయిదో స్థానమంటారు' నిజమా?

ప్రొ (నవ్వు) అలాగే అనుకోనివ్వండి!

ప్రశ్న అలాక్కాదు మీరే చెప్పవచ్చు కదండీ?'



(గత సంచిక తరువాయి)

ప్రొ చెప్పడానికి ఇదమిద్ధంగా ఒక కొలబద్ధ అంటూ ఏమీ లేదు అందుకని

ప్రశ్న ఆంధ్రప్రదేశ్‌లోని అరకులోయల్లో మీ సంస్థ విభాగాన్ని ఏర్పాటు చేసే ప్రతిపాదనలున్నాయంటున్నారు

ప్రొ అదేం లేదే'

ప్రశ్న ఇండియన్ రిసెర్చి ఆర్గనైజేషన్ అని పిలువబడే మీ సంస్థలో రిసెర్చి (పరిశోధన) ఏ మేర జరుగుతోందండి?

ప్రొ మా సంస్థలో జరిగే పరిశోధనలపై ఎన్నో పరిశ్రమలు సంస్థలూ ఆధారపడి సాగిపోతూ మాకు కూడా ఎంతో ఉపయోగ పడుతున్నాయి ఉదాహరణకు మీ రాష్ట్రంలోని ఆంధ్ర షుగర్స్ (తణుకు)

ప్రశ్న మీ సంస్థ యింత వరకూ ప్రయోగించిన ఉపగ్రహాలైన ఆర్యభట భాస్కర-1 భాస్కర-2 ఆపిల్ ఇన్సాట్-1ఎ ఇన్సాట్-1బి, ఇన్సాట్-1సి ఐ ఆర్ యస్-1ఎ మరియూ రోహిణీ ఉపగ్రహాల్లో ప్రస్తుతం అందరికీ తెలుస్తున్న ఇన్సాట్-1బి ఇన్సాట్-1సి మరియూ ఐ ఆర్ యస్-1ఎ మినహా మిగతా వాటిల్లో ఏ ఉపగ్రహమైనా చనిపోయిందా? అంటే పనికిరాకుండా పోయాయా? అటువంటి డెడ్ శాటిలైట్లను కక్ష్య నుండి తప్పించే ప్రయత్నాలేమైనా ఉన్నాయా?

ప్రొ మన ఇన్సాట్-1ఏ అటువంటిదే- అయితే వాటిని డి ఆర్బిట్ చెయ్యాల్సిన పనిలేదు వాటంతట అవే క్రమేపీ శూన్యంలోకి జారిపోతాయి- వాటివల్ల మనకు వచ్చే ప్రమాదం ఏం లేదు

ప్రశ్న ఐ ఆర్ యస్-1ఏ ఉపగ్రహ ప్రయోగం విజయవంతమైంది అదీ దిగ్విజయంగా పని చేస్తోంది కదా- ఆ సీరీస్‌లో రావాల్సిన 1బి 1సి లను ఎప్పుడు కక్ష్యలోకి పెట్టాలని అంచనా?

ప్రొ 1బి 1991 సం లో - 1సి 1993 సం లో జరుగుతాయని ఆశ'

### ఉపయోగాలేమిటి?

ప్రశ్న అంతరిక్ష పరిశోధనా సంస్థ వలన యీ దేశం ప్రజలూ ఎన్నో ఎన్నెన్నో ప్రయోజనాలు పొందుతున్నా లబ్ధిదారుల్లో చాలా మందికి మీ సంస్థ యొక్క విశిష్టత తెలియకపోయినా

ప్రొ మా కర్తవ్యం అది మా లక్ష్యం అది మా గమ్యం అది యీ ఫలితాలన్నీ ప్రజలకు చేరుకోవాలనే కదా మా కోరిక

ప్ర : మిమ్మల్నీ, మీ సంస్థలోని ప్రతి ఒక్కర్నీ అభినందిస్తూ మరో విషయం

ప్రొ చెప్పండి

ప్ర భారతదేశపు 70 శాతం ప్రజానీకానికి 300 పైచిలుకు టి వి స్టేషన్లు మీ ఉపగ్రహం ద్వారానే సేవలందిస్తున్నాయి రేడియో టెలికమ్యూనికేషన్ ఫేక్స్ మరియూ న్యూస్ సర్వీసు, స్టాండర్డ్ టైము మెయింటినెన్సు, నీటివనరులు, వరదలు వాతావరణం, భూమి సర్వే, వరద హెచ్చరికలూ విద్యావ్యాప్తి జియోలాజికల్ సర్వే సముద్ర తీర నదీ పరీవాహక సర్వే, పంట భూముల మంచు ప్రాంతాల సర్వే ఖనిజాలూ, ఖనిజ వాయువుల సర్వే, ఫైనాన్స్ కమిషన్ సైన్స్ అండ్ టెక్నాలజీ చివరకు రైల్వే గూడ్సు వేగన్ల క్రమబద్ధీకరణ మొ వాటితో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ మీ సంస్థ పాత్ర ఉన్నది కదా అదే విధంగా ఆర్కియాలజీ (పురావస్తు శాఖ)తో సంబంధాలున్నాయా?

ప్రొ బాగా జ్ఞాపకం ఉన్నదే (నవ్వు) అంతేకాదు మరికొన్ని కూడా ఉన్నాయి వాటి విషయాలు మరోసారి ముచ్చటించుకొందాం- మీరడిగిన ఆర్కియాలజీ' వారితో పెద్దగా కాకపోయినా మా పి ఆర్ ఎల్ ఇంటరాక్టు చేస్తోంది

**ప్ర : భారతదేశపు 'కేప్ కెన్నెడీ' అని పిలవబడే శ్రీహరికోట రాకెట్ కేంద్ర విషయానికి వస్తే... 2000 ఏ.డి. తర్వాత శ్రీహరికోట భవిష్యత్ ఏమిటి?**

**ప్రొ : పి. యస్. యల్. వి. వంటి పెద్ద ఉపగ్రహ ప్రయోగ వాహన ప్రయోగం విజయవంతమైన తర్వాత శ్రీహరికోటకు బంగారు భవిష్యత్తు వుంటుంది. ప్రపంచంలో గల పెద్ద రాకెట్ కేంద్రాల సరసన చేరిపోతుంది.**

ప్ర సర్ అభివృద్ధి చెందిన రష్యా మెక్సికో దేశాల్లో యిటీవల సంభవించిన భూకంపాలను గుర్తుకు తెచ్చుకుంటే సీస్మోగ్రాఫ్సను ఉపయోగించడంతో బాటు, ఉపగ్రహాలను ఉపయోగించి భూకంపాల రాకడనైనా కనీసం కొంత వ్యవధి ముందుగా తెలుసుకోగలిగితే, ప్రాణ నష్టాన్ని కొంత మేరకైనా అరికట్ట వీలవుతుంది కదా! ఏమంటారు?

ప్రొ నిజమే అయితే దురదృష్టవశాత్తూ ప్రపంచ దేశాలన్నీ యీ విషయంలో వెనుకబడి ఉన్నాయనే చెప్పుకోవాలి అదీగాక మనకున్న స్పేస్ టిక్నాలజీ అంత దూరానికి చేరుకోలేదు ఏదైనా యీ విషయాన్ని తీవ్రంగానే ఆలోచించాలి

ప్ర ఇస్రో- డిఫెన్సు వారూ సంయుక్తంగా హైపర్‌ప్లేన్ ను తయారు చేసినట్టు వినికిడి

ప్రొ నిజమే

ప్ర 'అగ్ని మిస్సైల్ (క్షిపణి) గురించి ఏమైనా

ప్రొ తప్పకుండా సక్సెస్ అయితీరుతుంది ఇది నా గాఢమైన, నిగూఢమైన కోరిక (ఇంటర్వ్యూ సమయానికి క్షిపణి ప్రయోగం కాలేదు- ప్రయోగం జయప్రదమైంది)

ప్రశ్న మీ సంస్థలో జాయింట్ కన్సల్టేటివ్ మెషినరీ అవతరించి పదేళ్ళు పూర్తవుతున్న సందర్భంలో మీకూ, మీ సంస్థలోని కార్మిక వర్గానికీ గల సంబంధాలెలా వుంటాయో చెప్తారా?

ప్రొ అంతా కార్మికవర్గమే రాకపోకలుంటేనే బాంధవ్యాలు పెరుగుతాయి అలాగే మాలో యిచ్చిపుచ్చుకునే ధోరణి మా అందరిలోనూ ఉండబట్టే మా సంస్థలోని జె సి ఎం ఒక దశాబ్దినిసునాయాసంగా దాటగలిగింది మా బాంధవ్యానికియింత కంటే మంచి ఉదాహరణ మరేం ఉంటుంది?

ప్ర 84 సంవత్సరపు తుపానూ అంతకు ముందు సంభవించిన ప్రకృతి బీభత్సాలనూ ఆయా కాలాల్లో పదుల రోజుల పాటు శ్రీహరికోట దీవికి మెయిన్ లాండ్‌తో రోడ్డు సంబంధాలు తెగిపోయిన నేపథ్యంలోనూ అలాగే వివిధ ప్రదేశాల నుండి శ్రీహరికోటకు వచ్చే భారీ పరికరాల రవాణా దృష్ట్యానూ ఉద్యోగుల రవాణా అవసరాలనూ పరిగణనలోనికి తీసుకుంటే సూళ్ళూరుపేట నుండి శ్రీహరికోట వరకూ రైలు మార్గాన్ని ఏర్పాటు చేసుకుంటే మరింత సౌలభ్యంగా ఉంటుందేమో

ప్రొ పరిశీలించాలి

ప్ర : అలాగే శ్రీహరికోట ఉద్యోగుల, ప్రాజెక్టు అవసరాల దృష్ట్యా, సూళ్ళూరుపేట ప్రాంత అభివృద్ధి, ప్రయాణీకుల అవసరాలను తీర్చగలగాల్సిన సూళ్ళూరుపేట రైల్వే స్టేషన్ వరకూ ఆ ప్రాంతానికి అతి దగ్గర్లో గల మద్రాసు నుండి నడిచే సబర్బన్ రైళ్ళ పొడిగింపూ మరికొన్ని ఎక్స్‌ప్రెస్ రైళ్ళ నిలుపుదల విషయంలో ఆ ప్రాంత ప్రజలు, మీ ఉద్యోగ సంఘాలూ చేస్తున్న ప్రయత్నాలకు మీరు చేయూతనిస్తే వారి ప్రయత్నం సులభతరమవుతుందేమో!

ప్రొ "అవును నా వంతు ప్రయత్నం నేనూ చేస్తున్నాను" అంటూ లేచి ఆంధ్ర పాఠకులందరికీ నా తరఫునా, మా సంస్థ తరఫునా ధన్యవాదాలు తెలియజెయ్యండి ఉంటాను మరి అన్నారు

యింటర్వ్యూ : జగన్‌మిత్ర

1991-92 ప్రాంతంలో శ్రీ హరికోట నుండి ప్రయోగింపబడే పోలార్ శాటిలైట్ లాంచ్ వెహికిల్ (పి ఎస్ ఎల్.వి ) యీ స్ట్రక్చర్ నుండే ప్రయోగింపబడుతుంది



# ప్రశ్నావళి
# కె రామలక్ష్మి

జి. అశోక్ వెంకటి, మెట్‌పల్లి

నేడు నవలలు పారకుల కోసం కాక ప్రేక్షకుల కోసం వ్రాయబడుతున్నాయి ఇదెంతవరకు సమంజసం?

* సాగినంత కాలం!

మంచి రచయితలు నేడు అస్త్ర సన్యాసం స్వీకరించారనిపిస్తుంది ఏంటి కారణం?

* దిగజారడం చేతకాక!

ఆరుద్రగారు సినిమా పాటలు రాయక పోవడానికి గల కారణం ఏమిటి?

* డబ్బు అవసరం లేకపోవడం అరవై వచ్చాకేనా రిటైరవ్వాలన్న ఆశ బాధ్యత లంతగా కృంగతీయక పోవడం

ఆరుద్రగారిలో మీకు నచ్చని దేదైనా వుందా?

* ఉంది ఏ పని ప్రారంభించినా దాని అంతు చూడాలన్న పట్టు ఏదీ సరదాగా చేపట్టకపోవడం (నాకు లేనిదే అది!)

ముత్యం రమాదేవి, బళ్లారి

మీరు రాసిన నవలలు ఆరుద్రగారు చదివి వారి అభిప్రాయం చెప్తారా?

నే రాసిన వాటిని గురించి 'చదివించి' అభిప్రాయం అడిగే అలవాటు నాకు మొదట్నుంచీ లేదు!

మీ అమ్మాయిలు ముగ్గురూ ఎక్కడ? పెంచిన కూతురు వుందని విన్నాను?

అవును వెరసి నాకు నల్గురు కూతుళ్లు అంతా దూరంగానే వున్నారు

కర్నాటక సంగీతం యిష్టం అన్నారు! ఎవరెక్కువ యిష్టం?

బొత్తిగా చెంబైలాంటి లెక్కల్లో సంగీతం నేను ఎక్కువ వినలేను ఎమ్ ఎస్ (మీరా, అన్నమయ్యలు కాకుండా), ఏసుదాసు, బాలమురళి ఈమధ్య మణి కృష్ణస్వామి కూడా కాస్త నచ్చుతోంది ఓలేటి పాట యిష్టం కచేరీలో కూర్చోలేను ఇలా చాలా రిజర్వేషన్లు వున్నాయి నా సరదాలకి

అన్నల్లారా తరువాత నవల రాస్తున్నారా?

ఆ కలువవాలలో నన్ను వెళ్లిపోనీరా (కొడుకా!) ప్రారంభం అయి ంది దయచేసి ఛీప్ త్రిల్స్ కోసం కిక్ కోసం జుగుప్సారసం కోసం మీరు దీన్ని చదవకండి నేను మీకవి అందించలేను!

చీమకుర్తి నాగేశ్వరరావు, సత్తెనపల్లి

కోర్టులోను, శాసన సభల్లోను ప్రమాణాలు చేయిస్తారు ప్రభుత్వ దృష్టిలో దేవుడున్నాడనా?

జాయింట్‌గా వుండకపోవచ్చు ఇండివిద్యుయల్‌గా వుండే వుంటాడన్న నమ్మకంతో చేయిస్తారని నా ఉద్దేశ్యం

మీ ప్రశ్నావళివల్ల పారకులకు కలిగే ప్రయోజనం ఏమిటి?

అది నేనేం చెప్పగలను? మీరు చెప్పాలి!

రామలక్ష్మిగారూ! ఎంతో విలువైన కాలం ఎలా సద్వినియోగం చేసుకోవాలి?

క్షణ క్షణం బ్రతికేస్తూ

నేడు పద్యాలు, పాటలు కవిత్వం రక రకాల సాహిత్యం వుంది కొత్తగా ఏదైనా వస్తున్నాయా?

ఇంకా లేదు తిట్ల కంప్యూటర్ వచ్చిందట కొన్ని లక్షల తిట్లు - అది తెప్పించేస్తే - యిటు సినిమా పాటలూ, అటు నవలల్లో ప్రత్యేక పాత్రల ప్రత్యేకతలూ, బ్రహ్మాండంగా పెంచవచ్చునంటున్నారు ఏ గొప్ప రచయితో ఆ పని చేస్తాడు మనం వేచి వుందాం

జి. సావిత్రీదేవి-పెంటపాడు.

నేను స్త్రీగా పుట్టినందుకు గర్వపడుతున్నాను ఎందుకంటే నేడు స్త్రీ పురుషుడితోపాటు అన్నిరంగాలలో ముందంజ వేస్తోంది స్త్రీకి సహనం త్యాగ గుణాలు పురుషులలో కంటే అధికం స్త్రీ పురుషుని కంటే తెలివైనది కూడా అలాంటి స్త్రీ కీనాడు సమాజంలో గౌరవం లేక పోవడం శోచనీయం కదూ కె రా గారూ?

మీరంటున్న సహనం, త్యాగం యివీనాడు చేతకాని తనానికి నిదర్శనాలు తెలివి స్త్రీకి యీనాడు-నిరూపయోగం కాడానికి కారణం-దాన్ని ఉపయోగించుకోక పోవడమే తనని తాను 'తగ్గించు'కుంటున్న స్త్రీలే- యీనాటి సమాజంలో స్త్రీకి వున్న తక్కువ స్థానానికి ముఖ్య కారకులు

జి. రామారావు, కాకినాడ

ఎదుటివారిని చూసి నేర్చుకో అంటారు ఎలా?

ఎదుటి వాడి దురదృష్టం నుంచి-మనం ఏం చేయకుండా వుండాలో-తెలుసుకో వచ్చుకద!

పీలా నాగేశ్వరరావు, అనకాపల్లి

చొప్పదంటు ప్రశ్నలు దానికి తగిన జవాబులు- అసలు యీ శీర్షిక ఉద్దేశ్యం ఏమిటి మిసెస్?

* ఏయ్, మిస్టర్ పీలా! అసలిలాంటి చొప్పదంటు ప్రశ్న యింకెక్కడ వెయ్యకువయ్యా??



# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

*పోషకాహార లాభం* : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

*రుచి లాభం* : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

*సమయం ఆదా లాభం* : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

*ఎంపిక లాభం* : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి

4 మాసాలు నించి

6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL



"పసిడి పంటలు" కృష్ణ, భానుప్రియ

సినిమా



"ఆర్ధనాదం"తో విజయలలిత, ప్రసాద్‌బాబు

## యండమూరి దర్శకత్వంలో "అగ్ని ప్రవేశం"

యండమూరి వీరేంద్రనాథ్‌ని డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాం ఆయన రాసిన సీరియల్ నవలనే తెరకెక్కిస్తున్నాం అన్నారు కె ఎస్ రామారావు ఈయన నిర్మించే క్రియేటివ్ కమర్షియల్ చిత్రానికి త్వరలో నే తారాగణం ఎంపిక జరుగుతుం

## రాజేంద్రప్రసాద్‌తో సత్యారెడ్డి "గంగ – జమున"

హాస్యం సెంటిమెంట్‌తో పాటు యాక్షన్ కూడ ఉంటుంది సీత తొలిసారిగా ద్విపాత్రల నిర్వహిస్తుంది నాగేంద్రబాబు ఒక కీలకమై పాత్రను ధరిస్తారు ఆగస్టు నుంచి అక్టోబర్ వరక మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ ముగుస్తుంది అన్నారు సత్యారెడ్డి ఈయన కథ – స్క్రీన్‌ప్లే · దర్శకత్వంలో డి ప్రభాకర్ నిర్మించే ప్రియ ఆర్ ప్రొడక్షన్స్ గంగ – జమున చిత్రానికి రాజ్–కోటి సంగీతం దివాకర్ ఛాయ రంగారావు శిల్పం రాజేంద్రప్రసాద్ సహకార దర్శకత్వం రాజ సాహసాలు రామ్‌గోపాల్‌రెడ్డి కూర్పుతో ఎస్ బావనారాయణ నిర్వహణ బాధ్యతలు వహి స్తున్నారు

# కమల్‌తో డి. రామానాయుడు తొలి చిత్రం

ఇది మా 57వ చిత్రం మా సంస్థలో కమల్ తొలి చిత్రం కమల్ చిత్రానికి పరుచూరి సోదరులు రచనచేసే తొలిచిత్రం కమల్ సరసన విజయశాంతి నటించే తొలి చిత్రం ఇలా ఈ చిత్రానికి ఎన్నో ప్రత్యేకతలున్నాయి విజయశాంతి సాయంత్రం అనే పత్రికలో పనిచేసే జర్నలిస్టుపాత్ర. కమల్ హీరోగా విలన్‌గా ద్విపాత్రలు నిర్వహిస్తున్నారు. ఆయన నటించే 14వ తెలుగు చిత్రమిది జూన్ 21 నుంచి 30 వరకు తొలి షెడ్యూల్ జరిగింది జూలై – ఆగస్టులలో కూడా ప్రతి నెలా 15వ తేదీ నుంచి ఆఖరి తేదీ వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌లో హైదరాబాద్‌లోనే షూటింగ్ పూర్తవుతుంది ప్రేమ సెంటిమెంట్ కామెడీ అన్ని రసాల మేలుకలయికతో రూపొందుతోంది అన్నారు డి రామానాయుడు ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ చిత్రంలో కమల్‌హాసన్. విజయశాంతి. చరణ్‌రాజ్ ఎ ఎల్ నారాయణ, గొల్లపూడి మారుతీరావు, రాళ్ళపల్లి, శ్రీవిద్య, సువర్ణ, కుయిలీ. జయలలిత వగైరా నటవర్గం పరుచూరి సోదరులు కథ – మాటలు రాశారు వేటూరి గీతాలు ఇళయరాజా సంగీతం పి ఎస్ ప్రకాష్ ఛాయ చంటి శిల్పం వరదరాజా సంయుక్త దర్శకత్వం సత్యనారాయణ సహకార దర్శకత్వం విజయకుమార్ – పి పి శాస్త్రి ప్రొడక్షన్ మార్తాండ్ కూర్పుతో సురేష్ కృష్ణ స్క్రీన్‌ప్లే సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్నారు. ●

## "పోలీస్ రిపోర్ట్"లో దొరికిన తీగ

జలందర్(మల్లికార్జునరావు) పొడవైన సిగార్ కాలుస్తూ ఫొటో వంక తీక్షణంగా చూస్తుండగా అబ్బాస్(బరణి) నెత్తికి కట్టుకట్టుకుని వచ్చాడు. మూల్గుతూ బాస్! ఈ కేసు గురించి బుర్ర బద్దలుకొట్టుకుంటే తప్ప ఐడియాస్ రావన్నావుగా? బుర్ర బద్దలుకొట్టుకున్నాము ఐనా ఐడియా రాలేదు రక్తం వచ్చింది అన్నాడు

ఛీ! నిన్ను డిటెక్టివ్‌ని చేయడం నా వల్ల కాదు. ఉన్న క్లూ వదిలేసి బుర్ర బద్దలు కొట్టుకుంటారా ఎవరైనా? అని ఫొటో వంక చూస్తూనే "ఒరేయ్ అబ్బాస్! టెర్రిఫిక్ లాంటి అయిడియా వచ్చింది చూడు ఈ ఫొటోలోని అమ్మాయి కాళ్ళకు మువ్వలపట్టీలున్నాయా? మరి ఆ అమ్మాయి కాళ్ళకి లేవుగా? అని ప్రశ్నించాడు జలందర్

అబ్బాస్ ముఖం బల్బులా వెలిగింది. "మీ బుర్రే బుర్ర అన్నాడు

విశ్వామిత్ర ఆర్ట్ క్రియేషన్స్ పోలీస్ రిపోర్ట్" చిత్రానికి ఛాయ – దర్శకత్వం హరి అనుమోలు.




తాతయ్యపెళ్ళి– మనవడి శోభనం"లో నూతన్‌ప్రసాద్, శ్రీలక్ష్మి

సీరియల్

# వజ్రసంకల్పం

## నాతేవాహన

(గత సంచిక తరువాయి)

కౌసల్య నెమ్మదిగా కళ్లుతెరిచి చూసింది

బొట్టులేని ఆమె మొహం కళావిహీనంగా వుంది. కళ్లకింద నల్లని వలయాలు ఏర్పడ్డాయి. ప్రసవ వేదన వల్ల కళ్లు బాగా అలసటగా చూస్తున్నాయి. కళ్లు తెరుస్తూనే ఆమె తన చుట్టూ ఆతృతగా చూసింది.

ఎదురుగా విశ్వధరవర్మ కొండచరియలా నిలబడి వున్నారు.

"మావయ్యా!" బలహీనంగా అందామె. "నా బాబు! ఏడీ నా బిడ్డ?"

"క్షేమంగా వున్నాడు!" గంభీరంగా అన్నాడాయన.

"కానీ... కానీ ఏడీ వాడు? నాకు చూపించండి!"

విశ్వధరవర్మ మొహంలో గాంభీర్యం చెక్కు చెదరలేదు నెమ్మదిగా ఆమె పక్కన స్టూలు మీద కూర్చుని అనునయంగా ఆమె చేతి మీద చెయ్యి వేశాడు

"తల్లీ! నీ బిడ్డని నీకు చూపించగలను కానీ.... చూపించను"

ఆ మాటతో షాక్ తిన్నదానిలా చూసిందామె.

"మావయ్యా. . !"

విశ్వధరవర్మ తలూపేడు

"అవును తల్లీ! మాతృప్రేమను మించిన శక్తి సృష్టిలో మరొకటి లేదు. మాతృప్రేమను నువ్వు జయించలేవు ఒక్కసారి నీ బిడ్డను నువ్వు చూస్తే నీ వజ్రసంకల్పం బీటలు వారుతుంది ఉరికంబానికి వేలాడే ముందు నీ భర్తకు నువ్వు చేసిన వాగ్దానం భగ్నమైపోతుంది."

"నాకు.. నాకింత పెద్ద శిక్షా మావయ్యా?"

"ఇది శిక్ష కాదమ్మా! భిక్ష! ఈ ముసలివాడికి నువ్వు ప్రసాదించిన భిక్ష! నీ భిక్ష నువ్వు తిరిగి తీసేసుకుంటానంటే నేనేం చెయ్యగలను?"

కౌసల్య మొహం గంభీరంగా మారింది.

"మావయ్యా! ఇప్పటివరకూ మీరు చెప్పిన మాట యేదీ నేను కాదనలేదు. ఇకముందు కాదనకూడా నా బిడ్డను మీరెలా పెంచుతారని నేనడగను ఏం చేస్తారనీ ఎక్కడికి తీసుకెళ్తారనీ నేనడగను ఆ మాత్రం సంకల్పబలం లేనిదాన్నయితే ఈ కథ ఇంతవరకూ వచ్చేది కాదు గుండె రాయి చేసుకోవడానికి నేను సిద్ధంగా వున్నా-

ను కానీ . కానీ ఒక్కసారి- ఒకేఒక్కసారి నా బిడ్డ ముఖం నాకు చూపించండి వాడ్ని కళ్లారా చూసుకోవాలనీ, చేతులారా ఎత్తుకోవాలనీ, ముద్దారా ముద్దాడుకోవాలనీ, నా గుండె తహ తహలాడిపోతోంది ఒక్కసారి- ఒకే ఒక్కసారి!"

"కానీ తల్లీ ..!"

"ఇక ఆలస్యం చేయకండి మావయ్యా! ఇక ఆలస్యం ఎంతమాత్రం చెయ్యకండి తొమ్మిది నెలలు మోసి ఎంతో ప్రసవ వేదన అనుభవించి కన్న బిడ్డను ఒక్క క్షణం కళ్ళజూసుకునే భాగ్యం ప్రసాదించండి మిమ్మల్ని వేడుకుంటున్నాను మావయ్యా ! చేతులెత్తి వేడుకుంటున్నాను. ఒక్కసారి . ఒకే ఒక్కసారి వాడ్ని నాకు చూపించండి ఆ తర్వాత వాడ్ని మీరేం చేసుకున్నా నేను నోరెత్తను."

విశ్వధరవర్మ గాఢంగా నిట్టూర్చాడు

"తల్లి నుంచి బిడ్డను వేరు చేసే పాపాన్ని మోయడానికి నేను సిద్ధంగా వున్నా కన్నబిడ్డను ఒక్కసారి కూడా కళ్ళ జూడకుండా ఉండేందుకు నువ్వు సిద్ధపడవని నాకు ముందే తెలుసు ఇలాంటి పరిస్థితి వస్తుందని కూడా నాకు తెలుసు. కర్తవ్య దీక్షా, కన్న ప్రేమా రెండూ పోటీ పడతాయనీ ఆ పోరాటంలో నువ్వూ నేనూ నలిగిపోక తప్పదనీ అంతకన్నా బాగా తెలుసు నువ్వు మాతృప్రేమను జయించలేకపోతే నేను చేయగలిగిందేమీ వుండదనీ తెలుసు అయినా నీమీద నమ్మకంతో- నీ వజ్రసంకల్పంమీద నమ్మకంతో నీ కన్నబిడ్డను నీకు చూపిస్తాను మాతృప్రేమే జయిస్తుందో కర్తవ్యదీక్షే జయిస్తుందో చూద్దాం సత్యం! బిడ్డనిలా తే!" ఆజ్ఞాపించాడు.

అంతవరకూ అక్కడే నిలబడివున్న సత్యం మౌనంగా బయటికి నడిచి కొద్ది క్షణాల్లో పొత్తిళ్లలో బిడ్డతో తిరిగొచ్చాడు. విశ్వధరవర్మ ఆ బిడ్డని తన చేతుల్లోకి తీసుకున్నాడు

"ఇదుగో నీ బిడ్డ! కానీ ఒక్క మాట మాత్రం జ్ఞాపకం వుంచుకో నీ బిడ్డ ఒక మహా కార్యం సాధించడానికి పుట్టినవాడు కారణజన్ముడు. అందుకోసం నీ మాతృప్రేమను నువ్వు జయించక తప్పదు "

ఆమె పొత్తిళ్ళలోని బిడ్డను చేతుల్లోకి తీసుకుని ఒక్కసారిగా గుండెలకు హత్తుకుని ముద్దుల వర్షం కురిపించింది ఆమె కళ్ళ వెంబడి కురుస్తున్న కన్నీరు నిద్రపోతున్న పసిబిడ్డ చిన్నారి మోమును నిర్విరామంగా తడిపేస్తోంది

ఇంతవరకూ సాగిన కథ-7: విశ్వధర వర్మకు తండ్రి అనంతరం మిగిలిన భూమిలో బావి త్రవ్వుతుండగా అపురూపమైన వజ్రం దొరుకుతుంది. అతని దాయాది అయిన వజ్రపాణి దాన్ని కాజేయాలనుకుంటాడు. ఆ వజ్రాన్ని కాపాడుకునేందుకు బావి దగ్గర కాపలా వున్న విశ్వధర వర్మ కొడుకు రాజేంద్ర వర్మను, అతని కుటుంబాన్ని దారుణంగా తన కత్తికి ఎరచేసి వజ్రాన్ని దక్కించుకుంటాడు వజ్రపాణి. విశ్వధర వర్మ చిన్న కొడుకు నరేంద్ర వర్మపైఒక హత్యా నేరం మోపబడి ఉరిశిక్ష పడుతుంది. జైలర్ సత్యం అనుమతితో తన భర్తలో గడిపిన కౌసల్య ఒక మగబిడ్డకు జన్మనిస్తుంది.

"ఆ దృశ్యాన్ని చూస్తూ రాయిలా కూర్చున్నాడు విశ్వధరవర్మ ఆ క్షణంలో ఆయన గుండెల్లో చెలరేగుతున్న భావాలు బయటికి వ్యక్తపరచడంలేదు. కొద్ది క్షణాల్లో ఆ తల్లీ బిడ్డా వేరు కాబోతున్నారనీ, వేరు కాక తప్పదనీ గుర్తు చేసుకున్నకొద్దీ ఆయన గుండె రంపపు కోతకు గురౌతోంది.

కన్నబిడ్డను అదేపనిగా ముద్దు పెట్టుకుంటున్న ఆమె శిరస్సు పైన చెయ్యి వేశాడాయన

ఆమె తల పైకెత్తి చూసింది.

మాతృప్రేమ సంతృప్తి చెందడంతో ఆమె కళ్ళు చిత్రంగా వెలుగుతున్నాయి.

"మహా కార్యాన్ని సాధించడానికి పుట్టిన నీ కొడుక్కి నువ్వే నామకరణం చెయ్యి తల్లీ!" తన ముఖంలోని గాంభీర్యం చెక్కు చెదరనివ్వకుండా మనస్సులో చెలరేగుతున్న అలజడి అణుచుకుంటూ సౌమ్యంగా అన్నాడాయన

"శక్తిధర్!" తడుముకోకుండా చెప్పిందామె "మీరు వీడి ద్వారా సాధించదల్చుకున్న మహా కార్యం సాధించడానికి వీడు మహా శక్తివంతుడు కావాలి. శక్తిధరవర్మ అని పేరు పెట్టండి మావయ్యా! ఇదుగో మీ మనవడు!" రెండు చేతుల్లోనూ బిడ్డను పట్టుకుని ఆయన వైపు చాస్తూ చెప్పిందామె

విశ్వధరవర్మ కళ్ళుప్పగించి కొద్దిసేపు ఆమె చేతుల్లోని బిడ్డని దీక్షగా చూశాడు.

శక్తిధరవర్మ!

ఆ పేరు తల్చుకుంటూనే ఆయన గుండె వుప్పొంగింది.

* * * * * * *

వజ్రపాణి తన హవేలీ పై అంతస్తులో కిటికీ పక్కనున్న టేబుల్ ముందు కూర్చొని వున్నాడు అతని యెదురుగా ఆ టేబుల్ మీద ఓ పెద్ద ముఖమల్ వస్త్రం పరచి వుంది. దాని మీద నీట్‌గా ఓ పద్ధతి ప్రకారం రకరకాల ముడి వజ్రాలు పెట్టి వున్నాయి.

రకరకాల రంగుల్లో వున్నాయా ముడి వజ్రాలు. లేత నీలం రంగు వజ్రాలూ, లేతాకు పచ్చ వజ్రాలూ, పసుపు పచ్చ రంగువీ, గోధుమ వన్నెవీ, ఎర్రవీ అసలే రంగూలేనివీ- రకరకాల వజ్రాలు.

వజ్రాల్లో రకరకాల రంగుల వజ్రాలుంటాయి. అన్నీ విలువైనవే అయితే అన్నింటికంటే విలువైనవి రంగులేని వజ్రాలు ఈ రంగు లేని వజ్రాల్లో కూడా లీలగా నీలం రంగు గోచరించేది జాతి వజ్రం వజ్రాల్లో ముదురాకుపచ్చ, ముదురు ఎరుపు, ముదురు నీలంరంగు వజ్రాలు కూడా వుంటాయి ఈ ముదురు రంగుల్లో కనిపించే వజ్రాన్ని 'ఫ్యాన్సీ డైమండ్స్' అంటారు

నవరత్నాల్లో వజ్రాలే అన్నింటికంటే లోక ప్రసిద్ధమైనవి. సృష్టిలో ఒకే ఒక్క మూల పదార్థం ద్వారా వజ్రం ఏర్పడుతుంది- కార్బన్! నిజానికి చెప్పాలంటే బొగ్గు, గ్రాఫైట్ల వంటిదే వజ్రం కూడా! అయితే దాని సౌందర్యమే ఇతర ఖనిజాల కంటే మానవజాతి వజ్రాలంటేనే పడి చచ్చేలా చేస్తుంది. ఇతర ఖనిజాలకీ వజ్రాలకీ వుండే ముఖ్యమైన తేడా- దృఢత్వం వజ్రం కంటే దృఢమైన ఖనిజమేదీ సృష్టిలో లేదు ఈ దృఢత్వం వల్లనే వజ్రం ఎన్ని వేల సంవత్సరాలైనా చెక్కు చెదరకుండా అలాగే వుండిపోతుంది ఈ దృఢత్వం వల్లనే

కొన్ని వందల ఏళ్ల క్రితం జీవించిన రాజుల రారాజుల వైభవానికి చిహ్నంగా మిగిలిపోయిన అనేక వజ్రాల్ని మనం సజీవంగా ఈనాటికీ చూడగలుగుతున్నాం ఆనాటి ఆ రాజులూ మహారాజులూ అనుభవించిన థ్రిల్ మనమూ అనుభవించగలుగుతున్నాం. వజ్రాన్ని కోయగల శక్తివంతమైన వస్తువేదీ ప్రపంచంలో లేదు అందుకే వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి

వజ్రపాణి తన ఎదురుగా వున్న ముడి వజ్రాలన్నింటినీ ఓపిగ్గా ఏకదీక్షతో భూతద్దంలో పరీక్షిస్తున్నాడు ఏ వస్తువైనా పది

# వజ్రసంకల్పం

రెట్లు పెద్దదిగా చూపిస్తుందా భూతద్దం
వజ్రాన్ని భూతద్దంలో పరీక్షించడానికో

కారణం వుంది. ప్రతి వజ్రంలోనూ ఎంతో కొంత అన్య పదార్థాలు చేరడం అనివార్యం ఈ అన్య పదార్థాల్నే 'ఇన్‌క్లూషన్స్' అంటారు అయితే అంతమాత్రం చేత ఈ 'ఇన్‌క్లూషన్స్' వజ్రం విలువను తగ్గించేస్తాయని భావించడానికి వీల్లేదు వాస్తవానికి ఈ అన్య పదార్థాలవల్ల ఒక్కోసారి వజ్రం సౌందర్యం ఇనుమడిస్తుంది కూడా ఈ ఇన్‌క్లూషన్స్ ఒక్కో వజ్రంలో ఒక్కో విధంగా వుంటాయి అందుకే ఏ ఒక్క వజ్రమూ మరో వజ్రాన్ని పోలివుండదు

వజ్రాల్లో ఇన్‌క్లూషన్స్‌ని ఎంతవరకూ పట్టించుకోనవసరం లేదనే విషయం మీద వజ్రాల నిపుణుల మధ్య అంతర్జాతీయ ఒప్పందం ఒకటి కుదిరింది ఈ ఒప్పందం ప్రకారం ఒక వస్తువుని పది రెట్లు పెద్దదిగా చూపించే భూతద్దం గుండా ఒక వజ్రాన్ని పరీక్ష చెయ్యాలి ఆ పది రెట్ల మేగ్నిఫికేషన్ గల భూతద్దంలో ఇన్‌క్లూషన్స్ కనిపించనంత వరకూ ఎలాంటి ఇన్‌క్లూషన్నీ పట్టించుకోనవసరం లేదు

కోసిన వజ్రాల విలువ అంతర్జాతీయంగా చాలా ఖచ్చితమైన పద్ధతిలో కొలుస్తారు యుగయుగాలుగా ఈ పద్ధతిలోనే వజ్రాల విలువ నిర్ణయించడం జరుగుతోంది ఇంగ్లీషులోని అక్షరం 'సి'- ఈ పద్ధతినే క్లుప్తంగా నాలుగ 'సి'ల పద్ధతి అంటారు ఈ నాలుగు సీలూ ఏమిటంటే - కలర్, క్యారెట్, కట్, క్లారిటీ! తెలుగులో చెప్పాలంటే రంగు, క్యారెట్టు, కోత, స్వచ్ఛత

ముందుగా చెప్పినట్టుగా రంగులేని వజ్రాలు అన్నింటికంటే విలువైనవి. క్యారెట్టు వజ్రం బరువుని సూచిస్తుంది ఒక గ్రాములో ఇరవయ్యో వంతు ఒక క్యారెట్టు అంటే ఒక గ్రాము వజ్రం ఇరవై క్యారెట్ల బరువుంటుందన్న మాట వజ్రంలోని 'జ్వాల'ని స్పష్టంగా కనిపించేలా చేసే కోతనే బ్రిల్లియంట్ కట్ అంటారు ఈ బ్రిల్లియంట్ కట్ ఎంత బావుంటేవజ్రం విలువ అంత పెరుగు-

# వజ్ర సంకల్పం నేపథ్యంలో..

## ప్రపంచంలో కెల్లా అతిచక్కని వజ్రం 'జూబ్లీ డైమండ్'!

245.35 కేరెట్ల జూబ్లీ డైమండ్ ప్రస్తుతం ప్రపంచంలో కళ్ళకు కనిపిస్తున్న అతిపెద్ద వజ్రాల్లో నాలుగోది మొదటి మూడు స్థానాలూ కల్లినాన్-1(530 2 కేరెట్లు), కల్లినాన్-2 (317 4 కేరెట్లు), నిజాం (277 కేరెట్లు) వర్సగా ఆక్రమించుకున్నాయి.

జూబ్లీ కంటే పెద్దవిగా రికార్డుల్లో కెక్కిన మరో రెండు వజ్రాలు ప్రస్తుతం లేవు. 280 కేరెట్ల గ్రేట్ మొగల్ డైమండ్ (షాజహాన్ వజ్రం) మొగలాయీల కాలం నుంచే అదృశ్యమై కనిపించకుండా పోయింది. 250 కేరెట్ల గ్రేట్ టేబుల్ డైమండ్ రెండు ముక్కలై దర్యాయినూర్, నూరులైన్ అనే పేర్లతో ప్రస్తుతం ఇరాన్‌లో వుంది.

జూబ్లీ 1895 లో దక్షిణాఫ్రికాలోని కింబర్లీలో దొరికింది. ముడివజ్రంగా వున్నప్పుడు ఇది 650 8 కేరెట్లుండేది. దీని మొదటి పేరు రీట్జ్ 1897 లో దాన్ని కోసి సానబెట్టాక విక్టోరియా మహారాణి డైమండ్ జూబ్లీ సంవత్సరానికి గుర్తుగా జూబ్లీ డైమండ్ అనే పేరు పెట్టడం



జరిగింది దీని ముడివజ్రం నుంచే 13 34 కేరెట్ల మరో వజ్రం కూడా కోశారు గానీ అదేమైపోయిందో తెలియదు

కోడిగుడ్డు ఆకారంలో కోయబడిన జూబ్లీ డైమండ్ ప్రపంచంలోని మహావజ్రాల్లో ఒకటిగా గుర్తింపు పొందడానికి చాలా కారణాలున్నాయి ప్రపంచంలోని అతిపెద్ద వజ్రాల్లో అది కూడా ఒకటి కావడం, ఆహ్లాదకరమైన దాని రంగూ- ఇవి మాత్రమే కాకుండా అది ప్రపంచంలోని వజ్రాలన్నింటి కంటే పర్ఫెక్టుగా సానబెట్టిన వజ్రం కావడం కూడా ఒక కారణం. ఈ వజ్రం చాలా సన్నగా వుండే దాని ముక్కు మీద బ్యాలెన్సు నిలబడుతుందంటే దాన్ని ఎంత ఖచ్చితంగా కట్ చేసి వుండాలో అర్థమైపోతుంది. ఇన్ని కారణాల వల్ల ప్రపంచంలోకే జూబ్లీ అతి చక్కని వజ్రమంటే అతిశయోక్తి అనిపించుకోదు

జూబ్లీ డైమండ్ కేవలం రెండు సార్లు మాత్రమే చేతులు మారింది దాని మొట్ట మొదటి యజమాని ప్రఖ్యాత భారతీయ పారిశ్రామికవేత్త సర్ దొరాబ్జీ జంషెడ్జీ టాటా! 1900 సంవత్సరంలో ఆయన దాన్ని కొనుక్కున్నాడు ఆ తర్వాత అది మరో పారిశ్రామికవేత్త చేతుల్లోకి మారింది. ఫ్రాన్స్‌కు చెందిన పాల్ లూయిస్ వెయిలర్ దాని రెండో యజమాని ఆ తర్వాత మళ్ళీ అది చేతులు మారలేదు.

జూబ్లీ డైమండ్‌ని కేవలం రెండు సార్లు మాత్రమే ప్రదర్శనలో వుంచారు- 1961 లో స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూషన్‌లో ఒకసారి, 1966 లో జోహాన్స్‌బర్గ్‌లో డీ బీర్స్ డైమండ్ పెవిలియన్లో ఒకసారి! ●

తుంది. ఇక స్వచ్ఛత, విషయానికొస్తే పది రెట్ల మేగ్నిఫికేషన్ వున్న భూతద్దంలో అన్య పదార్థాలు కనిపించనంత వరకూ ఆ వజ్రాన్ని పరమ స్వచ్ఛమైన వజ్రంగా గుర్తించడం జరుగుతుంది

వజ్రపాణి తన భూతద్దంలో అలాంటి ఇన్‌క్లూషన్స్ కోసమే ఆ ముడి వజ్రాన్ని ప్రాథమికంగా పరీక్షిస్తున్నాడు

హఠాత్తుగా అతని ఏకాగ్రతకు భంగం కలిగింది. కింది నుంచి యేదో అలజడి వినిపించింది

వజ్రపాణి విసుగ్గా భూతద్దం పక్కన పడేసి కిటికీలోంచి బయటకి చూశాడు

వెంటనే అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి

బయట -

ఎత్తైన కోట బురుజులాంటి ప్రహరీ కవతలున్న కచ్చా రోడ్డు ఆ కిటికీ లోంచి స్పష్టంగా కనిపిస్తొంది ఆ కచ్చా రోడ్డు మీద ముఖ ద్వారానికెదురుగా ఓ గుర్రపు బగ్గీ నిలబడి వుంది ఆ గుర్రపు బగ్గీలోంచి దిగిన వ్యక్తి ముఖద్వారంలోంచి లోపలికి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. భుజాలకు రైఫిల్స్ ధరించిన ఇద్దరు గార్డ్స్ ఆ వ్యక్తిని లోనికి రాకుండా అటకాయిస్తున్నారు.

లోపలికి రావడానికి ప్రయత్నిస్తున్న ఆ వ్యక్తి ఎవరో గుర్తుపట్టగానే వజ్రపాణి దిగ్గున లేచి నిలబడ్డాడు రెండేసి మెట్లు ఒకేసారి దిగుతూ కింది కొచ్చి ముఖద్వారం దగ్గరికి పెద్ద పెద్ద అంగల్తో చేరుకున్నాడు

వజ్రపాణిని చూస్తూనే గార్డ్స్ కీ అయిపోయిన బొమ్మల్లా ఆగిపోయి ఎటెన్షన్లో నిలబడి సెల్యూట్ చేశారు వజ్రపాణి వాళ్ల సెల్యూట్ ఎంత మాత్రం పట్టించుకోకుండా పొగరుగా నడుచుకుంటూ వెళ్లి ముఖద్వారంలో నిలబడి అంతవరకూ లోపలికి రావడానికి ప్రయత్నించిన వ్యక్తి వైపు చూస్తూ వెక్కిరింపుగా నవ్వేడు.

"నువ్వా విశ్వధరవర్మా! నువ్వింకా బతికే వున్నావా?"

విశ్వధరవర్మ అతని వైపు అసహ్యం నిండిన కళ్లతో చూశాడు

"బతికే వున్నాను వజ్రపాణీ! నువ్వూహించినట్టు ఏకాకినైపోయి పిచ్చెక్కి నేనింకా చావలేదు- బతికే వున్నాను! నీ అంతం చూసేవరకూ నేను బతికే వుంటాను"

"నువ్వు నా అంతం చూస్తావా విశ్వధరవర్మా!" ఛీగరగా నవ్వుతూ అన్నాడు వజ్రపాణి. "కాటికి కాళ్లు చాచుకున్న ముసలి తొక్కువి- నా అంతం చూసేవరకూ నువ్వు బతికుంటావా! అంతవరకూ బతికే వుంటావా విశ్వధరవర్మా?!"

"ముమ్మాటికీ వజ్రపాణీ! నీ అంతం చూసేంతవరకూ నేను నిద్రపోను. అది చెప్పడానికే వచ్చాను"

"ఓహో! ఇంత చిన్న మాట చెప్పడానికింత దూరం కష్టపడి వచ్చావన్న మాట వెరీ గుడ్. నా ఎదురుగా మోకాళ్ల మీద నిలబడి చావుని భిక్షగా కోరుకున్న రోజు మర్చిపోయావా విశ్వధరవర్మా?"

"మర్చిపోలేదు వజ్రపాణీ! మర్చిపోను కూడా! అన్ని రోజులూ నీవి కావు నా కోసం కూడా ఒక రోజు వస్తుంది వచ్చి తీరుతుంది ఆ రోజున నువ్వా నా ఎదురుగా మోకాళ్లమీద నిలబడి చావు భిక్షగా కోరు కుంటావు"

"నీ రోజులై పోయాయి విశ్వధరవర్మా! ఆ రోజు ఎన్నటికీ రాదు"

"వస్తుంది వజ్రపాణీ ! తప్పకుండా వస్తుంది"

"ఎలా? ఏం చెయ్యగలవు నువ్వు? నిన్న మొన్నటి దాకా పొగరుమోతు గుర్రాన్ని కూడా కళ్లెం పట్టి అదుపులోకి తెచ్చుకోగలిగిన నీ భుజాలిప్పుడు విరిగిపోయాయి నువ్వు నన్నేమీ చెయ్యలేవు!"

"అవును వజ్రపాణీ! నా భుజాలు విరిగిపోయాయి. విరిగిపోవడం కాదు- నువ్వే విరిచేశావు. నా రెండు భుజాల వంటి కొడుకుల్ని నువ్వే పొట్టను బెట్టుకున్నావు. అందుకు ప్రతిఫలం అనుభవించక తప్పదు నీకు. ఎలా చేస్తానా? ఎలా చేస్తానో ఇప్పుడే చెప్పను చేసి చూపిస్తాను కానీ, ఒక్క మాట మాత్రం చెప్పి వెళ్తాను. నా సంతానాన్ని సర్వనాశనం చేశావు నువ్వు. నా సంతానంతోనే నీ సర్వనాశనం నేను చేయిస్తాను."

ఆ మాట వింటూనే పగలబడి నవ్వాడు వజ్రపాణి

"నీ సంతానమా విశ్వధరవర్మా! వాటె జోక్! వాటె జోక్! ఈ వయస్సులో నువ్వు మళ్లీ పెళ్లి చేసుకొని- మళ్లీ పిల్లల్ని కని- ఆ పిల్లల్ని పెద్దచేసి - వాళ్లచేత నా నాశనం చూస్తానంటావ్! వెరీ గుడ్! క్యారీ ఆన్ విశ్వధరవర్మా! క్యారీ ఆన్! విష్ యూ బెస్టాఫ్ లక్!"

"ఇప్పుడు విలాసంగా నవ్వినట్టు కాదు వజ్రపాణీ! ముందుంది ముసళ్ల పండగ! "

వజ్రపాణి కళ్లు హఠాత్తుగా కఠినంగా మారిపోయాయి

ఉన్నట్టుండి అతనిలో ఓపిక నశించింది

చిటికెలు వేసి గార్డ్స్‌ని దగ్గరికి పిలిచాడు

"గార్డ్స్ ఈ ముసలాడ్ని ఈడ్చి అవతల పారెయ్యండి!"

వజ్రపాణి ఆజ్ఞాపించగానే గార్డ్స్ వేటకుక్కల్లా విశ్వధరవర్మ మీదికి దూకి ఆయన రెండు రెక్కలూ పట్టి ఈడ్చుకుంటూ వెళ్లి రోడ్డు మీద పడేశారు

విశ్వధరవర్మ ఎలాంటి ప్రతిఘటనా చెయ్యలేదు

కింద పడిన వాడల్లా నెమ్మదిగా లేచి నిలబడ్డాడు.

ఆయన కళ్లు అగ్ని జ్వాలలు విరజిమ్మడం ప్రారంభించాయి

"ఇది కూడా గుర్తుపెట్టుకుంటాను వజ్రపాణీ! తప్పకుండా గుర్తు పెట్టు కుంటాను."

ఆ మాట అంటూనే సమాధానం ఆశించని వాడిలా గిరుక్కున వెనక్కి తిరిగి తన గుర్రపు బగ్గీ వైపు నడిచాడు

వజ్రపాణి తను నిలుచున్న చోటు నుంచి కదల్లేదు రెండు చేతులూ కట్టుకుని నిర్లక్ష్యంగా విశ్వధరవర్మ వైపే చూస్తూ వుండిపోయాడు.

విశ్వధరవర్మ గుర్రపు బగ్గీ ఎక్కి కళ్లాలందుకుని గట్టిగా అదిలించాడు

గుర్రం ఆ అదిలింపుకు చిన్నగా సకిలించి వెనకాళ్ల మీద లేచి ఒక్కసారిగా ముందుకు దూకింది.

విశ్వధరవర్మ ఆ కుదుపుకు చలించలేదు

తల వెనక్కి తిప్పి వజ్రపాణి వైపు చూశాడు

అగ్నిగుండాల్లా మండుతున్న ఆయన కళ్లల్లో ఎందుచేతనో వజ్రపాణికి సవాలక్ష హెచ్చరికలు కనిపించాయి

కళ్లప్పగించి క్రమంగా దూరమైపోతున్న ఆ గుర్రపు బగ్గీ వైపే చూస్తుండి పోయాడు

(ఇంకా ఉంది)



## ఏడేళ్లకే పాండిత్యం!

ఎన్నేళ్లొచ్చినా పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాని ప్రబుద్ధులున్న ఈ కాలంలో ఏడేళ్లకే భౌతిక, రసాయన శాస్త్రాలను, భారత రాజ్యాంగాన్ని, తాజా రాజకీయ పరిణామాలను ఔపోసన పట్టేసిందట పై ఫోటో లో పోజు పెట్టి కూర్చున్న చిన్నారి

ఈ అమ్మాయి పేరు పురులియామౌసమి చక్రవర్తి ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషలు ఈ అమ్మాయికి కొట్టినపిండట అంతేకాదు టైపింగ్‌లో కూడా ప్రావీణ్యం వుందట

ఈ ఏడేళ్ళ చిన్నారికి 9 వ క్లాసులో చేరి చదువుకోవాలని కుతూహలంగా వుందట కాని ఈ పాపను చేర్చుకోవటానికి ఎవ్వరూ అనుమతించటంలేదు కారణం ఏమిటని అడిగితే 9వ తరగతి చదివేందుకు తగిన వయసు ఆ పిల్లకు లేదంటున్నారట మరి ఏడేళ్ళకే యింత పాండిత్యం ఎలా అబ్బిందో? బహుశా ఈమె ప్రకృతి వరప్రసాదినేమో!

# యువకవిత

నీలి నెమ్మార్చు విదిన్న
చట్రంలో బిగించి చూస్తే
కిటికీ కాచల రెండు వక్షులు

## ఎందువలనా? అంటే...

"మూయబడిన కళ్లక్రింద
నయనజలం రోదిస్తోంది నిశ్శబ్దంగా?
ఎగసిపడతున్న ఛాతీమీద
ఘర్మోదకం రొప్పుతోంది నిస్సద్దుగా?
ఎర్రబడిన ముక్కు కొనమీద
ఆవేశకాష్టం వగురుస్తోంది నిస్సత్తువగా?
పగ చల్లారిందనా? అబ్బే కాదు!
లక్ష్యం నెరవేరిందనా? అబ్బెబ్బే అసలు కాదు!!
మరి ? ? ?
నిష్కారణంగా చెంప పేల్చిన వ్యక్తి
చపలచిత్తుడని తెలిసికూడ
'తాత' గారికి మనవడనిపించుకొందామని
మరో చెంప వాయగొట్టించుకున్నా!!!"

- పద్మాకర్

## ఎలా ? ఎలా ?

ఈ దేశం ఎటు పోతోంది ? అనే
నా ఆవేదన, ఆవేశం కలబోసి ప్రశ్నిస్తే
నన్ను 'నక్సలైట్' అన్నారు
నిజాన్ని నిర్భయంగా చెబితే
బందిపోటు అన్నారు
అందరూ సుఖంగా ఉండాలని కోరుకుంటే
నన్ను కమ్యూనిస్టన్నారు
వెట్టిచాకిరీ నుంచి విముక్తి
కల్పిద్దామని ప్రయత్నిస్తే
నన్ను తీవ్రవాదన్నారు
ఎలా ? ఎలా ?
నా ఈ దేశాన్ని బాగుచేయటం ?

- నిలకాశాస్త్రి

## ఫెల్యూర్

ఆషామాషీగా చేయకు
చదువనే సేద్యం-
రిజల్ట్సు ముందు పెట్టకు
దేవునికి నైవేద్యం-
తండ్రి దగ్గర ఎలాగూ
తప్పదుగా
తిట్ల వాద్యం-
కష్టపడి చదివుంటే
నీకేది లేకపోయె
అసాధ్యం!

-కోలపల్లి ఈశ్వర్

## ఆశా! ఆశా!!

ఒకప్పుడు -
శ్రీమతిలా చిర్రుబుర్రులాడతావు
మరొకప్పుడు -
ప్రేయసిలా ఒడి చేర్చుకులాలిస్తావు
ఒకప్పుడు -
మిత్రునిలా చేరదీస్తావు
మరొకప్పుడు -
శత్రువులా వేధిస్తావు
ఒకప్పుడు -
స్వప్నాలలో తేలియాడిస్తావు
మరొకప్పుడు -
కర్తవ్యాన్ని గుర్తుచేస్తావు
ఆశా!
నీవు నాలో జనించినప్పటినుండి
నిమిషంకూడా నిద్దురలేదు
అందుకే అంటున్నాను
నా బ్రతుకుకితోడు
నువ్వే అండవని!

- కలిమిశ్రీ

## ప్రగతి

శ్రమైక జీవనం
ప్రగతికి సోపానం
శ్రామికులు చిందించేరక్తం
పెత్తందార్లకి భుక్తం!

-కాకరపర్తి సుబ్రమణ్యం

## రాజకీయస్వామ్యం!

మనది పవిత్ర భారతదేశం
అన్నపూర్ణకు నిలయం
గుప్పెడు మెతుకులు
గంపెడు సంసారం
చాలీ చాలని అతుకులు
ఇరుకు కరుకు బ్రతుకులు
బాధ్యతకు బయపడొకరు
బాధలకు జడిసి యింకొకరు
మొన్న ప్రత్తి రైతు
నిన్న చేనేత కార్మికుడు
నేడు సగటు భారతీయుడు
ఆకలి చావుల నేపథ్యములో
ఆత్మహత్యల ఆశ్రయం
నానాటికీ పెరిగే ఈ సమస్యలు నేతలవి కావు
హైదరాబాదుకి పోవు
ఢిల్లీకి చేరవు
నాయకులు నమ్మరు
ఎందుకంటే
అవినీతి అరాచకాలతో కూడిన స్వార్థం
అంతులేని బిజీ రాజకీయ వుపయోగార్థం
పర్యవసానం
బంధువులకు సీట్లు
బావమరుదులకు నోట్లు
పదవులకై పాట్లు
ఇది ప్రజాస్వామ్యమా?
కాదు! రాజకీయ స్వామ్యం

- అడుసుమల్లి ప్రభాకరరావు

## పొగమంచుబంధాలు!

చావెంత అనివార్యమో
చచ్చాక ఏడవడమూ అంతే
అయితే-
అందరివీ బుడిబుడిఏడ్పులనలేముకానీ
చాలావరకుజడివానలా వెలసిపోయేవే!
ఉన్నంతకాలం-
హృదయపూర్వకంగాఏడ్చేదిమాత్రం
అత్యంత సన్నిహితులే!!
అంటే-
పిల్లలుపోతే తల్లిదండ్రులు
తల్లిదండ్రులు పోతే పిల్లలు
మిగతావన్నీ పొగమంచు బంధాలే!

-మహబూబ్ కమల్

# మంచం

— కాకాని కమల




**చలమయ్య నెమ్మదిగా కుక్కిమంచంలోంచి లేచి కూర్చున్నాడు వస్తున్న దగ్గు తెరని అదుపు చేసుకుంటూ రెండు చేతులో మంచం పట్టెల్ని గట్టిగా పట్టుకుని, కాళ్ళు రెండు కిందికి తాటించి నెమ్మదిగా మంచం దిగి జారుతున్నట్టు నేలమీద చతికిలపడ్డాడు.**

మంచం మీద పరిచిన బొంత, తలగడ తీసి ప్రక్కనే వున్న బల్లమీద పెట్టి మంచాన్ని గోడవారగా జరిపాడు

కాళ్ళతో మంచం కోళ్ళని తొక్కిపట్టి రెండు చేతులో బలంగా నవ్వారు గుంజి మంచం బిగించటం మొదలుపెట్టాడు

ఆ నవ్వారు మంచం బాగా పాతది కోళ్ళు, స్క్రూలు లూజయిపోయి బాగా కదిలిపోతున్నాయి అక్కడక్కడ చెక్క పెళ్ళలు పెళ్ళలుగా విరిగిపోయింది

నవ్వారు కూడా బాగా చీకిపోయి చాలా చోట్ల తెగి ముళ్ళు పడిపోయింది

నాలుగు రోజులకి ఒకసారి బిగించినా మర్నాటికల్లా కుక్కలా తయారు అవుతూంది

నవారు కూడా బాగా వుతుకులుమీద వుతుకులు పడి జీర్ణించుకుపోవటంచేత ఎన్ని ముళ్ళు వేసి కుట్లు కుట్టినా కాస్త బరువు మోపితే ఎక్కడ కక్కడ పుటుక్కున తెగిపోతూంది

మంచంలో పడుకుంటే వుయ్యాల తొట్లో పడుకున్నట్టు వూగిపోతూంది

అటు యిటు కదిలినప్పుడల్లా కిర్రు కిర్రు మంటు కోళ్ళు శబ్దం చేస్తున్నాయి తొట్టెలా మంచం మధ్య గొయ్యి పడిపోయింది

కాళ్ళతో నిగడతన్ని నవ్వారు బిగిస్తున్న చలమయ్యకి చేతిపట్టు సడలిపోతూంది వార్ధక్యంచేత చెయ్యి వణుకుతూంది కీళ్ళు సడలిపోవటంచేత ఎంత బిగించిపట్టుకోబోయినా వేళ్ళ మధ్యనుంచి నవ్వారు జారిపోతూంది

అరచేతులు చెమటపట్టి జారిపోతు న్నాయి అయినా పట్టు వదలని విక్ర మార్కుడిలా, జీవితాశయాన్ని సాధించే కృషీవలుడిలా దీక్షగా మంచం బిగించ టంలో నిమగ్నం అయ్యాడు చలమయ్య

పదేళ్ళ పిల్లాడు "ఫట్"మని తంతే "పది" ముక్కలయ్యేలా వుంది మంచం సుబ్బరంగా విరిచి పొయ్యిలో పెట్టుకో వచ్చు

కాని ఆ మాటంటే ఒప్పుకోడు చలమయ్య ఆ మంచం అంటే పంచ ప్రాణాలు

అరవై ఏళ్ళ చలమయ్య శరీరం తెగుళ్ళతో కృశించిపోయింది వుబ్బసం రోగం ఆయన్ని రోజు రోజుకి కృంగ దీస్తూంది పట్టుమని తూస్తే శరీరంలో రెండు కిలోల మాంసం కూడా లేదు ఎముకలకి చర్మం సాగదీసి కుట్టినట్టు చలమయ్య బాగా ఎండిపొయ్యాడు తూకం వేస్తే ఐదేళ్ళ పసివాడి బరువుకి సమానంగా వుంటాడు అందుకే ఆ కోళ్ళు విరిగిన మంచం చలమయ్యని భరి స్తోంది మరీ మూడు ముక్కలై దానంతట అది విరిగి మూలపడితే ఏమో గాని లేకపోతే ఆ మంచాన్ని వదలటం చలమయ్యకి ససేమిరా ఇష్టంలేదు అది కిర్రు కిర్రుమని శబ్దం చేస్తున్నా, వుయ్యాల్లా వూగుతున్నా, కుక్కిపడినా ఎంతో కాలంగా అలవాటు అవటంచేత ఆ మంచంలో పడుకొంటేనే నిద్రపడుతుంది చలమయ్యకి

ఎందుకో ఆ మంచంలో నడుం వాలిస్తే ఒక విధమైన ప్రశాంతత

"ఆ వెధవ మంచం కోళ్ళు విరిగి నవారంతా ముళ్ళుపడిపోయింది అందులో పడుకుంటే యింకా లేనిపోని రోగాలు, నొప్పులు వస్తాయి ఆ పాత మంచం మూలపారేసి హాయిగా ఈ కొత్త ప్లాస్టిక్‌నవారు మంచంలో పడుకో నాన్నా" అంటూ కొడుకు రామం అస్తమానం పోరుపెడతాడు

కాని చలమయ్య ఒప్పుకోడు "ఒరేయ్ అబ్బాయ్! నాకు ఆ మంచంలోనే నిద్ర పడుతుందిరా కోళ్ళు విరిగితే కాస్త బాగుచేయిస్తే పోతుంది లేరా" అంటూ వడ్రంగిని పిలిచి విరిగిన కోళ్ళు మరమ్మత్తు చేయించాడు

"ఆ మంచం రిపేరింగులకి పెట్టిన డబ్బు పెడితే ఈపాటికి నిక్షేపం లాంటి కొత్త మంచం వచ్చేది ఏమిటో ఈ ముసలాయన చాదస్తం" అంటూ కోడలు వరలక్ష్మి సణుగుడు కూడా చలమయ్య చెవిని పడకపోలేదు

కాని

చలమయ్య ఎప్పుడూ అలా అనుకో లేదు

అవునుమరి ఆ మంచంతో వున్న అను బంధం ఈనాటిదా?

దాన్ని మూడు ముక్కలుగా విరిచి పారేస్తే తీరిపొయ్యేదా?

నలభై సంవత్సరాలుగ తన జీవితంలో ఒక భాగం అయిపోయింది కదూ ఈ మంచం?" అనుకొంటాడు వేదాంతిలా

ఈ కాలం ఫాషన్నిబట్టి చాలామందికి ఆ మంచాన్ని చూస్తే నవ్వు రావచ్చు

కోళ్ళు విరిగి నవ్వారు తెగి పొయ్యిలో పెట్టటానికి కూడా పనికిరాని డొక్కు మంచమే కావచ్చు అది

కాని ఆ మంచం అంటే చలమయ్యకి మమకారం ఆ మంచాన్ని చూస్తుంటే ఆత్మీయుల్ని చూస్తున్న అనుబంధం అనురాగంతో అక్కున చేర్చుకునే ప్రేయసి లాంటి అనుభూతి

ఆలోచనల మధ్య మంచం నేస్తున్న చలమయ్య పెదవుల మాటున చిన్న

## నికితా! నికితా!!

రాజ్ కపూర్ కొడుకుల్లో చిన్నవాడైన చింపు (రాజీవ్ కపూర్)కి కొత్తవాళ్లతోనే నటించాలన్న కుతూహలం ఎక్కువట మామూలుగానే రాజ్ కపూర్ కొత్త అమ్మాయిల్ని తొలిసారిగా పరిచయం చేయటం ఆనవాయితీ! దానికి తగ్గట్లు రాజీవ్ కి కొత్తవాళ్లతోనే నటించటం సరదా!

లండన్ నాయకులను తన చేతుల్లో పెట్టుకున్న పామెల్లా బోర్డెన్ జీవితం ఆధారంగా తీస్తున్న చిత్రంలో నికితా తేజ్ పాల్ అనే అమ్మాయిని పరిచయం చేస్తున్నారు

పామెల్లా లాగా స్టిల్స్ యిచ్చిందేమో ఏకాఏకిన లండన్ నుంచే ఈ అమ్మాయిని తీసుకు వచ్చారు చిత్రంలో నటింప చేయటానికి. ఇంకేం కొత్త అమ్మాయేగా రాజీవ్ కపూర్ కు జోడీగా ఈ చిత్రంలో నికితా నటిస్తోంది



ప్రస్తుతం ఈ నటి శత్రుఘున్ సిన్హా పొరుగున వుంటున్నదట వుంటే ఏమో?

చిర్నవ్వు కదిలింది

అవును

సరిగ్గా నలభై సంవత్సరాల క్రితం ఒక రోజున పనిగట్టుకుని బజారుకి వెళ్ళి పాతిక రూపాయ లు పెట్టి ఈ మంచాన్ని కొన్నాడు పన్నెండు రూపాయిలు పెట్టి నవ్వారు నేయించాడు అప్పుడు తను కొత్తగా పుగాకు కంపెనీలో ఉద్యోగానికి జేరిన రోజులు రెండు వందలు జీతం

ఆ రోజుల్లో అదే గొప్ప

మరి దరలు మాత్రం యిలా మండుకు పొయ్యేవా?

పది రూపాయలు పెడితే సన్నబియ్యం పాతిక్కిలోలు వచ్చేవి

తల్లి తండ్రి లేని తనని తాతే చేరదీసి పెంచాడు

పదవతరగతి దాకా చదువు చెప్పించి ఆయన పనిచేసిన కంపెనీలోనే ఉద్యోగం వేయించాడు

"ఉద్యోగం మంచిది కష్టపడి పనిచేస్తే పైకి పోయే అవకాశాలు వున్నాయి జాగ్రత్తరా అబ్బి" అంటూ తనకి హితవు చెప్పాడు

అప్పటికే తాత ఆరోగ్యం బాగా దెబ్బతింది

అందుకు తను ఉద్యోగంలో జేరిన పది రోజుల తర్వాత తాతని పని మాన్పించి యింటి పట్టున వుంచాడు

తాత వంట వార్పు చూసుకుంటే తను ఉద్యోగానికి వెళ్ళేవాడు

ఆ ఏడాది తనకి అన్నపూర్ణతో పెళ్ళయ్యింది

అన్నపూర్ణది తన కులమే

పేద కులం

"పిల్ల బంగారు బొమ్మ కళ్ళు తిప్పుకోలేనంత అందంగా వుంది గుణవంతురాలు కాని దమ్మిడి కట్నం యిచ్చుకోలేరు మరి నీ అభిప్రాయం ఏమిటి? లేక కాస్త కలిగిన ఇంటి పిల్లని చూడమంటావా?" అన్నాడు తాత

అన్నపూర్ణని పెళ్ళి చూపుల్లో చూడగానే మదురోహల్లో తేలిపొయ్యాడు చలం బావుకుడైన చలం అన్నపూర్ణని చూడగానే కలల్లో కరిగిపొయ్యాడు

"పిల్ల ముఖ్యం గాని డబ్బు దేముంది? కష్టపడితే కావల్సినంత సంపాదించవచ్చు" అన్నాడు

తాత ముసిముసిగ నవ్వాడు

అన్నపూర్ణతో పెళ్ళి అయిపోయింది

తెల్లారితే అన్నపూర్ణ కాపురానికి వస్తుందనగా ఆ ముందు రోజు చలం కంపెనీకి సెలవు పెట్టేశాడు

ప్రతి నెలా పొదుపు చేసి బ్యాంకులో జమ చేసిన డబ్బులోంచి ఓ రెండు వందలు తీసి బజారుకి వెళ్ళాడు

పుట్టింటి నుంచి ఆడంబరంగా ఆరణాలు తెచ్చే స్థోమత అన్నపూర్ణకి లేదు

అందుకే సంసారానికి కావల్సిన చెంబు, గిన్నె, నిండుగా సరుకులు కొన్నాడు ఆ సరుకులోపాటే పాతిక రూపాయలు పెట్టి ఈ పట్టెమంచం, పన్నెండు పెట్టి నవారు కొని అక్కడే నేయించాడు

బూరగ దూది వేసి కట్టిన పరుపు, నాలుగు దుప్పట్లు, ఓ తెల్లటి దోమతెర గుడ్డ కూడా కొని ఆ సరుకంతా రిక్షాలో వేసుకుని ఇంటికి వచ్చాడు

దగ్గరుండి దోమతెర కుట్టించి తెల్లారేసరికల్లా అందమైన రసస్పృష్టిలా పడక గదిని తయారు చేశాడు

చిలక కొరకని దోర పండులాంటి అన్నపూర్ణని చూస్తుంటే చలం ఒళ్ళు ఝల్లు ఝల్లుమంటోంది

ఆమెతో గడపబోయే ప్రతి క్షణం ఒక సుందర స్వప్నంలాగా మదురగానం లాగా అతడ్ని ఆనంద డోలలు వూగిస్తుంది

ఆ మర్నాడు ఉదయానే తన మావ రంగయ్య అన్నపూర్ణని దించి అర్జంటు పొలం పన్లు వున్నాయంటు తిరిగి వూరికి వెళ్ళిపొయ్యాడు తీర్థయాత్ర వంకతో వెడుతూ వెడుతూ తాతని కూడా వెంట పెట్టుకుని మరీ వెళ్ళాడు

అంతే!

ఆ రాత్రి చలం –

మొదటిసారిగా అన్నపూర్ణతో ఆ మంచంలో శరీరాన్ని, ఆత్మని ఒక్క కలయికగా స్పందింపచేసి వెన్నెల జలతారు పరదాల మద్య మల్లెల సుగంధంతో మత్తెల చేసిన తన ప్రేయసి ఆ రాత్రి ఎంత ఆనందం? ఆ అనుభూతి అనిర్వచనీయం ఆ ఆనందం చవిచూసినవాడే అయినా నోరుతెరిచి మాటల్లో కూర్చి చెప్పలేడు చలం

వెన్నెల ఎలా వుంటుంది? అంటే ఎవరైనా చెప్పగలరా?

మల్లెపూల పరిమళం గురించి

వర్ణించమంటే వర్ణించగలరా ఎవరైనా?
ఆ మధుర స్మృతి వలపుల సుగంధం
క్రమంగా సంసారం పెరిగింది
బాధ్యతలు బరువులు పెరగసాగాయి
అప్పులూ ఆర్థిక వతి_డులు
అయినా
ఆ మంచంలో అన్నపూర్ణ పక్కన పడుకుంటే ఎన్ని కష్టాలైనా మర్చి పొయ్యేవాడు జటిల సమస్యలు కూడా నిబ్బరంగా ఆలోచించ గలిగేవాడు అన్నపూర్ణ సాహ చర్యంలో ఒక చిత్రమైన ఆనందం, మనసుకి ప్రశాంతత, శరీరానికి హాయి లభించేవి
నలుగురు పిల్లలు పుట్టారు
ఇద్దరు పురిట్లోనే సంధికొట్టుకుపోగా, ఇద్దరు ఒక కొడుకు ఒక కూతురు మిగిలారు
పెద్ద దిక్కుగా వుండే తాత కన్ను మూశాడు
అన్ని బాధ్యతలు భుజాలమీదకి వచ్చాయి
ఎన్ని ఇక్కట్లు వచ్చినా, ఎంతటి సమస్యలు ఎదురైనా ఆ మంచంలో పూర్ణతో కల్సి పడుకుంటే ఎంతో మనో నిబ్బరం, ప్రశాంతత చేకూరేవి
అన్నపూర్ణ చక్కటి సలహాలు అమృతం లాంటి ఆమె అనురాగం చలంని సేదదీర్చేవి జటిల సమస్యల క్కూడా అన్నపూర్ణ చిరునవ్వుతో యిట్టే పరిష్కారం సూచించేది
పిల్లలు పెద్దవాళ్ళు అయ్యారు
పద్దెనిమిదేళ్ళు రాగానే కూతురికి పెళ్ళి చేసి అత్తింటికి పంపేశాడు
కొడుకు రామం డిగ్రీ పూర్తి కాగానే కంపెనీ దొరలని బ్రతిమలాడుకుని ఎలాగో వాడ్ని కూడా పుగాకు కంపెనీలో పెట్టాడు
కాని తనకంటె కొడుకుది మంచి ఉద్యోగం మంచి జీతం
తను రిటైర్ అయ్యేనాటికి కొడుకు సంపాదనకి అందిరావటం చాలా హాయిగా అనిపించింది
తర్వాత మంచి పిల్లని ఏరి కోరి తెచ్చి పెళ్ళి చేశాడు
కోడలు పేరు వరలక్ష్మి
చాకిరీ చెయ్యలేక అప్పుడప్పుడు విసుక్కున్నా మామగారంటే భక్తి, గౌరవం
రామానికి ఇప్పుడు ఇద్దరు పిల్లలు
మనవలతో చలమయ్యకి బాగానే కాల క్షేపం జరిగిపోతూంది అమృతం గ్రోలు తుంటే ఉప్పురాళ్ళు వచ్చినట్టు బ్రతుకు బాటలో ఎన్నో చేదు సంఘటనలు జరగకపోలేదు అవన్నీ డబ్బు సమస్యలు కావటంతో ఎలాగో ఓర్చుకున్నాడు చలం
కాని ఐదేళ్ళ క్రితం
అతని ప్రియ నేస్తం, ఇష్టసఖి, మనసులో మనసు, మమతలో మమత అన్నపూర్ణ మరణం అశనిపాతం అయ్యింది

# మంచం

అతని శరీరంలోంచి సగ బాగాన్ని ఎవరో కోసేసి వేరు చేసినట్లు మనసు విలవిల్లాడిపోయింది

ఆమె మరణంతో చిలక లేని పంజరంలా బ్రతుకు శూన్యం అయిపోయింది

ఆమె లేని జీవితాన్ని కలలో కూడా వూహించుకోలేదు చలం

అన్నపూర్ణ పోయాక ఒంటరిగా మంచంలో పడుకుంటే మంచం ఎంతో విశాలంగా బార్య లేని లోటుని ఎత్తి చూపెస్తున్నట్లు వెలితిగా అనిపించి మనసంతా అశాంతిగా అయ్యేది

కంటి కొసల నుంచి చుక్క చుక్క కన్నీరు రాలుతుంటే రోజూ అన్నపూర్ణ వున్నప్పుడు ఎలా పడుకునేవాడో అలాగే పడుకుని, అన్నపూర్ణ మంచంలో పడుకునే బాగాన్ని ఖాళీగా ఒదిలి, ఆ ఖాళీ కేసి నిశ్శబ్దంగా చూస్తూ వుండిపోవటం అలవాటు చేసుకున్నాడు

ఆమె భౌతికంగా తన ప్రక్కన లేకపోవచ్చు

కాని తన మనసులో నిండుగా ఆమె రూపం, ఆలోచన్లు చెక్కు చెదరలేదు

"నీ అన్నపూర్ణ లేకపోయినా ఆమెతో నీ యింటికి వచ్చిన నేను నీ జీవితాంతం తోడు నీడగా వుంటాను నీ బార్య లేకపోయినా మీ ఇద్దర్ని జంట కలిపిన నేను ఇంకా వున్నానుగా?" మంచం ఆప్యాయంగా ఓదారుస్తున్నట్లు వూంట అనిపిస్తుంది చలమయ్యకి

ఆ మంచానికే గనక నోరుంటే తన గురించి, అన్నపూర్ణ గురించి ఒక మంజుల సుమధుర కావ్యాన్ని ఆవిష్కరించి వుండేదేమో అనుకుంటాడు చలమయ్య

కాని దానికి నోరు లేదు

అయినా రోజూ ఒంటరిగా ఈ మంచంలో పడుకుంటే, పక్కన అన్నపూర్ణ లేకపోయినా, ఆమె జ్ఞాపకాలను ఈ మంచమేగా తనతో నిశ్శబ్దంగా ముచ్చటిస్తుంది

అన్నపూర్ణ మరణం తరువాత తన గుండెలో, బ్రతుకులో ఏర్పడ్డ వెలితిని రాను రాను ఈ మంచంతో తన సంభాషణలతో తనలోని అశాంతిని దూరం చేసుకోవడం మొదలుపెట్టాడు చలం

ఈ మంచంలో పడుకుంటే కడుపులో ఎన్ని గుబుళ్ళువున్నా మనసులో ఎంత అశాంతి వున్నా ఎందుకో చిత్రంగా ఒక రకమైన ప్రశాంతత చిక్కుతుంది

ఆ మంచం కుక్కిఅయిపోయినా, ముళ్ళు పడినా, తెగి నవారు వ్రేలాడుతున్నా ఎందుకో వేరే ఎక్కడ పడుకున్నా నిద్ర పట్టదు చలమయ్యకి

ఉబ్బసం రోజు రోజుకి ముదిరిపోతూంది

ఆ మంచంలో పడుకుని ఎగవూపిరి దిగవూపిరిగ నానా అవస్థ పడుతుంటే చలమయ్యతో పాటు ఆ మంచం రోగంతో బాధ పడుతున్న దానిలా కిర్రికిర్రమంటూ వూగిసలాడుతుంది

"ఆ వెదవ మంచం అవతల పారెయ్యమని కొడుకు ఎన్నిసార్లు తిట్టినా చలమయ్య వినేవాడు కాదు

'తన కట్టె ఈ మంచం మీదే సాగిపోని మూన్నాళ్ల ముచ్చటకి ఇంకో మంచం ఎందుకు?" అనేవాడు

ఆ మంచం మారిస్తే బార్యని మార్చినట్లు, తన అన్నపూర్ణని మరిచిపోయినట్లు ఎందుకో ఆచార విరుద్ధం అనిపించేది

అందుకే ఆ మంచాన్ని వదలలేకపోతున్నాడు

"ఖళ్ ఖళ్"

ఆలోచిస్తూ మంచాన్ని నేస్తున్న చలమయ్యకి ఒక్కసారిగా దగ్గు తెర ముంచుకువచ్చింది

ఊపిరి అందక గుండెలు ఎగిసిపడుతుంటే గబాల్ని నవారు వదిలి రెండు చేతులు నేలని ఆన్చి పడిపోకుండా ఆపుకున్నాడు

"అయ్యయ్యో! ఏమైంది మావయ్యా" అంటూ వంటగది లోంచి కోడలు వరలక్ష్మి పరిగెత్తుకుంటూ వచ్చి మావగార్ని పట్టుకుంది

ప్రక్కన బల్లమీద వున్న సీసాలోంచి మాత్ర తీసి నీళ్ళ గ్లాసు అందించింది

కాస్త దగ్గుతెర వుపశమించాక నెమ్మదిగా కోడలు చేతి ఆసరాతో మంచంలో వాలి కళ్ళు మూసుకున్నాడు చలమయ్య

* * *

చూస్తూవుండగానే నాల్గు నెల్లు గడిచిపొయ్యాయి

వేసవికాలం యిలా వెళ్ళిందో లేదో కుండలోతు ఎత్తి గుమ్మరిస్తున్నట్లుగా విపరీతమైన వాన మొదలయ్యింది

ఆసలే అంతంతమాత్రంగా వున్న చల



## శ్రీలంక సంక్షోభంలో ప్రేమదాస

శ్రీలంక అధ్యక్షుడిగా పదవీ స్వీకారం చేసిన శ్రీ రణసింఘే ప్రేమదాస మీద పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలైనాయని ఆదేశ ప్రజలు వాపోతున్నారు

ఎల్. టి. టి. ఇ. గెరిల్లాలతో ఒక వైపు సంధి ప్రయత్నాలు చేస్తూ, మరో వైపు జె వి పి. చేతిలో బందీ అయిపోయిన ప్రేమదాస తన చుట్టూ తానే యినుప కటకటాలను ఏర్పాటు చేసుకుంటున్నాడు.

భారత్ - శ్రీలంకల మధ్య శ్రీ జయవర్ధనే అధ్యక్షుడిగా వున్న తరుణంలో కుదిరిన ఒప్పందం మేరకు శ్రీలంక పౌరులకు రక్షణగా వెళ్లిన భారత శాంతి పరిరక్షక దళాలను (ఐ పి కె. ఎఫ్) తమ దేశం



తిరిగి వెళ్లిపోవలసిందిగా ఆదేశించటం- "అక్కర తీరిన తర్వాత " అన్న సామెతగా వుందని అనేకమంది విమర్శించారు కూడా.

దేశంలో ప్రస్తుత పరిస్థితి దేశ విభజన దిశగా పయనిస్తోంది ఐ పి కె ఎఫ్ కనుక అక్కడి నుంచి ఉపసంహరింపబడినట్లయితే తిరిగి రక్తపాతం తప్పదన్న విషయాన్ని ప్రేమదాస గుర్తించటం లేదని పలువురు అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నారు

అధ్యక్షుడిగా ఎన్నికైన వెంటనే అందలం ఎక్కించిన శ్రీలంక పత్రికలే యిప్పుడు ఆయన వ్యవహరిస్తున్న తీరుపై విమర్శనాస్త్రాలు సంధిస్తున్నాయి మరి ఈ విమర్శలను తట్టుకొని తన చుట్టూ ఏర్పరచుకున్న యినుప కటకటాల నుంచి బయటపడటం తాను తీసుకొనే నిర్ణయం పైనే ఆధారపడి వుంటుందన్నది జగమెరిగిన సత్యమే! ●

---

మయ్య ఆరోగ్యం తిరగబెట్టింది

ఉబ్బసం ఎక్కువై రోజు రోజుకి పరిస్థితి దిగజారిపోసాగింది

రామం ఆఫీసుకి సెలవుపెట్టి శాయశక్తులా తండ్రికి వైద్యం చేయిస్తూనే వున్నాడు

కాని ప్రయోజనం కనిపించటంలేదు

గత మూడు రోజులుగ చలమయ్య పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది

ఊపిరి అందక ఒడ్డున పడ్డ చేపలా మనిషి గిలగిల్లాడిపోతున్నాడు

ఆహారం లేదు

సెలైన్ ఎక్కించబోయినా సూదికి నరం చిక్కడం లేదు మందు వెనక్కు వచ్చేస్తూంది వరలక్ష్మి కళ్ళనీళ్ళు కుక్కుకుంటూ మావగారి మంచం దగ్గరే చతికిల పడిపోయింది

డాక్టర్లు పెదవి విరిచేశారు

"బ్రతకటం కష్టం" అన్నారు

క్షణక్షణానికి చలమయ్య చూపు మందగించుకుపోతూంది

పల్సు పడిపోతున్నాయి

ఒళ్ళు చల్లగా మంచు ముక్కలా మొద్దు బారిపోతూంది

"చలమయ్య పరిస్థితి బాగుండలేదట చివరి క్షణాల్లో వున్నాడట" అంటూ ఇరుగుపొరుగు చలమయ్య మంచం చుట్టూ గుంపు కూడారు

చలమయ్య మూసిన కన్ను తెరవలేక పోతున్నాడు

కొడుకు రామం "నాన్నా! నాన్నా!" అని పిలుస్తున్నా "ఆఁ " అన్న శబ్దం రావటంలేదు

"మంచం మీద ప్రాణం పోవటం మంచిది కాదు దించండి" అన్నారెవరో

వరలక్ష్మి కన్నీరు ఆదుపుచేసుకొంటూ లేచి చాప తెచ్చి వసారాలో వేసింది

నల్గురు పెద్దమనుషులు చలమయ్యని సాయంపట్టి మంచం లోంచి దించి కింద చాపమీద పడుకోపెట్టారు

దారి కడ్డంగా వున్న మంచం ఎత్తి గోడ వారకి పెడదామని దిండు బొంత తీస్తుంటే తెల్లటి కాగితం మడత జారి పడింది

రామం కనుబొమ్మలు ముడుచుకున్నాయి

చప్పున ఒంగి ఆసక్తిగా చేతుల్లోకి తీసుకొని కాగితం మడత విప్పాడు

"నాయనా రామం!

నేను పోయాక నా మంచం మీకు ఎలాగూ పనికిరాదు దాన్ని మీరు వుపయోగించరు ఎందుకంటే అది నాలాగే బాగా జీర్ణించిపోయింది

కాని ఎందుకో మీ అమ్మతో పాటు ఆ మంచం అన్నా నాకు చాలా ఇష్టం మీ అమ్మ పోయినా ఈ మంచం ఇన్నాళ్ళూ నాకు తోడు నీడగా వుంది అనిపిస్తుంది

మీ అమ్మ వచ్చినరోజే ఈ మంచం నా యింటికి వచ్చింది ఆ రెండింటితో పాటు నా జీవితానికి ఒక అర్ధం - పరమార్ధం ఏర్పడింది మేం ముగ్గురం ఒకటే

అందుకే నా శవంకు పేర్చే కట్టెలతో పాటు ఈ మంచం కూడా తీపి గురుతుగా నా "

కళ్ళనిండా నీళ్ళు సుళ్ళు తిరిగి ఉత్తరంలోని అక్షరాలు మసకవేస్తుంటే "నాన్నా " అంటూ వెర్రికేక పెట్టాడు రామం అప్పటికే చలమయ్య శవం మీదపడి గోలుగోలు మంటున్నారు వరలక్ష్మి, పిల్లలు

చలమయ్యలోని జీవుడు అన్నపూర్ణని చేరాడు

ఆ ఇద్దర్నీ నే నెప్పుడు చేరతానా అన్నట్టు 'మంచం' నిశ్శబ్దంగా చలమయ్య శవం కేసి చూస్తూంది ●

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము
...ఆరుదవ భాగము

(గత సంచిక తరువాయి)


















## నండూరి రామమోహనరావు — బొమ్మలు బాపు









(ఇంకా వుంది)

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

ఇంత వరకూ సాగిన కథ-8: చైనా యుద్ధంలో ప్రాణాలు కోల్పోయి పరమవీర చక్ర అవార్డు అందుకొన్న మహేష్ చంద్ర కొడుకు రాహుల్ వైమానిక దళంలో పైలట్‌గా చేరతాడు. తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు. కుమార్తె సుషుమ్న ఆడుకుంటున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ గురించి మరదలు తన్వీని అరాతీస్తాడు రాహుల్. అటువంటి పరికరం వల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన కేసు వివరాలను సేకరించేందుకు ప్రయత్నిస్తుంటాడు. కారవెళ్లి విమాన ప్రమాదానికి సంబంధించి క్రూబాక్స్‌లోని ఇండికేటర్ దొంగతనంతో సంబంధమున్న అలయన్స్ సంస్థపై ఒక కన్ను వేసి వుంచిన ఎ.ఎస్.పి. కారంత్ హత్యకు గురవుతాడు. ఆ ఇండికేటర్ అందజేయకపోతే తనకి కూడా యిదే గతి పడుతుందని రాహుల్‌ను ఒక అమ్మాయి బెదిరిస్తుంది.

"అగ్నిని మించిన దైవం లేదు. ప్రాణంలేని శరీరం కట్టెతో సమానం. ఈ కట్టెను అగ్నికి సమర్పించండి. శాస్త్ర విధిగా అంత్యక్రియలు జరిపించండి." అని ఆదేశించాడు దేవిప్రసాద్!

ఎ. ఎస్. పి. కారంత్ శరీరం మీది నుంచి దుస్తులు తొలగించారు. విధి నిర్వహణలో చనిపోయిన డిపార్ట్‌మెంట్ వీరుడు. అన్ని లాంఛనాలతో అంత్యక్రియలు జరిపించుకునేందుకు అర్హమయిన శరీరం అతనిది. కాని సైతానుల చేతిలో పడిపోయింది.

అప్పటికప్పుడు రకరకాలుగా దుస్తులు మార్చుకున్నారు. మిలిటెంట్స్ సమాజంలో దీనుల వర్గానికి చెందిన వాళ్లలా వేషాలు మార్చేశారు. కారంత్ శవాన్ని నగరంలో ఓ మారు మూల నుంచి అంతిమ యాత్రకు సిద్ధం చేశారు. వారు వీధుల గుండా నడుస్తూ శవాన్ని తీసుకుపోతున్నారు. ఎన్నో దురాగతాలకు, సైతానుల దుశ్చర్యలకు కేవలం సాక్షిమాత్రుల్లా మిగిలిపోతున్న ఆ నగర ప్రజలే చూస్తూ తలలు దింపుకుని దాటిపోతున్నారు.

దిగులు ముఖానికి పులుముకుని బ్రహ్మాండంగా నటిస్తూ శవాన్ని శ్మశానం దగ్గరకు తీసుకుపోయారు. అప్పటికే చితి సిద్ధం చేయబడింది.

కారంత్ శవాన్ని దాని మీద దింపి నిప్పు అంటించారు. వీలయినంత త్వరగా ఆ శరీరాన్ని బూడిదగా మార్చమని హెచ్చరించి శవదాహకుడికి బరువు తగిలించారు.

అతడు అమిత ఉత్సాహంతో తన పనిని ప్రారంభించాడు. నాలుగు దిక్కులా కిరోసిన్ దట్టించాడు. వారిలో వారు వేరే విషయాలు మాటాడుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు.

దేవీప్రసాద్ చెప్పిన విధంగా అగ్ని కీలలు లేచాయి. అన్యాయానికి ఎదురొడ్డి పోరాడి ప్రాణాలు అర్పించిన కారంత్ శరీరాన్ని మండుతున్న చితి బూడిద కుప్పగా మార్చేసింది.

వారంతా తిరుగుముఖంపట్టారు. దేవిప్రసాద్ ఇవ్వబోయే ఈనాములు గురించి ఉవ్విళ్లూరుతూ వరుసగా నిలబడ్డారు.

"అగ్ని దేవుడు కరుణించాడా?" అడిగాడు దేవిప్రసాద్.

"అతని శరీరం పిడికెడు బూడిద అయిపోయింది."

"డ్యూటీ కోసం ప్రాణాలర్పించిన వీరుడు. పవిత్రమైన అగ్నికి ఆహుతి అయ్యాడు. అతనికి పుణ్యలోకాలు దొరుకుతాయి. మీరంతా అతని ఆత్మశాంతి కోసం ప్రార్థించండి. రెండు నిమిషాలు మౌనం పాటించండి." అన్నాడు.

దేవిప్రసాద్ సమక్షంలో ప్రార్థనలు చేసేటప్పుడు ఎవరి దగ్గరా ఆయుధాలు ఉండకూడదు. అది అందరికి తెలిసిన రూలు!

శ్మశానం వరకు వెళ్లి వచ్చిన వారు అయిదుగురు. వారు ఆయుధాలను ఎదురుగా ఉన్న టేబిల్ మీద ఉంచారు.

"అందరూ ఆయుధాలను అక్కడ ఉంచారా?" దేవిప్రసాద్ అడిగాడు.

"అవును బాస్. మా దగ్గర మరే ఆయుధాలు లేవు."

"దట్స్ గుడ్! ఇక రెండు నిముషాలు మౌనం పాటించండి". వాళ్లు అతని మాటల్ని వేదాక్షరాల్లా పాటిస్తున్నారు.

కళ్లు మూసుకుని చేతులు కట్టుకుని తలలు దించుకున్నారు.

"అనాథ ప్రేత సంస్కారం చేసిన పుణ్యం మీకు దక్కింది. ఇహ కళ్లు తెరవండి". అందరూ కళ్లు తెరిచారు.

"కాని మీలో ఒకే ఒక్క పాపి ఉన్నాడు" ఎవరికి వారే బితుకు బితుకుమంటున్నారు. భయంతో వొణుకుతున్నారు.

"పాపం చేసిన వారు ఎవరో మీరే చెప్పకోవాలి."

ఒకరి ముఖం ఒకరు చూచుకుంటున్నారు. ఎవరికీ అర్థంకాలేదు.

"భగవంతుడు నాకు దివ్య దృష్టిని ప్రసాదించింది నీలాంటి దొంగను పట్టుకొనేందుకే! నీ మీద సైతాను నీడ పడింది." అంటూ వారిలో ఒకడి దగ్గరగా వచ్చాడు దేవిప్రసాద్!

అతని వెనుక మెర్క్యురీ దీపం వెలుగుతోంది. అతని నీడ వారిలో ఒక వ్యక్తి

మీద పడింది. హడలిపోయి వొణకటం ప్రారంభించాడు. దేవిప్రసాద్ అతని దగ్గరగా వచ్చి బలంగా చాచి లెంపకాయ కొట్టాడు. అతని నోరు తెరుచుకుంది.

పరిస్థితి గమనించిన మరో మిలిటెంట్ వచ్చి అతని కంఠాన్ని బిగించి పట్టుకున్నాడు. దోషి పెద్దగా అరిచాడు. ఊపిరాడలేదు. నాలుక చాల పొడవున బయటకు వచ్చింది.

కంఠంలో దాచుకున్న బ్లేడు ముక్కలు, చిన్న సైజు చాకు నాలుక మీదికి వచ్చాయి. అందరూ విస్మయపోయారు.

"పాపీ! క్రమశిక్షణ కావాలి నాకు. ఆయుధాలన్నీ అవతల పెట్టమని ఆర్డర్ చేశాను నేను. కాని నువ్వు అలా చేయలేదు. కంఠంలో దాచుకున్న ఆయుధాల సంగతి నాకు ఎలా తెలుస్తుంది అనుకున్నావు కదూ! దీనికి శిక్ష ఏమిటో తెలుసా నీకు? " మరో వంకకు చూచారు దేవిప్రసాద్! ఆ వైపున తలుపులు తెరుచుకున్నాయి.

ఇబ్రహీం ముందుగా ఆ హాలులోకి వచ్చాడు. అతని వెనుకనే వచ్చింది పీయూష! ఆమె చేతుల్లో ముఖమల్ వస్త్రం కప్పిన ఓ వెండి ప్లేటు ఉంది. పీత వర్ణం ముఖమల్ దుప్పటిలో తెల్లని వస్తువు ఒకటుంది. దాని సైజు సెంటీమీటరు డయా! అది గుండ్రంగా ఉంది. వచ్చి దోషి ఎదురుగా నిలచిందామె.

"అదేమిటో తెలుసా?" అడిగాడు దేవిప్రసాద్.

"బాంబ్ షెల్ బాస్" భయంగా బదులిచ్చాడు దోషి!



## 'నెప్ట్యూన్'కి మూడవచంద్రుడు: 'వాయేజర్'పరిశోధనలోవెల్లడి

'నెప్ట్యూన్' గ్రహం చుట్టూ పరిభ్రమిస్తున్న మరొక ఉపగ్రహం జాడ ఇప్పుడు వెల్లడైంది అమెరికన్ వ్యోమనౌక 'వాయేజర్-2' భూమికి వంపిన ఫొటోలలో 'నెప్ట్యూన్'కి మూడవ ఉపగ్రహం కూడా వున్నట్టు విశదమైంది

'నెప్ట్యూన్'కి గల ఈ 'మూడవ చంద్రుడు' 200 నుంచి 600 కిలోమీటర్ల వ్యాసం కలిగి వుండవచ్చునని 'వాయేజర్' పంపిన చిత్రాల ద్వారా తెలుస్తున్నదని అమెరికా వ్యోమ, వైమానిక సంస్థ (నాసా)కి చెందిన జెట్ప్రపల్షన్ లేబొరేటరీ పసడేనా-కాలిఫోర్నియా ఒక ప్రకటనలో వివరించింది నీలి-ఆకుపచ్చ రంగులో కనిపించే 'నెప్ట్యూన్' గ్రహానికి గల మొదటి రెండుఉపగ్రహాలలో 'ట్రైటాన్'ని 1846 లోను 'నెరీడ్'ని 1949లోను కనుగొన్నారు

మానవరహిత వోమనౌక 'వాయేజర్-2'ని అమెరికా 1977 లో ప్రయోగించింది ఇది ఇప్పుడు 'నెప్ట్యూన్'కి 6 కోట్ల 90 లక్షల కిలోమీటర్ల దూరంలో వుంది. అగస్టు 24 న ఈ వ్యోమనౌక... సౌరకుటుంబంలోని । అతిపెద్ద గ్రహాలలో నాలుగవదైన నెప్ట్యూన్కి అతి సమీపంలోకి వెళుతుంది ఈ 'వాయేజర్' పరిశోధనలో చివరికి 'నెప్ట్యూన్' చుట్టూ పరిభ్రమిస్తున్నవని భావిస్తున్న 10 చిన్నచిన్న ఉపగ్రహాల ఉనికి బయట పడగలదని పరిశోధకులు ఆశిస్తున్నారు

'వాయేజర్' 1979 లో 'జూపిటర్'ని, 1981లో 'శాటర్న్' కూడా ఫొటోలు తీసి భూమికి ప్రసారం చేసింది కాగా, వచ్చే అగస్టులో ఇది 'నెప్ట్యూన్'ని కూడా సమీపించడంతో . 'ప్లూటో'ని మినహాయిస్తే సౌర కుటుంబంలోకెల్లా మిక్కిలి ఎక్కువ దూరంలో వున్న 'నెప్ట్యూన్'ని సందర్శించిన తొలి వ్యోమనౌకగా 'వాయేజర్' ప్రత్యేకతను సంతరించుకుంటుంది

---

"ఇప్పుడు నువ్వేం చేయాలో తెలుసా?"

"దాన్ని మ్రింగేయాలి బాస్! కాని కాని "

"వివరణ యివ్వాలని ప్రయత్నిస్తే దాన్ని నీ గొంతులోకి బలవంతంగా వేయించి మళ్లా బయటికి రాకుండా పెదవులు కుట్టేయిస్తాను అలా చేయించటం ఇదివరకు నువు చూచావా?"

"చూచాను బాస్!"

"అలా పిరికివాడిలా చావకూడదు ధైర్యంగా ఉండాలి ఊ!" దోషి వొణికే చేతులతో దాన్ని తీసుకున్నాడు ప్రక్కనున్న వారంతా దూరంగా వెళ్ళిపోయారు

"ఊ మ్రింగు" ఉరిమినట్లుగా అన్నాడు ఇబ్రహీం! అందుకు దోషి తిరస్కరిస్తే బలవంతంగా గొంతులో వేసి నోరు కుట్టేందుకు సిద్ధంగా ఉన్నాడు అది మరీ హీనపు చావు

అతను వూహించుకోలేకపోయాడు దాన్ని నోటిలో పెట్టుకుని మ్రింగేశాడు అందరూ ఎదురు చూస్తున్నారు సరిగ్గా పది సెకెన్ల తరువాత అతి భయంకరమయిన శబ్దంతో అతని ఛాతీ ప్రేలిపోయింది రక్తం ఫౌంటెన్లా చిమ్మింది ఛాతీ ఎముకలు విరిగి దూరంగా పడ్డాయి

మాంసఖండాలు చెల్లాచెదరు అయినాయి రెండు చేతులు మొండెం నుంచి వేరయి గోడలకు అతుక్కున్నాయి తూలి క్రింద పడేందుకు అతని శరీరం కాస్తంతయినా మిగలలేదు.

"క్రమశిక్షణ పాటించని ఎవరికయినా ఇదే శిక్ష!" తన చివరి సందేశాన్ని అందించి హాలులోంచి ఓ వైపుకు నడిచాడు దేవిప్రసాద్

అతను వెళ్లిపోగానే ఆ వంక తలుపులు మూసుకున్నాయి మిగిలిపోయిన వారందరూ చాల హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. పెద్ద గండం గడచిపోయినట్లు అనిపించింది ఎవరికి వారికి! తమకు దేవిప్రసాద్ ఎలాంటి శిక్ష విధించకుండా వొదిలేయటమే గొప్ప యీనాముగా భావించారు ఇబ్రహీం తన వారందరిని అక్కడ్నించి తీసుకుపోయాడు అతనికి చాల ఆనందంగా ఉంది అడుగడుగునా తన కార్యక్రమాలకు ఎదురు నిలిచి చిత్రహింసలు పెట్టాడు ఎ ఎస్ పి. కారంత్!

ఇప్పుడు అతని అడ్డంకి తొలగిపోయింది కదా అనుకున్నాడు. ఇంక తన కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగుతాయి పోలీసు అధికారి గనుక తన బలగంతో అడ్డుకోగలిగాడు

ఇప్పుడు ఇబ్రహీం సంతోషం పట్టరానిదిగా ఉంది

అతను కాక ఎదురు నిలిచే మగాడు ఎవడున్నాడు తనకి??

* * * * * * *

"రాహుల్ ఉన్నాడు కదా!" అంటూ లోనికి వచ్చాడు చెన్నుడు తన్వి అప్పుడే మేడ మెట్లు దిగి వచ్చింది ఆమె ముఖంలోని విషాద చ్ఛాయలు క్రమంగా మాయమవుతున్నాయి అక్క చనిపోవటం దారుణమే! ఏ క్షణమూ మరపుకు రానంత భయంకర సంఘటన!

అయినా ఇప్పుడామె మనసులో భవిష్యత్ గురించిన ఆలోచనలు చోటు చేసుకుంటున్నాయి తండ్రి ఇచ్చిన సలహాలు మనోలోకంలో మంచి రూపాన్ని దిద్దుకుంటున్నాయి

"పైన గదిలో ఉన్నాడు బావ! పాపాయితో ఆడుకుంటున్నాడు వెళ్లండి" అంటూ ప్రక్కకు తొలగి ఒద్దికగా దారి ఇచ్చిందామె!

"ఫ్రిజ్లోంచి మంచి నీరు యిస్తావా?" పైకి వెడుతూ అడిగాడు చెన్ను

"ఐస్క్రీం కూడ తీసుకువస్తాను" నవ్వుతూ వెళ్లిపోయింది తన్వి చెన్నుడు రాహుల్ గదిలోకి వచ్చాడు

సుషమ్నతో కలిసి చిన్న పిల్లవాడైపోయి ఆడుకుంటున్న రాహుల్ కన్పించాడు ఆ ఇంటి వాతావరణం క్రమంగా మారుతోంది విషాద చ్ఛాయలు క్రమ క్రమంగా మటుమాయమవుతున్నాయి

"స్వీటీ! రైలుబండితో మనం ఆడుకొందాం ఇదిగో ఇలా కీ ఇచ్చి వొదిలేశావనుకో! మా ఊరి నించి మీ ఊరికి వచ్చేస్తుంది రైలు " అంటూ టాయ్రైలుని కీ ఇచ్చి వొదిలేశాడు. అది అతని ముందు నుంచి చిన్న విజిల్ వేసుకుంటూ పాపాయి ముందుకి వెళ్లి నిలిచిపోయింది

"నో! పపా! నాకు రైలు వద్దు " చేత్తో దానిని ప్రక్కకు తోసేసింది సుషమ్న రాహుల్ ముఖం ప్రశ్నార్థకంగా మారిపోయింది

"అయితే మనకు రైలు వద్దు కారు నడుపుదామా?"

"నాకు కారు వద్దు"

"మరి హెలికాప్టర్? ఇది కీ ఇచ్చి వొదిలేస్తే అలా ఎగిరి వచ్చేస్తుంది" అంటూ దాన్ని పైకి నడిపి చూపించాడు దాని రెక్కలు తిరిగాయి ఆకర్షణీయంగా! అయినా సుషమ్నకి అదీ నచ్చలేదు

"హెలికాప్టరు వొద్దు పపా!" అంది బుంగమూతి పెట్టి!

"ఓ కె మరేం కావాలంటావు?" దాన్ని కూడ ప్రక్కన ఉంచేశాడు

"నాకు మిక్కి మౌస్ కావాలి"

"దాంతో చాలసేపు ఆడుకున్నాం కదా! మరో టాయ్ తీసుకుందాం"

రాహుల్ బ్రతిమాలుతున్నట్టుగా అడిగాడు

"నో! పపా!నాకు ఇంకేమీవద్దు! మిక్కి మౌస్ ఒక్కటే కావాలి."

"ఓకె! అలాగే" అంటూ ఆటబొమ్మలమధ్య పడివున్న మిక్కిమౌస్ని పైకితీశాడు దాన్ని ఇద్దరిమధ్య ఉంచాడు

బుల్లిచేతులతో దాన్ని ఆప్యాయంగా అందుకుని కీ ఇచ్చి వొదిలేసింది సుషమ్న! మిక్కిమౌస్ ఆడుతోంటే కేరింతలు కొట్టింది దానిమీద ఆమెకు కలిగిన ప్రేమ అతనికి

చాల ఆశ్చర్యం కలిగించింది

'పసివాళ్ళ మనసులో పైకి ప్రకటించలేని అజ్ఞాత భావాలుంటాయి ఆ భావాలుకల గటానికి మౌలికమయిన సంఘటనలు కొన్ని ఉంటాయి అయితే వారికి అవేమీ జ్ఞాపకం ఉండవు.

ప్రేమ, అయిష్టం లాంటి సహజత్వాల ద్వారా వాటిని పిల్లలు బహిరంగపరుస్తారు కారణాలు చెప్పలేరు అదే అజ్ఞాతభావాన్ని మిక్కీమౌస్ మీద ప్రకటిస్తోంది సుషుమ్న!

ఆ ప్రేమకి కారణం ఒక తీవ్ర సంఘటనకి జ్ఞాపక చిహ్నం అయిన ఒక వస్తువు అదే యిండికేటర్! దాన్ని మిక్కీమౌస్‌లో పెట్టిన విషయం ఆ పసిమనసులోంచి తొలగిపోయింది. దానిమీద ప్రేమ అనే అభివ్యక్త మాత్రం విలిచిపోయింది

ఆ ప్రేమని మరోవిధంగా విశ్లేషించుకున్నాడు రాహుల్! తన గురించి ఎన్నో మాటలు చెప్పివుంటుంది తనూజ! చనిపోయేముందుగా తండ్రిని చాల గొప్ప హీరోగా ఆ మనసులో ముద్రవేసింది

వినటమేకాని ఎన్నడు కన్పించని తండ్రి హఠాత్తుగా కన్పించటమే ఆ పసి మనసులో ఓ సంచలనాత్మక భావం లేత మనస్సుని ఊపేసిన ఆనందకరమయిన సంఘటన! ఆ కారణంగానే తాను కొని యిచ్చిన మిక్కీమౌస్‌కి అతి ప్రాధాన్యత యిస్తోంది అమితంగా ప్రేమిస్తోంది సుషుమ్న

తండ్రినించి అందిన తొలి కానుకగా దాన్ని స్వీకరించటమే ఆ ప్రేమకు మూలం అని ఆ లేత భావాలను విశ్లేషించాడు రాహుల్

అసలు కారణం అజ్ఞాతంగానే ఉండిపోయింది

తాము ఇచ్చిన బహుమానాన్ని తన స్వీటీ అంత అపురూపంగా భావించుతున్నందుకు చాల పొంగిపోయాడు రాహుల్! సహజంగానే కారణాల గురించి మరీ ఎక్కువగా ఆలోచించలేదు

అసలు పట్టించుకోలేదనే చెప్పాలి!!

"రాహుల్! మిక్కీమౌస్‌తో మీరిద్దరూ ఆడుకోవటం సరిపోయింది నేను వచ్చి చాలసేపయింది" వాడిన ముఖంతో దగ్గరగా వెళ్ళాడు చెన్నుడు

"వెల్‌కం అంకుల్! మనిద్దరం ఆడుకుందామా?"

"నువ్వు ప్రక్క గదిలోకి వెళ్ళి ఆడుకో బేబీ!"

"అలాగేం వెళ్లను నేను ప్రక్కగదిలోకి వెళ్ళిపోతే మీరు పపాని తీసుకుని వెళ్ళిపోతారు ఇవాళ్ళ నేను పపా దగ్గరే ఉంటాను"

"అయితే నేను వెళ్ళిపోతాను"

"ఓ కే థాంక్యు అంకుల్" అంది సుషుమ్న చెన్నుడు ముఖం మరింత మాడిపోయింది

రాహుల్ చిన్నగా నవ్వాడు

"తప్పమ్మా! అంకుల్ మన అంకుల్ కదా! రమ్మనాలి! పొమ్మనకూడదు"

"మరి మిమ్మల్ని తీసుకుపోతారుకదా!"

"నేనెక్కడికీ వెళ్ళను స్వీటీ! నీతోనే ఉంటాను" అంటూవుండగా ఐస్‌క్రీం తీసుకుని వచ్చింది తన్వి చెన్నుకి అందించింది సుషుమ్నని చేతుల్లోకి తీసుకుంది రాహుల్ ప్రక్క గదిలోకి వెళ్ళి డ్రసప్ అయ్యాడు

ఐస్‌క్రీం-తినటం ముగించి తనూ వెళ్ళాడు చెన్ను

"పపా వెళ్ళిపోతారు" బుంగమూతి పెట్టింది బేబి

# శత్రుసంహారం

"వెళ్ళాలమ్మా! చాల పనులుంటాయి కదా!" సముదాయింపుగా అంది తన్వి

సుషుమ్న విచారంగానే చూచింది. కాని మరింక అల్లరిచేయలేదు

"చెన్నా పోలీసులకి వార్త అందించావా?" అని అడిగాడు రాహుల్

"నేరుగా వెళ్ళి చెబితే అడ్రస్ అడుగుతారు నీ కేమిటి సంబంధం అంటారు అనుమానిస్తారు ప్రశ్నలతో వేధిస్తారు. స్వేచ్ఛలేకుండా చేస్తారు. వారికి ఉపయోగపడే సమాచారం అందించినందుకు అభినందించటం తరువాత! ముందు చిత్రహింసలు పెడతారు

అందుకోసమని ఒక అడ్రస్ లేని మనిషి చేత పోలీస్ కంట్రోల్ రూంకి ఫోన్ చేయించాను అటునించి ప్రశ్నాపరంపరలేకాని చెప్పేది సరిగా వినటం జరగలేదు. మరి!!"

"అసలు చేరవలసిన వార్త చేరిందికదా!"

"ఎ ఎస్ పి. కారంత్ శవం కారులో కొందరు గుర్తు తెలియని వ్యక్తులు తీసుకుపోతున్నారనే వార్త చేరింది రాహుల్"

"దట్స్ రైట్! చాల మంచిపనిచేశావు"

"కాని వాళ్ళ ప్రక్కనించి రావలసినంత రెస్పాన్స్ రాలేదనిపిస్తోంది"

"అయితే నేను స్వయంగా వెళ్ళి కంప్లెయింట్ చేస్తాను ఒక మిలిటరీ అధికారిగా ఒక పోలీసు అధికారి మరణవార్త తెలిసి ఊరుకోవటం నేరం అది నా అంతరాత్మ అంగీకరించని పని"

"రాహుల్! మనం చూచిన వార్త పోలీసులకి అందించాం మన బాధ్యత తీరిపోయింది నువ్వు ఎక్కువగా కల్పించుకోకు"

"నేరుగా కాకపోయినా పరోక్షంగా ఏం జరుగుతున్నదో తెలుసుకుందాం ఒకవేళ సరిఅయిన చర్యలు తీసుకోవటం జరగకపోతే ప్రత్యక్షంగా కల్పించుకుంటాను. చెన్నా మనం చేయవలసిన పని చాలావుంది వెడదాం పద"

ఇద్దరూ ఇంటినుంచి బయలుదేరి వచ్చారు అప్పుడప్పుడే ఈ వార్తపాక్కి వీధులు వేడెక్కుతున్నాయి

"ఎ ఎస్ పి.ని ఎవరో అజ్ఞాత గూండాలు చంపేశారు శవం ఎక్కడుందో ఎవరికీ తెలియటల్లేదు" అని గుసగుస లాడుకుంటున్నారు వీధులవెంట పోలీసు జీపులు, వ్యానులు, మోటార్ బైసికిల్స్ జాగిలాల్లా పరుగులు తీస్తున్నాయి గుంపులు గుంపులుగా!

వాతావరణం గంభీరంగా కొంత భయానకంగా ఉంది ఏ క్షణంలో అయినా గూండాలకి పోలీసులకి మధ్య వీధుల్లో పోరాటాలు జరుగవచ్చుననే పుకార్లు క్రమంగా వ్యాపిస్తున్నాయి.

భయస్తులు ముందుగానే షాపులు మూసేస్తున్నారు మరి కొందరు ఆఫీసులు కూడ వొదిలేసి పెందరాడే ఇళ్ళకు చేరుకుంటున్నారు ఆ రాత్రి భయంకరమయిన రాత్రిగా మారుతుందంటున్నారు.

నగరంలో శాంతిభద్రతలు అదుపుతప్పతా యంటున్నారు క్రమంగా సాయంత్రానికి జనం వొణికిపోయే పరిస్థితి ఎదురు అయింది

రాహుల్ చెన్నకేశవుడు షాపుదగ్గర కూర్చున్నాడు. చాలమంది అక్కడ చేరి మాట్లాడుకోవటంతో వార్తలన్నీ అందుతున్నాయి. కొందరు అసలు వార్తలకి నీలివార్తలు చేర్చి మసాలా దట్టించుతున్నారు

ఒక్కొక్కరే మెల్లగా స్వంత ఇళ్ళకి, లేదా క్షేమకరమయిన స్థానాలకి జారుకుంటున్నారు వారిద్దరు మాత్రం పాన్ షాపు దగ్గర నిలిచిపోయారు

సాయంత్రం ఏడుగంటలయింది చీకటి పడింది మొదలు పరిస్థితి మరింత భయానకంగా మారుతోంది పోలీసు వ్యాన్‌ల పెట్రోల్ కార్యక్రమం ఎక్కువ అయింది వ్యాన్‌లలో మైక్ సెట్లు బిగించి ప్రజలకు హెచ్చరికలు విన్పిస్తున్నారు

అంత హడావిడిగా ఉన్నా మధ్యమధ్య గూండాలు జీపుల్లో కార్లలో పోవటం కన్పిస్తోంది వారు ఆయుధాలను పట్టి బహిరంగంగా తిరుగుతున్నారు. పోలీసులకి గూండాలకి మధ్య ఏ క్షణంలో అయినా వీధిపోరాటాలు జరిగే వాతావరణం ఏర్పడింది

ఆ రెండు వర్గాలు తప్ప మిగిలిన ప్రజలందరూ తిరగటం మానేశారు

"షాపు మూసేశాను మనం కూడ వెళ్ళిపోదాం" అన్నాడు చెన్నుడు వొణికిపోతూ! అతని శరీరం చెమటలు క్రమ్ముతోంది

"ఎందుకు అంత కంగారు? ఇలాంటి సమయంలోనే గుహల్లో నిద్రించే క్రూరమృగాలు వీధుల్లోకి వస్తాయి వారి గుట్టు కనిపెట్టేందుకు ఇదే మంచి సమయం" అన్నాడు రాహుల్

మరో గంట జరిగిపోయింది ఆ వీధిలో పోలీసులు గూండాల్ని తరుముకురావటం కన్పించింది వీధి మలుపులో పొంచిన గూండాలు పోలీసులమీద హఠాత్తుగా దాడిచేశారు రెండు వర్గాలు గాయపడ్డాయి

గూండాలు మళ్ళీ పారిపోయి మరోచోట మాటువేశారు

ఇదంతా కళ్ళారా చూచిన చెన్నుడు పూర్తిగా దిగజారిపోయాడు

"మనం ఆలస్యంచేయటం ఏవిధంగానూ క్షేమకరం కాదు వెంటనే ఇంటికివెళ్ళిపోదాం" అన్నాడు నిలువెల్లా తడిసిపోయివున్నాడు

ఈలోగా పెట్రోల్ వ్యాన్ వచ్చింది నగరంలో కొన్నిచోట్ల జరిగిన దుస్సంఘటనల కారణంగా ఆప్రాంతాల్లో కర్ఫ్యూ పెట్టారు నగర మంతటా నూట నలభైనాలుగు సెక్షన్ అమలుచేశారు

ఇంకా దాడులు, వీధిపోరాటాలు జరుగుతున్నాయి గూండాలు పోలీసుల మధ్య సాయుధ ఘర్షణ ప్రారంభమయింది తాము అక్కడేవుండి చేయగలిగింది ఏమిటో చెన్నుడికి అర్థంకాలేదు రాహుల్ ఇంటికి తిరిగిపోవాలన్న ఆలోచన కనబరచలేదు



## నవ్వు ఆరోగ్యం

## రెడ్ విల్స్

## హారతి కర్పూరం!

నేను ఈ మద్యనే నిరుద్యోగంతో వాతు్త కుదరక స్వయంకృషితో కర్నూలులో అంజన్ రెంటిడ్ లైబ్రరీ అన్న పేరుతో పుస్తకాల షాపు పెట్టాను నాకు గతంలో నవలా పరిజ్ఞానం అంతగా లేదు ఇలా జరుగుచుండగా ఒకరోజు ఓ అబ్బాయి వచ్చి హారతి కర్పూరం యిమ్మని అడిగాడు నేను హారతి కర్పూరం కోసం అంతా వెదుకు తున్నాను ఆ అబ్బాయి నన్ను మరింత తొందర పెట్టేశాడు ఇన్ని నవలలు వున్నాయి అందులో హారతి కర్పూరం ఎక్కడ వుందో వెధకాలిగా' అని కాస్త చికాకుగా చెప్పాను అంతే వెంటనే ఆ అబ్బాయి ఒకటే నవ్వడం ప్రారంబించాడు ఆ అబ్బాయి ఎందుకలా నవ్వుతున్నాడో అర్ధం కాక అడిగాను అది కాదండీ' నేను దీపార్చనకు వెలిగించే హారతి కర్పూరం అడిగితే మీరు నవలేమో అని అనుకున్నారు అని చెప్పి మళ్ళీ నవ్వడం ప్రారంబించాడు అందుకు నేను నవ్వాలో ఏడ్వాలో తెలియక చివరకు ఎలాగోలాగు నవ్వేశానుకోండి ఈ సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాలో నవ్వులు పువ్వులై విరబూస్తాయి

-కెయల్వీజి గురుప్రకాష్

★ ★ ★

ఆరోజు ఆదివారం కావడంతో అందరం యింట్లోనే వున్నాము రైస్‌పీస్‌కింగ్ అంటే అర్థం ఏమిటి నేను అడిగిన ప్రశ్నకు మాకరాజు రైస్-బియ్యము, పీస్-ముక్కలు, కింగ్‌రాజు వెరశి 'మాకరాజు', అని అర్థం చెప్పాడు మా బావమర్ది అతనున్నప్పుడేద 'బ్రదర్ ఫుల్ మదర్ గారి యింట్లో'నేకదూ అంది మా మరదలు బ్రదర్-అన్న, ఫుల్-అంటే పూర్ణం, మదర్- అమ్మ అంటే 'అన్న-పూర్ణమ్మ' అని కదూ చెప్పింది మా మరదలు కాస్త తీరిక దొరికితే యిలా పోట్లాడుకోవడం మా యింట్లో అలవాటు బ్రింగ్ మైవైఫ్ అని నేను అనేలోగానే మా బావమరిదికి ముందు గదిలోంచి పిలుపురావడం, వాడు అటువెళ్ళడం జరిగింది ఆ గదిలో



మా నాన్నగారితోపాటు, ఆయన ఫ్రండ్-కూడా వున్నారు ఆయనకి సిగరెట్లు బాగా అలవాటు ఉన్న ప్యాకెట్ అయిపోవడంతో వాడ్ని పిలిచి రెడ్‌విల్స్ పట్టుకురమ్మని చెప్పారు వాడు స్పీడుగా నాదగ్గరకువచ్చి "బావా బ్రింగ్ మైవైఫ్ అన్నావు కదా యిదిగో" అంటూ మా ఆవిడ్ని తీసుకొచ్చాడు నేనన్నది పూరి పేరురా బాబూ మీ అక్కనికాదు బ్రింగ్ మైవైఫ్ అంటే తేనాఅరి అంటే తెనాలి అన్నమాట అనగానే అలాగే అయితే ఈసారి నేనోడిపోయానన్నమాట నేవచ్చేవరకు ఏం మాట్లాడుకోకండి అంటూ సిగరెట్లకు పరిగెత్తాడు వాడు తిరిగివచ్చినవాడు "ఇదిగోండి" అంటూ ఆయన చేతిలో ఓ స్వీట్ ప్యాకెట్ పెట్టాడు తెల్లబోయిన ఆయన విప్పిచూస్తే యింకేంవుంది ఎర్రటి జాంగ్రీలు రెడ్-ఎరుపు,వీల్స్-చక్రాలు ఎర్రటి చక్రాలు అంటే యివేకదండీ మీరు చెప్పిన షాపు దగ్గరే వున్నాయన్నాడువాడు మా యింట్లో ఎవరూ సిగరెట్లు కాల్చకపోవడాన, సిగరెట్లు కాల్చే స్టేజికి వాడింకా రాకపోవడాన ఆయన తెమ్మంది సిగరెట్లని వాడు వూహించలేదు వాడి ధ్యాసంతా యీ కబుర్లమీదే వుండటంతో 'రెండోమాటకూడా అడక్కుండావెళ్లి తెచ్చాడు' వాడు అప్పటినుంచి వాడ్ని సరదాగా రెడ్‌విల్స్, అని పిలుస్తుంటాం

-ఉపాధ్యాయుల శ్రీనివాస్

---

అలా ఉండగానే రివ్వుమంటూ ఓ పోలీసు జీపు వచ్చి వారిముందు నిలిచిపోయింది ఆఫీసర్ క్రిందికి దిగివచ్చాడు

"మీ రెవరు? ఇక్కడెందుకున్నారు?" తీవ్రమయిన కంఠస్వరంతో అడిగాడు గూండాలవల్ల పోలీసులు ఒక మంచి ఆఫీసర్‌ని నష్టపడ్డారు ప్రతీకారంతో ప్రతి ఒక్కరి గుండెలు మండుతున్నాయి

ఏమాత్రం వెనుకాముందు చూడకుండా వాదేస్తున్నారు పోలీసాఫీసర్ అడుగుతుండగానే లారీలు, వెపన్స్ ధరించిన పి సిలు బిలబిలమంటూ క్రిందికి దూకి వారిని చుట్టుముట్టారు

చెన్నుడు ఊపిరి పీల్చటం మరచిపోయి బొమ్మలా అయ్యాడు

"అయాం రాహుల్! పైలెట్ ఐ ఎ ఎఫ్" అంటూ పరిచయం చేసుకున్నాడు ఐడెంటిటీ చూపించాడు

"మీరుకూడా ఇలా ఉంటే ఎలా?"

"మీకు సహకరించాలనే!" బదులుచెప్పాడు రాహుల్

"బట్! పరిస్థితి దారుణంగాఉంది మీరుకూడా వెళ్ళిపోవటమే మంచిది అయినా మీరు మాకు ఎలా సహకరించగలరు?" పి సి ల వంక చూచాడు పోలీసాఫీసర్! వారు ఆయుధాలు దింపేశారు

అతనలా అంటూవుండగానే అమితవేగంతో ఒక జీపు ఆ వీధిలోంచి దూసుకుపోతూ కనిపించింది క్షణంలో సగం కాలాన్ని చూపుల్లోనింపి ఆ జీపులో ఉన్నదెవరో గమనించాడు రాహుల్!

"ముందు మనం ఆ జీపుని వెన్నాడాలి" అన్నాడు

"పోలీసులు పెట్రోల్ తిరుగుతున్నారు"

"వారు పోలీసులు కాదు మారువేషాల్లో ఉన్నారు" రాహుల్ సమాధానం చెప్తూనే పోలీసు జీపుదగ్గరకు పరుగుతీశాడు

"వారిని వెన్నంటి పట్టుకోవాలి. కమాన్ ఫాలోమీ!" అని అరిచి జీపులోకి జంప్ చేసాడు పోలీసాఫీసర్ వెంటనే కర్తవ్యాన్ని నిర్ణయించుకుని డ్రయివింగ్‌లో కూర్చున్నాడు

పోలీసులతోపాటు చెన్నుడు కూడా జీపులోకి ఎక్కాడు మరుక్షణంలో జీపు కదిలింది ముందు వెడుతున్న జీపు రూల్స్‌కి విరుద్ధంగా వీధుల్లో తొంభై కిలోమీటర్ల వేగాన్ని అందుకుంది

అది పోలీసుల జీపు కాదని ఆఫీసర్‌కి అర్థమయింది వెన్నాడుతున్నాడు!

(ఇంకావుంది)

# కథల వర్క్‌షాప్-3



## అనగనగా ఓ పట్టభద్రుడు!

ఇ. టి. రామారావు

కుర్చీలో అసహనంగా అటూ యిటూ కదిలాడు కమలాకరం! ప్యాంటు జేబులో నుండి హ్యాండ్‌కర్చీఫ్ తీసి ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు

"మొట్టమొదటిసారిగా యింటర్వ్యూకి వస్తున్నట్లు తనలో యీ టెన్షన్ ఏమిటి? ఇదివరకు ఎన్నిసార్లు యింటర్వ్యూలకి హాజరు కాలేదు! అయినా ఎప్పటికప్పుడు క్రొత్తే! ప్రతిసారీ యిలా నెర్వెస్‌నెస్ ఫీల్ అవటమే ఛీ ఛీ! అనుకున్నాడు మనసులో !"

ఇంతలో ప్యూన్ 'కమలాకరం' అంటూ కేక వేశాడు కమలాకరం కుర్చీలో నుండి లేచి సర్టిఫికేట్ల ఫైల్‌ను చేతిలో పట్టుకొని ప్యూన్ వెంట గదిలోకి నడిచాడు

'గుడ్ మార్నింగ్ సర్!' గదిలోకి ప్రవేశించగానే విష్ చేశాడు కమలాకరం వాళ్లు కూర్చోమని చెప్పగానే థాంక్స్ చెప్పి కుర్చీలో కూర్చున్నాడు అతని అప్లికేషన్ పరిశీలిస్తూ అడిగాడు ఒకాయన!

"మీరు డిగ్రీ పూర్తి చేసి ఐదేళ్లు పైగా అయింది ఇంకా ఉద్యోగం దొరకలేదా? ఏమిటి కారణం?"

"ఏమని సమాధానం చెప్పమంటారు సార్ అర్హతలను ప్రక్కకునెట్టి పైసలకు, పలుకుబడికి అధికారులు దాసోహం అంటున్నంత కాలం మాలాంటి ఎందరో నిరుద్యోగులుగా, నిర్భాగ్యులుగా మిగిలిపోతున్నారనే నిజం మీకు తెలియనిదా?" ఈ మాటలు కమలాకరం మనసులో అనుకున్నాడే కాని బయటకు అనలేదు అంటే జరిగేదేమిటో అతనికి అనుభవపూర్వకంగా తెలుసు ఇది తనకు ఆఖరి అవకాశం ఇక మీద ప్రభుత్వోద్యోగానికి తను అర్హుడుకాడు వయసు మీరిపోయిం-

ది ఆ విషయం దృష్టిలో పెట్టుకొని చాలా వినయంగా, నమ్రతగా సమాధానం చెప్పాడు కమలాకరం

"ప్రయత్న లోపం లేకుండా నా వంతు కృషి నేను చేస్తూనే వున్నాను సార్! కాకుంటే అదృష్టం యింకా కలిసి రాలేదు ఒక్క మాట సార్! ఇది నాకు చివరి అవకాశం దయచేసి యీ విషయం మీరు దృష్టిలో పెట్టుకుంటే కృతజ్ఞుడిని "

కమలాకరం మాటలతో కమిటీ మెంబర్లు అతనివంక పరిశీలనగా చూశారు ఆ తర్వాత రెండు మూడు ప్రశ్నలు వేశారు చాలా వరకు కరక్టుగానే సమాధానం చెప్పాడు కమలాకరం సంతృప్తిగా బయటికి నడిచాడు సాయంత్రానికి రిజల్ట్సు చెప్పారు కమలాకరానికి ఉద్యోగం రాలేదు కాని వెయిటింగ్ లిస్ట్‌లో మొదటివాడుగా పెట్టారు."

* * * * *

కమలాకరం తండ్రి రఘురామయ్య కొయ్య పని చేస్తూ వుంటాడు ఆయనకు ఇద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు! కమలాకరం అందరిలోకి పెద్దవాడు తన శక్తికి మించిన పని అయినాకమలాకరం శ్రద్ధను, తెలివిని గ్రహించి డిగ్రీ చదివించాడు తండ్రి ఏదో ఉద్యోగం దొరికి కొడుకు సంసారాన్ని ఆదుకుంటాడనే ఆయన ఆశలు ఎండమావిగానే మిగిలిపోతున్నాయి డిగ్రీ పూర్తిచేసి అయిదేళ్లయినా ఏ ఉద్యోగం రాలేదు ఆయన ఆరోగ్యం కూడా ఈమధ్య క్షీణించింది కూతుళ్లు పెళ్లికి ఎదిగి కూర్చున్నారు మానసిక దిగులు ఆయన్ని మరింతగా కృంగదీసింది ఇదంతా గమనిస్తున్నాడు కమలాకరం అతను మనసులో ఎంతో మధనపడుతున్నాడు తండ్రి ఆరోగ్య పరిస్థితి, కుటుంబ ఆర్థిక పరిస్థితులు అతనికి శాంతిని కరువు చేస్తున్నాయి "తను ఏదైనా చేయాలి ! ఇది తన తక్షణ కర్తవ్యం" అని మనసులో నిశ్చయించుకున్నాడు అప్పటికప్పుడు ఒక నిర్ణయం తీసుకున్నాడు

తండ్రి బాధ్యతను, వృత్తిని తన చేతుల్లోకి తీసుకున్నాడు కమలాకరం! ఇంటి ముందు భాగాన్ని ఒక షాపుగా తీర్చి దిద్దాడు నలుగురు పనివాళ్లను పెట్టుకున్నాడు పెద్ద పెద్ద షాపులకు, గవర్నమెంట్ ఆఫీసులకు తిరిగి ఫర్నిచర్ కోసం ఆర్డర్లు సంపాదించాడు తండ్రి పర్యవేక్షణలో ఆ పనిని ఎంతో నాణ్యతతో, సరైన టైంలో పూర్తి చేయించాడు కాలం గడిచే కొద్దీ చేతినిండా వర్క్, ఆర్డర్లు!

అతని షాపుకు మంచి పేరు వచ్చింది షాపును ఇంటి దగ్గర నుండి టౌన్ సెంటర్లోకి మార్చాడు పనివాళ్లను ఎక్కువ చేశాడు ఒక ప్రభుత్వ బ్యాంకుతో సంప్రదించి స్వయం ఉపాధి పథకం క్రింద పాతిక వేలు అప్పు తీసుకున్నాడు కొత్త యంత్రాలు కొన్నాడు పెద్ద పెద్ద వర్క్‌లు స్వీకరించాడు హోటల్ ఫర్నిచర్, స్కూల్ ఫర్నిచర్ ఆర్డర్స్‌తో క్షణం తీరిక లేకుండా గడుపుతున్నాడు కమలాకరం ఆర్నెల్లలో బ్యాంకు అప్పు తీర్చేశాడు బజార్లో అద్దెకు తీసుకున్న స్థలాన్ని స్వంతానికి కొన్నాడు క్రమేణా కుటుంబం ఆర్థికంగా స్థిరపడింది ఒక చెల్లెలి పెళ్లి జరిపించాడు మిగిలిన ఇద్దరి చెల్లెళ్ల కోసం బ్యాంకులో డబ్బు జమ చేస్తున్నాడు ఇప్పుడతని షాపులో దాదాపు ఇరవై మంది వర్కర్లు, నలుగురు ఆఫీస్ స్టాఫ్ !

ఒకరోజు కమలాకరానికి రిజిస్టర్డ్ లెటర్ వచ్చింది ఎప్పుడో తను హాజరైన ఇంటర్వ్యూలో తనను సెలక్ట్ చేసినట్లు, వెంటనే వచ్చి ఉద్యోగంలో చేరమని వుంది అందులో ! కమలాకరం నవ్వుకున్నాడు "నిజంగా తనకి ఉద్యోగం అవసరమైననాడు అది లభించలేదు ఇప్పుడు తను బ్రతకటమే కాకుండా ఎంతోమందికి ఉపాధి కల్పిస్తున్నాడు ! ప్రభుత్వోద్యోగంకోసంఆరాటపడుతూ కాలం వృథా చేయటం కంటే ఏదో ఒక ఉపాధిని కల్పించుకోవటం ఉత్తమం "

# దొంగల రాజ్యంలో

అవధానుల విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఆ రోజు తెల్లారకుండానే చాలామంది మగాళ్లు డ్యూటీల నుండి ఉత్సాహంగా ఇంటికొచ్చేశారు అందరి మొహాల్లోనూ ఉత్సాహం తాండవిస్తోంది

'ఇవాళ్టితో పోలీసుల బెడద పోయిందేవ్' అంటూ ఉత్సాహంగా ఇంట్లో కడుగుపెట్టాడు జోగారావ్

ఆ నిజంగానే? ముఖమంతా నవ్వు పులుముకొంటూ అడిగింది యశోదమ్మ

'నిజంగానే' పోలీసులు మన అడివిదాటుకొని రెండు మూడడవుల ముందుకెళ్ళిపోయారు' ఇక మనడివికి ప్రమాదం దాటిపోయింది'

ఎంత మంచివార్త చెప్పారండీ' అమ్మయ్య గుండెలు చల్లబడ్డాయి మీరుకూడా చూడండి ఎలా చిక్కిపోయారో' రాత్రల్లా డ్యూటీ పగలు గస్తీ' నిద్రలేక కళ్ళు చూడండి ఎలా లోతుకు పోయాయో' మొగుడివైపు ఆప్యాయంగా చూస్తూ అంది యశోదమ్మ

ఊ సర్లే ఈ శుభ సందర్భంలో మొగుడి నోట్లో కాస్త ఇప్పసారా పోసేదుందా లేదా? చిలిపిగా అన్నాడు జోగారావు

అయ్యో నా మతిమండా' ఇప్పుడే తెస్తానుండండి లోపలకు నడిచింది యశోదమ్మ

ఆ రోజు అడివంతా పండుగ చేసుకొన్నారు'

అడివినిండా ఎక్కడ చూసినా నెగళ్లే' ఆ నెగళ్ళ చుట్టూ తప్పట్లు కొడుతూ డాన్సులే'

చాలా రోజుల తర్వాత అడివి కళకళ్లాడింది'

కాని ఆ కళకళలు ఎన్నో రోజులు నిలవలేదు'

ఈ సారి బెడద ఇంకోరూపంలో వచ్చిపడింది'

అవి ఉగ్రవాదుల చర్యలు'

మొదట్లో అది ఎక్కడో అడివిలో ఒకమూల కుర్రకారుల స్ట్రైకుగా మొదలయింది కొన్నాళ్ళలో నే అందులో ప్రతిపక్షాలు ప్రవేశించడంతో అది అలా అలా దావానలంలా అడివంతా వ్యాపించింది

అడివంతా ఎక్కడ చూసినా పెద్ద పెద్ద గుంపుల ఊరేగింపులే'

ప్రతి గుంపులో నూ పెద్ద పెద్ద నినాదాలే'

అందరి చేతుల్లోనూ పెద్ద పెద్ద బానర్లే'

అడివికి రక్షణ కల్పించాలి'

ఎన్నాళ్ళు మాకీ పోలీసుల బెడద'

నాయకుల్లారా మీరేం చేస్తున్నారు?

బాసుల చేతకానితనం నశించాలి"

మూడో రోజు ఉద్యమం తీవ్రరూపం దాల్చింది

పెట్రోలు పోసి అడివిలో కొన్ని చెట్లను తగలెట్టేశారు

ఆర్నెల్లకోసారి సమావేశం జరిగే పెద్దమీటింగ్ హాల్లాంటి గుహని రాళ్ళూ అవీ వేసి కూల్చేశారు అందులో దొంతర్లుగా పెట్టి ఉన్న ఖాళీ డ్రమ్ములీ పేకెజి పెట్లనీ బయటి కీడ్చేసి ముక్కలు చేశారు

దొంగనోట్లు ముద్రించే ప్రింటింగ్ ప్రెస్‌లో జొరబడి నోట్లని లాక్కొని చింపి పోగులు పెట్టారు

పరిస్థితి ఆందోళనకరంగా మారడంతో పెద్దబాసు జంగిల్ క్రానికల్ లో విజ్ఞప్తి చేశాడు

సోదర చోరులారా'

అడవిలో చెట్లను తగలబెట్టి ప్రెస్సులో నోట్లను చింపేసి మీరు మీ ఆగ్రహాన్ని చూపెడుతున్నాం అనుకొంటున్నారు' కాని మీరు చేసేదేమిటి? మీ ఆస్తిని మీరే స్వయంగా ధ్వంసం చేసుకోడం' ఎవరైనా తెలివి తక్కువగా తమ వేలితో తమ కంటినే పొడుచుకొంటారా? మీరు చేసేపని అలాగే ఉంది మరి' అడవిలో ఈ చెట్లు ఈ గుహలూ ఇవన్నీ మన జాతీయ సంపదలు వీటిని నాశనం చెయ్యడం ద్వారా మీరు మరిన్ని ప్రమాదాల్ని కొని తెచ్చుకొంటున్నారే తప్ప ప్రమాదాల్నించి దూరంగా పోవడం లేదు'

నేను మీకు చేసే విజ్ఞప్తి ఒక్కటే' అనవసరమైన ఉద్రేకంతో కాక ఏ పని చేసినా వివేకంతో చెయ్యండి మన అడివి వినాశనాన్ని కోరే కొన్ని అదృశ్యశక్తులుంటాయి వాటికి లొంగపోకండి' పరిస్థితులు చక్కబడడానికీ పోలీసుల బెడద తగ్గించడానికి వీలైనన్ని ప్రయత్నాలు మేమూ చేస్తున్నాం త్వరలో ఈ విషయమై ఓ కమిటీని కూడా వేద్దామని చూస్తున్నాం కాబట్టి నేను విజ్ఞప్తి చేసేదేమిటంటే కొన్నాళ్ళు శాంతి వహించమని'- పెద్దబాస్,

అదే పేపర్లో పెద్దబాస్‌తో ఇంటర్వ్యూ కూడా ప్రచురింపబడింది

'ఈ అల్లర్లకీ అడవిలో జరిగే ఈ నష్టాలకీ అధికార పక్షంలోని వారి అసమర్థతే కారణమని ప్రతిపక్షాల ఆరోపణ' మీరేమంటారు మిస్టర్ బిగ్‌బాస్?

కాదంటాను' ఆ ప్రతిపక్షాలే అధికారంలో ఉన్నప్పుడు ఏం చేశాయ్' అప్పుడు ఇన్ని గుహలుండేవా? దొంగనోట్ల ప్రింటింగ్ ప్రెస్సులుండేవా?"

కాని అడివిమీద మునుపు ఏడాదికో రెండేళ్ళకో ఒకసారి పడే పోలీసులు ఇప్పుడు తరచుగా మూడునాలుగు నెలలకి ఒకసారి పడుతున్నారనీ దానికి కారణం అడవిలో తగినన్ని రక్షణ ఏర్పాట్లు కలిగించకపోవడమేననీ వారి అభిప్రాయం మరి దానికి మీరేమంటారు?

చూడండి మిస్టర్ ప్రెస్ రిపోర్టర్' ఈనాడు మన టెక్నాలజీ ఎంతో అభివృద్ధి చెందింది మన కార్యక్రమాలూ ఎంతో విస్తృతమయ్యాయి కార్యక్రమాలు పదిరెట్లుగా విస్తరించినప్పుడు ప్రమాదాలు కేవలం నాలుగురెట్లే ఎక్కువవడంలో ఆశ్చర్యమేముంది? అయినాసరే మేము చేతులు ముడుచుకు కూర్చోలేదు మా ప్రయత్నాలన్నీ మేము చేస్తూనే ఉన్నాం'

'ఇంకొక్క ప్రశ్న వీటన్నిటి వెనుకా ఏదైనా పరారణ్య హస్తం ఉందంటారా?

లేదనిమాత్రం చెప్పలేను అంతేకాదు అన్‌డర్ గ్రౌండ్ హస్తం కూడా ఉండి ఉండొచ్చు మేము అన్‌డర్ గ్రౌండ్ లోని పోలీస్ గ్యాంగ్ కార్యకలాపాల్ని ఎప్పటికప్పుడు రహస్యంగా కనిపెట్టి వాటిని నిర్మూలించడానికి ప్రయత్నాలు చేస్తున్నాం

థాంక్యూ

వెల్‌కమ్

ఆ విధంగా ముగిసిందా ఇంటర్వ్యూ

ఆ రోజు అపోజిషన్ పార్టీ బాస్ అధ్వర్యాన పెద్ద బహిరంగ సభ జరిగింది

మహా దొంగలారా' చోర శేఖరులారా'

ఈనాడు మనం ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితుల గురించి మీ కందరకూ తెలుసు అడవిలో ప్రతి క్షణమూ భయమే ప్రతి పగలూ ఓ గండమే ఏ మిట్టమధ్యాహ్నం ఏ పోలీసొచ్చి గుహమీద పడతాడోనని ప్రతి ఒక్కరూ గుండె అరచేత బట్టుకొని కూర్చొంటున్నారు

ఎందువల్ల ఎందువల్లనంటారు?

కేవలం మనబాసుల అసమర్థత వల్లనే?

పక్క అడవుల్ని చూడండి' వాళ్ళ రక్షణ ఏర్పాట్లు ఎంత కట్టుదిట్టంగా ఉన్నాయో' అక్కడ పట్టపగలు కూడా ఆడవాళ్ళు హాయిగా తిరుగుతారు

గత అయిదేళ్ళలో మనచుట్టు పక్కల అడవుల్లో పోలీసులు రెండుసార్లే పడితే మన అడవిలో తొమ్మిదిసార్లు పడ్డారు'

ఇది మనకు సిగ్గుచేటు కాదూ?

ఇక ఆ అడవుల్లో టెక్నాలజీ చూడండి ఎంత

అభివృద్ధి చెందిందో! మనకో చిన్న కరెన్సీనోట్ల ప్రెస్సుందని మురిసిపోతున్నాం

ఓ నాలుగు నాటుబాంబుల్ని చేతిలో పెట్టుకొని సంతృప్తి పడిపోతున్నాం

కాని పక్క వాళ్ళకో!

వాళ్ళకి కనీసం నాలుగేసి కరెన్సీ ప్రింటింగ్ ప్రెస్సులూ నాలుగేసి లాటరి టిక్కెట్ల ప్రింటింగ్ ప్రెస్సులూ చక్కని పంటనిచ్చే గంజాయి తోటలూ కొత్త కొత్త రకాలైన బాంబులూ మత్తు మందులు తయారు చేసే ఫ్యాక్టరీలు ఎన్నెన్నో ఉన్నాయి వాళ్ళు మనలా దొంగలే!

అయినా అంతలా అభివృద్ధి సాధించారు మనం మాత్రం ఏభై ఏళ్ళ క్రితం లంగోటీ కట్టుకొని ఒంటికి నూనె మసీ పూసుకొని గోడలకి కన్నాలు పెట్టే స్టేజిలోనే ఉన్నాం

మనం కూడా మనపక్క అడవుల స్థాయికి చేరాలంటే కుళ్ళిపోయిన ఈ బాస్‌ల వ్యవస్థ నశించాలి!

కొత్త నాయక వ్యవస్థకి పునాదులు తియ్యాలి

కుర్రదొంగ ఉపన్యాసం పూర్తి కాగానే

బిగ్‌బాస్ డౌన్‌డౌన్!

కొత్త నాయకత్వం కావాలీ! అన్న కేకలు మిన్నుముట్టాయి

బిగ్‌బాస్ గుండె జారిపోయింది!

ఆ అడవిలో ఓసారి పదవిపోతే మళ్ళా తెచ్చుకోడం ఎంత కష్టమో తెలుసు! అందుకే తక్షణం విద్యార్థి నాయకుల్నీ అపోజిషన్ నాయకుల్నీ పిలిపించి ఓ మీటింగ్ పెట్టాడు రెండు రోజులు చర్చలు జరిగాయి

చివరికి ఇరుపక్షాల వాళ్ళూ ఓ రాజీకొచ్చారు

తే వాచ్‌మన్‌లని పదేసి గుహలకొకరి చొప్పున నియమించి అడవి రక్షణ ఏర్పాట్లని మరింత కట్టుదిట్టం చేస్తాడు బిగ్‌బాస్

దానికి ప్రతిగా అవతలివాళ్ళు ఉద్యమాన్ని విరమించుకోవాలి!

ఇకపోతే పక్క అడవుల్లో అంత అభివృద్ధి ఎలా జరిగిందో పట్టపగలు కూడా అక్కడివారు అంత నిర్భయంగా ఎలా ఉండగలుగుతున్నారో తెలుసుకోడానికి ఒక త్రైపార్టీ కమిటీ నియమించబడుతుంది ఆ కమిటీ అన్ని అడవులూ తిరిగి సర్వే చేసి రిపోర్టుని అందజేస్తుంది

కమిటీ అందించిన ఆ సర్వే రిపోర్టునిబట్టి తగిన ఏర్పాట్లు చేస్తాడు బిగ్‌బాస్

అడవిలో పరిస్థితి కాస్త శాంతించాకా అందరూ నిశ్చింతగా ఊపిరి తీసుకొన్నారు కాని ఈసారి తొందరపడి నెగళ్ళచుట్టూ గెంతడాలూ గట్రా చెయ్యలేదు!

మళ్ళా ఏ ఆపద ముంచుకొస్తుందో ఎవరికి తెలుసు!

ఆ మర్నాడే త్రైపార్టీ కమిటీ తయారయ్యింది

బ్యాంక్ రాబర్ జోగారావ్ (జోగులు) ట్రెయిన్ డెకాయిటీ గంగారావ్ (గంగులు) ఎక్స్‌పాకెటర్ కృష్ణారావ్ (కిట్టూ) వీళ్ళు ముగ్గురూ ఆ కమిటీ సభ్యులు

ఆరోజే కమిటీవాళ్ళు టూర్‌కి బయల్దేరే రోజు

టియే డియే అడ్వాన్సుగా ఒక్కొక్కరూ అయిదేసి నాటుబాంబులూ రెండేసి కత్తులూ ఒక్కో పిస్తోలు తీసుకొన్నారు

మరో గంటకి జోగారావ్ టూర్‌కి బయల్దేరతాడనగా అనసూయమ్మ మెల్లగా యశోదమ్మ పక్కన చేరింది

ఏం వదినా అన్నయ్యగార్ని అదేదో కమిటీలో వేశారట! ఆరాగా అడిగింది

అవును వదినా రామగుండం అడవులూ భద్రాచలం అడవులూ కరీంనగర్ అడవులూ ఇంకేవో చాలా చెప్పార్లే అన్నీ తిరిగి చూస్తారట! గర్వంగా చెప్పింది యశోదమ్మ

అదృష్టవంతురాలవు వదినా! అవునూ కరీంనగర్ అడవులకి హైదరాబాదు మీందేగా వెళ్తారు? అక్కడ మంచి డిజైన్లనో పోచంపల్లి చీరలు దొరుకుతాయట ఏ షాపునుంచో రెండు కొట్టుకు రమ్మందూ మా ఆయనకి ఇటువంటి టూర్లే తగలవు చెప్తామన్నా

సర్లే వదినా! మీ అన్నయ్యగారి విషయమే చెప్పాలీ! నేనెంత ముచ్చటపడి అడిగానో చార్మినార్ దగ్గర మంచి ముత్యాలు దొరుకుతాయట ఓ గుప్పెడు తెచ్చి పెడుదురూ అని నేనలా అడిగినందుకే నామీద విరుచుకు పడ్డారు



# దొంగలరాజ్యంలో..

నేను వెళ్ళేది ఆపీస్ పనిమీద ఇటువంటి చిల్లరచిల్లర స్వంత దొంగతనాలక్కాదు అని' అదేమిటో ఓ ముద్దూ లేదు, ముచ్చటాలేదు' నిట్టూరుస్తూ అంది యశోదమ్మ

ఏమేవ్' ఇక బయల్దేరే టైమయింది పెట్టి సర్దావా? అన్నాడు జోగారావ్ హడావిడిగా లోపలికొస్తూ అనసూయమ్మ బయటకు జారుకొంది

అవునూ ఊరికెళుతున్నారుకదాని నేనో వస్తువు ముచ్చటపడి తెమ్మంటే చిరాకుపడ్డారు' కాని వెళ్ళే ముందు కనీసం మీక్కావలసిన వస్తువుల గురించైనా చూసుకోవద్దటండీ? రుసరుసలాడుతూ అంది యశోదమ్మ

ఎందుకేఆ విసుగు? ఇప్పుడేమయింది?

ఏమయిందా? నా శ్రాద్ధం అయింది ఇంట్లో ఓ మంచి సూట్కేసైనా లేదు' రాత్రల్లా ఊళ్ళో తిరుగుతారు ఒస్తూ ఒస్తూ ఎ కొట్లోకో దూరి ఓ మంచి సూట్కేసు తెచ్చుకోరూ' అంత మతి మరుపైతే ఎలాగండీ?

అయితే మరి పెట్టి సర్దలేదా?

సర్లెండి మీకు తప్పినా నాకు తప్పుతుందా' తెల్లారకుండానే అమ్మాయిని అలా ఊర్లోకి పంపి ఒకటి తెప్పించాను ఆడపిల్లని ఊర్లోకి పంపవలసొస్తోంది ఖర్మ'

సర్లే సర్లే ముందర ప్రయాణపు ఏర్పాట్లు చూడు తొందర పెట్టాడు జోగులు ఓ పదిహేను రోజులబాటు అన్ని అడవులూ పర్యటించి రిపోర్టు అందజేసింది కమిటీ

ఆ రిపోర్టు చదివి బిగ్‌బాస్ మొదట ఆశ్చర్యపోయాడు

ఆ తర్వాత బయపడి పోయాడు

ఆ తర్వాత ఆలోచించి ఓ దృడ నిశ్చయానికొచ్చాడు'

ఆ రోజే ఓ బ్రహ్మాండమైన బహిరంగ సభ ఏర్పాటు చేశాడు

తమ నాయకుడు తీసుకోబోయే నిర్ణయాలు వినాలన్న కుతూహలంతో క్రిక్కిరిసిన దొంగల్తో ఆ సభ కిటకటలాడిపోయింది

నా తోటి చోరశిఖామణులకు నమస్కారం' అంటూ ఎంతో వినయంగా సభకు నమస్కరించాడు బిగ్‌బాస్

ఆ తర్వాత నెమ్మదిగా మొదలై అలా అలా వేగాన్నందుకొంది ఉపన్యాసం

ఈ రోజే త్రిపార్టీ కమిటీ అందజేసిన సర్వే రిపోర్టు అందింది ఇంత వరకు మీరు ఆందోళన చెందిన విషయాలన్నీ నిజమే' మన చుట్టు పక్కల ఎన్నో అడవులకి పోలీసుల బయం లేదు పైగా అవి సాంకేతికంగా ఎంతో అబివృద్ధి చెందాయి'

దానిక్కారణం వాళ్ళ నాయకుల సాహసమే'

వాళ్ళ అడవుల అబివృద్ధి కోసం ఆ నాయకులు ఎంతో పాటుపడ్డారు'

ఎంతో సాహస వంతంగా ఊరిలో ప్రజల మద్యలో జొరబడ్డారు' పోలీసుల్ని తమ అదుపులోకి తెచ్చేసుకొన్నారు'

సభలో ఒక్కసారిగా రణగొణ ద్వని చెలరేగింది'

'అమ్మో ఊరిలోకి చొరబడడమే'

పోలీసుల్ని ఆదీనంలోకి తెచ్చుకోడమే'

అంటూ ఎవరికి వారు ఆశ్చర్యంగా అనుకోసాగారు

సోదరులందరూ నిశబ్దంగా ఉండాలి' అంటూ హెచ్చరించాడు బిగ్‌బాస్

సభ మళ్ళా నిశబ్దమైంది బిగ్‌బాస్ తన ఉపన్యాసం కొనసాగించాడు

'ఈ విషయం రిపోర్టులో చదివి నేను కూడా మీలాగే ఆశ్చర్యపోయాను' వాళ్ళలాగ చెయ్యగలనా అని బయపడ్డాను' కాని వాళ్ళు అనుసరించిన మార్గం చూశాక అదేమంత కష్టమనిపించలేదు' అందువల్ల నేను కూడా ఊరి మనిషి గామారతాను

నో నో వద్దువద్దు సభలో కేకలు చెలరేగాయి బిగ్‌బాస్ చెయ్యెత్తాడు కేకలాపమన్నట్లుగా

కాస్సేపట్లో మళ్ళా సభ మామూలుగా అయింది మళ్ళా కొనసాగించాడు

సోదరులారా నేను ఊరిమనిషిగా మారిపోతానంటే మీరంతా బయపడిపోనక్కరలేదు నేను ఊర్లోకెళ్ళి అక్కడి మనిషిగా మారడం కేవలం నటనే' ఆ ఊరి మనిషి అన్నది ఓ వేషమే' నేనెక్కడున్నా మీ వాడినే' నేనలా ఊర్లోకెళ్ళి వాళ్ళ మనిషిగా నటిస్తే తప్ప మీరు కోరుకొనే రక్షణా మీకు కావలసిన సాంకేతిక అబివృద్ధీ (గంజాయి) పాడి పంటలూ సాద్యంకావు' మీకు ముందే చెప్పాను ఇది నేను పక్క అడవుల వాళ్ళని చూసి అనుసరిస్తున్న మార్గమని' ఇప్పుడు చెప్పండి నేను ఊరిలోకెళ్ళి వాళ్ళ మనిషిగా మారాలా వద్దా? ఐ మీన్ నటించాలా వద్దా?

మారాలి' మారాలి మాకు అబివృద్ధి కావాలి' సభలోంచి కేకలు వినిపించాయి

నేనంత సాహసం చెయ్యాలంటే కొన్నాళ్ళు అడివినొదిలి ఊరిలో గడపాలంటే మీ సహకారమూ కావాలి' మీ కోసమే మీరంతా ఒక్కరోజు ఒక్కటంటే ఒక్కరోజు ఊరిలో గడపాలి'

అమ్మో' అమ్మో' సభలో వాళ్ళు గుండెల్బు బాదుకున్నారు

నేనింత సాహసం చేయదలచుకొన్నప్పుడు ఒక్కరోజు గురించే మీరంత బయపడితే ఎలా? మీరు ఆ ఒక్కరోజు ధైర్యం చేస్తే రెండేళ్ళం ఖర్మ ఇక జీవితాంతం మీకు పోలీసుల బయముండదు ఇక అబివృద్ధి విషయంలోనంటారా చుట్టుపక్కల అడవులను మించిపోవచ్చు' ఆలోచించుకోండి

సభ అంతా ఆలోచించుకొంటున్నట్లు నిశబ్దమైపోయింది

ఆ తర్వాత సభలో ఒక దొంగలేచి ధైర్యంగా అడిగాడు

బిగ్‌బాస్‌గారూ' ఇంతకూ మేము ఆ ఒక్క రోజూ ఊరిలోకొచ్చి చేయవలసిన పని గురించి చెప్తారా' ఇక మీరు ఊరిలో ఏ వేషంలో గడుపుతారో చెప్తారా'

చెప్తా చెప్తా ఆ విషయానికే వస్తున్నా మీరు ఊరిలో ఒక్క రోజు గురించి వచ్చి చెయవలసిన పని రేపు ఎలక్షన్లు జరిగే రోజువచ్చి ఓట్లు వేయడమే' ఇక నేను వేసే వేషం రాజకీయ నాయకుడు '

సభంతా తప్పట్లతో మార్మోగిపోయింది

బిగ్‌బాస్ జిందాబాద్' అన్న కేకలతో సభంతా దద్దరిల్లిపోయింది

**(అయిపోయింది)**

కాశీనాథ విశ్వం




## 3000

అక్షరలా మూడు వేల రూపాయల ప్రథమ బహుమతి టెలిగ్రాం అందుకున్నాడు బం బం ఆనందమా? ఆశ్చర్యమా? కలయో నిజమో వైష్ణవ మాయయో! పోతన పద్యం జ్ఞప్తికొచ్చింది బంగారికి!

ఆ సెంట్రల్ కాగితం పుచ్చుకుని సెంటరుకు వచ్చాడు సెంటరు అంటే సాయంత్రం పూట గాంధీ చౌక్ వద్ద చేరే సౌహార్ద్ర మిత్ర కూటమి అది! వీళ్లంతా ఒక గూటి పక్షులు! ఒకే మాట ఒకే బాట– లేదు ఒకే పూట కలిసే స్నేహితులనుకొండి పోని

సస్పెన్స్

ఏంటి?

చెప్పుకోండి

మీ అబ్బాయి ఫారిన్ వెళ్లాడా?'

లేదు

మీ ఆవిడ కూతురింటికెళ్లిందా?

కాదు

మీకు రేడియో చాన్స్ వచ్చిందా? కథ రాసే మీకు కవిత్వం వరించమని తాఖీదు వచ్చిందా?

కానే కాదు!''

మరేంటి? చెప్పవయ్యా ? పార్టీ పెట్టాలి తప్పదు నీకు డబ్బులొస్తే ఇప్పుడే పార్టీ! తప్పదంటే తప్పదు

టెలిగ్రాం చూపెట్టాడు తన కథకి ఫలానా పత్రిక నుండి ఫస్ట్ ప్రైజ్ మూడు వేల రూపాయలు! మిత్ర సమూహం ఎగిరి గంతేసింది ఖుషీ ఖుషీగ బంగారిని కౌగలించుకున్నారు అభినందించారు గొప్ప రచయితవి తప్పక ఆల్ ఇండియా ఫేమ్ అవుతావని ఎప్పటికైనా సాహిత్య అకాడమీ ప్రైజ్ జ్ఞానపీఠ అవార్డు తప్పదని మెచ్చుకున్నారు

బంగారు పొంగిపోయారు కంగారు పడిపోయినంత బెంగపడిపోయినంత కంగుతిన్నారు మిత్ర బృందం పార్టీ అప్పుడే మందు విందు పెట్టమన్నారు మూడు వేలలో ఐదు వందలే కదా ఆలోచించ లేదు బంగారు గాంధీ చౌక్ వద్ద బ్రాందీ సంగతేమిటని సంకోచించలేదు చనిపోయి కీర్తిశేషులైన గాంధీగారి కంటే తన మిత్ర సమూహమే గొప్పదని భావించడంలో పొరబాటు అని అనుకోలేదు

బాటిల్స్ కిర్రు కిర్రులు సోడాల పరపరలు గ్లాసుల గలగలలు వాతావరణం ఆహ్లాదకరమైంది ఆనంద సందోహమైంది అమందానందకళిత హృదయారమైంది అచ్చోటు! ఆహా! ఏమా బంగారి కథా పరిమళం పత్రిక పరిమళం!– ప్రచురించబోయే బంగారి మొదటి బహుమతి కథ తెచ్చిన మొదటి అనుభూతి! మధురాతి మధురం ఈ కథ బహుమతి

ఆనందమానందమాయెనే బం బంగారు సంబరంగా గంతులేసినట్టు మనసెక్కడికో ఊహాలోకంలోకి తేలిపోయెటట్టుంది పరిమళం పత్రికలో బంబం గారి కథానిక వచ్చేసిందని తెల్సి ఆ రోజు సాయంత్రం గాంధీ చౌక్‌లో చేరిన వాళ్లంతా

# ఫాలాక్షుని షైరి

## వయోవృద్ధుని పెళ్ళి!

నగ్న సుందరుల సొంపు సొంపులను రంగురంగుల ఫోటోలుగా తీసి అచ్చొత్తి ప్రచురించే పుస్తకం ప్లేబోయ్ అనే ఆంగ్ల పత్రిక అధిపతి హాఫ్‌హెఫ్నర్ తన 63 ఏళ్ళ బ్రహ్మచారి జీవితానికి స్వస్తి పలికి 63వ ఏట 22 ఏళ్ళ కింబర్లీ కాన్‌రాడ్ అనే సుందరిని పెళ్ళాడాడట! ఈమె లోగడ ఆ పత్రికలో తన నగ్నసౌందర్యాన్నంతా ఎన్నో కోణాలలో చూపరులకు అందిచ్చిన మోడల్‌గర్లట! అయితేనేం 63 ఏళ్ళ యువకుడు యీమెకు నచ్చాడట – నో అబ్జక్షన్.

## చిరంజీవి అభిమానుల ఆగడాలు!

నటుడు చిరంజీవి 24వ తేదీ హౌరా మెయిల్లో మద్రాసులో బయలుదేరి రాజమండ్రి వెళుతున్నారని తెలిసిన ఆయన ఫ్యానులు తాడేపల్లిగూడెం స్టేషనులో ఆయన పేరున జేజేలుకొట్టూ రైలంతా వెతికారట. ఆయన కనుపించకపోవడంతో కృద్ధులై బోగీల లింకులు, వ్యాక్యూమ్ పంపు గొట్టాలు పీకేసి, పెట్టెల అద్దాలు పగలగొట్టేసి నానా బీభత్సం చేసి, తమ అభిమానం నిరూపించుకున్నారట

## యువతి ఆత్మహత్య

మద్రాషు పెరంబూరుకు చెందిన పెరియార్ నగర్‌లో 20 ఏళ్ళ శెల్వి అనే ఆమె జూలై 2వ తేదీన రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకున్నదట ఈమెకు నాలుగు నెలల క్రితమే వెంకటేష్ అనే అతనితో పెళ్ళయ్యిందట – మరిహనేం

## అక్రమ రవాణాదారుని ఆటకట్టు!

గుమ్మడిపూడి ప్రాంతంలో ఆంధ్రా నుంచి తమిళనాడుకు అక్రమరవాణా చేస్తున్న వో యువకుడిని అతడు అక్రమరవాణా చేస్తూన్న 32 కిలోల గంజాయినీ పట్టుకున్నారట ఈ గంజాయి సుమారు 12 వేల ఖరీదున్నదట

## అంతుచిక్కని హత్యలు!

సేలం జలకంఠాపురం ఎల్లమ్మన్ రెడ్డియార్ అనే వూరుకు చెందిన 65 ఏళ్ళ పళనియప్పన్ అనే ఆయన అదేవూరికి చెందిన కుప్పుసామి అనే వో ఉపాధ్యాయుని పొలం కౌలుకు తీసుకుని పదేళ్ళుగా వ్యవసాయం చేసుకుంటూన్నాడట జూన్ నెల మొదటివారంలో అతని భార్యకు చెందిన అయిదు కాసుల బంగారు గొలుసు ఎవరో దొంగిలించారట పోలీసుల దర్యాప్తులో యీ విషయం వున్నదట. భార్య తన పుట్టింటికి వెళ్ళి, వంటరిగా రాత్రి యింట్లో పడుకున్న పళనియప్పన్‌ను ఎవరో తల పగలకొట్టి మొన్న చంపేశారట నంజకంఠాపురంలోని వో నూతిలో 50 ఏళ్ళ రాజా అనే అతని శవం నగ్నంగా తేలుతూ కనుపించిందట. సూర్యమలై కొండ మెట్లమీద 35 ఏళ్ళ వో యువకుని శవం పడివున్నదట ఆ యువకుడు ఎవరైనదీ చుట్టుపక్కలవాళ్ళు పోల్చలేకపోయారట ఒకే నెలలోని ఒక్క వారంలో జరిగిన యీ మూడు హత్యల విషయంలో పోలీసు వికాశెత్తిపోతోందట

## ముంచాన్‌పల్లిలో దోపిడి!

జూన్ 29 అర్ధరాత్రి ఆదిలాబాద్‌కు చెందిన ముంచాన్‌పల్లి గ్రామంమీద పీపుల్స్‌వార్ వర్గానికి చెందిన వో 13 మంది ఆయుధాలతో దాడిచేసి, నగానట్రా, నగదూ, గట్టాలే కాకుండా బియ్యం కూడా వో 35 బస్తాలు దోచుకుపోయారట వీటన్నిటి కిమ్మత్తు వో లక్షట – గమ్మత్తేమిటంటే దోపిడీ అయిపోయాక ఆ గ్రామానికి ప్రభుత్వం మరింత పోలీసుబలగాన్ని పంపిందట – ముందెలా పంపగలదు!

## జర్మనీ వనిత ఆత్మహత్య

పశ్చిమజర్మనీకి చెందిన 23 ఏళ్ళ అలెగ్జాండ్రియా మిల్లర్ అనే ఆమె ఢిల్లీలో అశోక్ యాత్రానివాస్ ఎదుటి భవనం ఎనిమిదో అంతస్తు నుంచి దూకి 25వ తేదీ ఆత్మహత్య చేసుకున్నదట ఆ హోటలులో ఆమె కొన్నాళ్ళ నుంచి బసచేస్తోందట ఆత్మహత్యకు కారణాలు పోలీసులు వెతుకుతున్నారట ●

---

## కథ వెనక కథ

ఆకాశానికెత్తేశారు ఆయన్ని

బొమ్మ ఎంతో బావుంది

"కథ స్టార్టింగే ఎంతో బావుంది

'ముగింపు అత్యద్భుతం!' "

'వర్ణనలెంతో బావున్నాయి'

'సంభాషణలు రంజుగా వున్నాయి"

'ఈ కథతో బం బంగారికి అంతర్జాతీయ ఖ్యాతి రావటం ఖాయం!

ఇలా బంగారి కథ గొప్పతనాన్ని పొగడ్తలతో ముంచేస్తుంటే ఓ మిత్రుడు

"పొగడ్తేనా? ఇంకేమైనా మందు విందు వుందా? లేదా సార్? ప్లీజ్ లోకల్ జర్నలిస్టులు వచ్చారు ఈ రోజు స్పెషల్‌గా ఏదైనా?

'వాటికి వెనకంజ వేస్తాడా మన రచయిత! కాదు, లేదంటే మేం ఇప్పుడు దబ్బిస్తాం కథ తాలూకు డబ్బుల చెక్కొస్తే అప్పుడిద్దురు గాని "

'దానికేం మహాబాగు! బంగారు ఆ రోజు రాత్రి 10 గంటలకిగాని ఇంటికి చేరలేదు సుమారు వెయ్యిన్ని ఐదు వందల రూపాయల చేతిబరువు అని మర్నాటి తెల్లవారిగాని తెల్సిరాలేదు అయితేనేం? ఇప్పటికి రెండు వేలయింది డబ్బు! కథ తాలూకు డబ్బులే కదా ఖర్చయింది పర్వాలేదు!

అనుకొన్న రోజు రానే వచ్చింది పరిమళం పత్రికల వారి చెక్ మూడువేల రూపాయలు అందింది ఎస్ బి ఐ లో క్యాష్ చేసి రెండు వేల తాలూకు అప్పు తీర్చి, ఆ సాయంత్రం పది వందలరూపాయల్తో గాంధీచౌక్, మిత్ర సమూహం దరిజేరాడు అప్పటికే చెక్కు సంగతి తెల్సుకున్న వాళ్ళు ఆవురావురుమంటూ కాచుక్కూర్చోలేదు

చెక్కొచ్చిందటగా

"అవును చెక్కొచ్చింది చిక్కు తెచ్చి పెట్టింది బాకీ వాళ్ళు లాగేసుకొన్నారు మిగిలింది వెయ్యి

"అదీ తియ్యవయ్యా బంగారూ! '

కిక్కు లేకపోతే జీవితంలో మజాపడదీ?! "

రెపరెపలాడాయి పది వంద రూపాయల నోట్లు వైన్‌షాపు గల్లా పెట్టెలోకి చేరాయి ఖుషీగా విందు జరిగింది అంతేగాకుండా ఇంకా వంద రూపాయల చమురయింది బంగారికి! దానికంతా బెంబేలు పడే తరహా అతడికెప్పుడూ లేదు ఊరువు కాదు ప్రసిద్ధ రచయితగా ముద్రపడ్డ బంగారు బంగారులాంటివారు! ఇచ్చుట పుచ్చుకొనుట అంతా ఆయనకు ఎరుకే

ఆ మందు విందు సందర్భంగా బంగారు తన కవితా దోరణిలో

ఓ రిక్వెస్టు ' అన్నాడు

అందరూ "వ్వాట్ " అంటూ అతడి వైపు చూశారు

"నా కథ నేను చదవాలి ఇప్పుడే ' గద్గద కంఠంతో చెప్పాడు

ఇప్పుడే! ఇక్కడే!? ఇటువంటి పరిస్థితుల్లోనే!!! " విస్తుపోయారు మస్తుగా మందు సేవించిన విస్కీ కిక్కులో చదవగలడో లేదో అన్న సంశయం వాళ్ళది

సరే చదివాడు బంగారు– ఆ కథ చదివినంతసేపూ అతనిలో మార్పులేదు ఏకదాటిగా చదివేడు!

ఆ కథలో మద్యపానం వల్ల ఓ కుటుంబం ఎలా నాశనమౌతుందో తెలిపాడాయన ఆ కథలో త్రాగుడెంత వినాశ హేతువో తెలిపే కథ అది! అంతా కథ ముగించే పర్యంతం ఆసక్తిగా విన్నారు శ్రోతల మిత్రులు!

# వారఫలం

**4-8-1989 శుక్రవారం మొదలు 10-8-1989 గురువారం వరకు**

**మేషం:** తెల్లని వస్తు విక్రేతలకు అనుకూలం. లాభదాయకవారం. పత్రికారంగాన శ్రమించువారికి, పాత్రికేయులకు సర్వానుకూలం. వంపిణీదారులకు వారమంతా మేలే శుభసమయంగా గ్రహించాలి స్త్రీలకు వస్తు సేకరణకు, వస్త్ర సేకరణకు అనుకూలవారం

**వృషభం:** వస్తుసేకరణకై, వ్యాపారపెంపునకు కావలసిన పరికర సాధనకై దూరదేశాలకు వెళ్లనున్నారు ప్రయాణంలో ప్రమాదం జరుగకుండా చూచుకోవాలి. రాజకీయాల జోలికి యిప్పట్లోవెళ్లకుండుట శ్రేయస్కరం. స్త్రీలకు : మీరు రచయితలా? చక్కని అవకాశాలున్నాయి.

**మిధునం:** రాజకీయ మిత్రులతో మంతనాలు సాగిస్తారు కొంత అభివృద్ధి సాధించాలని యత్నమే. పట్టుదలతో కార్యసాధన గావించుకోండి నాటకరంగానుభవం గలవారికి అనుకూల సమయం అంటే, ఏదో మేలు జరుగనున్నది. స్త్రీలకు అభీష్ట సిద్ధి, ఆరోగ్యవృద్ధి, బంధు సమాగమం

**కర్కాటకం:** ధనలోపంలేదు రాజకీయరంగాన మేలున్నది బంధుసమాగమమున్నది మిత్రులతో, బంధువులతో బహుజాగరూకతతో మాట్లాడవలసిన సమయం రచయితలకు, గాయక వర్గానికి అనుకూల సమయం వారాంతాన ఆదాయలోపం ఏర్పడవచ్చు స్త్రీలకు ఉద్యోగరీత్యా కొందరకు ప్రమోషన్ గలదు

**సింహం:** కళాసాహిత్యరంగాన చక్కని అవకాశాలు లభ్యం కాగలవు ఒక్క ఆరోగ్య విషయాన తప్ప, మరేవిధంగా యిబ్బంది రాదు ఏనాటి నుండియో జరుగని వ్యవహారం 'మంగళ' వారాన సానుకూలం కానున్నది స్త్రీలకు బంధు విరోధం రాకుండా చూచుకోండి అధిక వ్యయంకూడా సూచితమే

**కన్య:** ఇష్ట బంధు సమాగమం ప్రయత్నలోపం లేకుంటే సర్వ విధాలా మేలున్నదని, ఆదాయంలో ఏమాత్రం లోపం రాదని, వారాంతాన ఆశించిన రీతిగా మేలు జరుగనున్నదని, సభారంగాన ప్రసిద్ధి యున్నదని గ్రహించాలి. అప్పులున్నాయా? వసూలు గావింప అనువైన సమయంగా గ్రహించండి స్త్రీలకు: శుభదాయకం, బంధు మిత్ర సమాగమం సుఖసంతోషాలు

**తుల:** రాజకీయమందు అనుకూలం ప్రయత్నలోపం లేకుంటే సాంఘిక రంగాన కూడ మేలున్నది విద్యావిషయంగా ఏదో అనుకూలత గలదని గ్రహించండి. 'శని' అనుకూలుడే స్త్రీలకు వాహనం కొనుగోలు చేయుటకు అనుకూలం, గ్రహించండి

**వృశ్చికం:** కానివర్గమున్నదిగదా! మరి జాగ్రత్తగా సంచరించాలిగా! ఇరుగు పొరుగు వారితో మాటపట్టింపు రావచ్చుగా! జాగ్రత్త! నూత్న మిత్ర సమాగమం రాజకీయమందు ప్రవేశించుటకు అనువుగాదు కాలం యింకా అనుకూలం గాదు స్త్రీలకు ఉద్యోగరీత్యా అనుకూలమని, ఆదాయమందు వృద్ధి చేకూరనున్నదని గ్రహించాలి

**ధనుస్సు:** ధన విషయంగా ఎలాంటి లోపం లేదు ఇకనైనా అప్పు సప్పులు యిచ్చి సతమతం కావటం మానండి ఇంట శుభకార్య ప్రస్తావనలుంటాయి రాజకీయాల్లో ప్రవేశించుటకు అనువైన కాలంగాదు అపహాస్యం పాలు కారాదు స్త్రీలకు చేసే వ్యాపారాన అనుకూలత గలదని గ్రహించండి

**మకరం:** గౌరవాధిక్యతకు ఆస్కారం చిరకాలమిత్రులు యింటికి రాగలరు అభిమానించేవారున్నారు అప్రయత్న ధనలబ్ధి గలవారం ఇరుగు పొరుగుతో తగాదా తంటాలు రాకుండా చూచుకోండి చాలామందికి దూర ప్రయాణావకాశం అలాగైనా జాగ్రత్త అవసరం స్త్రీలకు ఉద్యోగమందు సదవకాశాలు

**కుంభం:** సమయం సందర్భం గ్రహించి ఏ కార్యానికైనా దిగాలి శ్రద్ధతో గావించిన పనికి విఘాతం రాదు ఆదాయానికి లోపం లేదు అనుకూల మిత్ర సమాగమం దూర ప్రాంతాలకు వెళ్ళవలసిన అగత్యం ఉంటుంది ఒక వేళ వ్యాపారరీత్యా కావచ్చు స్త్రీలకు నూతన మిత్ర సమాగమం వృత్తి రీత్యా మేలు ఆరోగ్యవృద్ధి

**మీనం:** సభాగౌరవం ఉన్నది గ్రామాన, కుటుంబాన అధిక గౌరవదాయకవారం శుభకార్యాలోచనలుంటాయి శుభకార్యం నిశ్చయం కావచ్చు పదుగురిలో పేరు ప్రతిష్టలుంటాయి ఆట పాటల్లో ప్రావీణ్యం గలవారికి అనుకూలం యత్నకార్యసిద్ధి, ఆరోగ్యవృద్ధి స్త్రీలకు ఉత్తమ మిత్ర సమాగమం రాజకీయ ప్రతిభకు సదవకాశాలు

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# పెద్దల చమత్కారాలు

## దగాలేని రాగం

నలభై నలభై అయిదేళ్ళ క్రితం నాటి మాట ఒకసారి విజయవాడలో గాయక సార్వభౌములు పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి గాత్ర సంగీత కచేరీ జరుగుతోందిట హాలంతా జనంతో కిటకిటలాడుతోంది ఆ రోజ సంస్కృతాంధ్ర పండితులు శ్రీ కాశీకృష్ణమాచార్య కూడా పంతులుగారి కచేరికి వచ్చారట పంతులుగారి స్వరం నుంచి సంగీతం సుగంధంలా గాలిలో తేలివస్తోంది సంగీత సుధ రసవత్తరంగా సాగుతోంది వున్నట్టుండి కృష్ణమాచార్యగారు లేచి మీరు సంగీత సరస్వతీ పుత్రులు గాయక సార్వభౌములు దగాలేని రాగం మీరు పాడితే వినాలని వుంది అని అభ్యర్థించారట




కృష్ణమాచార్యగారు సంగీత ప్రియులు వైలెన్ వాద్యంలో ఆయనకు ప్రవేశముండేది పంతులుగారి పాటంటే ఎంతో ఘనమైన అభిమానం వుండేది అయితే దగాలేని రాగమేమిటో కచేరీ వినడానికి వచ్చిన శ్రోతలకు అర్థం కాలేదట

దగా రాగాలు దగాలేని రాగాలు అని అస్సలు రెండు రకాలుంటాయా? పంతులుగారి శిష్యులకు కూడా ఆ మిషకి ఏమిటో బోధ పడలేదు కాని రామకృష్ణయ్య పంతులుగారు కృష్ణమాచార్యుల వారి అభిప్రాయం గ్రహించి వెంటనే దగాలేని రాగం పాడి వినిపించారట చిత్రం దగాలేని రాగం మరేమికాదు మధ్యమావతి సప్తస్వరాల్లో దగాలేని రాగం అదే మధ్యమావతిలో వచ్చే స్వరాలు స రి మ ప ని మాత్రమే

ఆనందం పట్టలేక కృష్ణమాచార్యులుగారు వెళ్ళి పంతులుగారిని గట్టిగా కౌగలించుకున్నారట హాలంతా చప్పట్లతో మారుమ్రోగిందట

ప్రయాగ




# నీలంవారి జోస్యం

నీలం సంజీవరెడ్డిగారి సంగతే వేరు ఆయన మాటల్లోనే చెప్పాలీ అంటే ఆయన 'జెనరేషన్' వారు ఎవ్వరూ లేరు యిప్పుడు క్రియాశీలక రాజకీయాల్లోనుంచి ఆయన తప్పుకుని చాలాకాలమైంది కాని- ప్రస్తుత రాజకీయాల మీద మాత్రం ఆయనకు యింత లేటు వయసులో కూడా చక్కని అవగాహన వున్నదనే మొన్న హైద్రాబాద్‌లో ఆయన ప్రెస్ కాన్ఫరెన్స్ నిర్వహించిన తీరు స్పష్టంగా తెలియజేస్తున్నది ఈసారి ఎన్నికల్లో కేంద్రంలోను రాష్ట్రాలలోను కూడా మళ్లీ యిప్పుడున్న 'బాస్'లే గద్దె నెక్కుతారని ఆయన బల్ల గుద్ది చెప్పారు రాజీవ్‌గాంధీకి తప్ప మరొకరికి ప్రధాన మంత్రి వదవి- ఎన్ టి ఆర్ కి తప్ప మరొకరికి ముఖ్యమంత్రి వదవి దక్కడం కష్టం అన్న శ్రీ సంజీవరెడ్డి మాటలు వెంటనే ఎవ్వరూ కొట్టి పారేయలేరు నీలం వారు రాష్ట్ర ముఖ్యమంత్రిగా, లోక్‌సభ స్పీకర్‌గా, రాష్ట్రపతిగా మన దేశంలో అత్యంత కీలకమైన హోదాగల పాత్రలను సమర్ధవంతంగా- సొంత బాణీలో నిర్వహించిన ప్రజ్ఞా దురంధరుడు- వారి అనుభవాన్ని కొట్టిపారేయడం తగని వని- నేషనల్ ఫ్రంట్ విషయంలో 'ఎవరికి వారే యమునా తీరేగా వున్నా'రని డిన్నర్ మీటింగ్‌లు పెట్టుకుని ఓసారి కల్సుకుని కబుర్లు చెప్పుకుని తమ సప్తాశ్వరధం యేదో పొడిచేస్తుందని నేషనల్ ఫ్రంటు నాయకులు కమ్మని కలలుగనటాన్ని- యీ దేశంలో విజ్ఞులైన సామాన్య పౌరులు చాలామంది ఖండిస్తూనే వున్నారు ఇప్పుడు మాజీ రాష్ట్రపతి యిదే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారుకనుక 'ఫ్రంట్' లీడర్స్‌కి తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త చెప్పక తప్పదు 'ఉమ్మడి చిహ్నం,' మీదపోటీ చేస్తే తప్ప ఫ్రంట్‌కి భవిష్యత్తువుండబోదన్న రెడ్డిగారి మాటలు బాగా ఆలోచించాల్సిందే కాంగ్రెస్ పార్టీ ఎంత చావు దెబ్బలు తిన్నా రేపటి ఎన్నికల్లో- సింగిల్ లార్జెస్ట్ మెజారిటీ వున్న పార్టీగా అది రాగల అవకాశాలుంటాయని 250 సీట్లు సంపాదించుకుంటే తిరిగి రాజీవ్‌గాంధీజీ గద్దె నెక్కడం తప్పదని- ఆనక 'పాలో'మని కాంగ్రెస్ (ఐ)లోకి మద్దతుదారులు చేరిపోతారని సంజీవోవాచ

ఆయన క్రియాశీలక రాజకీయాల్లో వున్నప్పుడే కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడే పెద్ద మనిషి ఇవాళ ఆయనకింకా మొహమాటమేమిటి? జనతాపార్టీ గొడవల కాలంలో ముగ్గురే ప్రధానమంత్రి వదవికి తంటాలు వడ్డారు శ్రీయుతులు మొరార్జీ, చరణ్‌సింగ్, బాబూజీలు- వారిలో చరణ్‌సింగ్‌కి ఎట్లా అయితేనేం- మాజీ ప్రధానుల జాబితాలోవడే అవకాశం చిక్కింది బాబూజీకి అది తీరని కోరిక అయిపోయింది అవును మరి- కేంద్రంలోనూ, రాష్ట్రంలోను కూడా దళిత



జాతులు హరిజనులు గిరిజనులు అంటూ రకరకాల రిజర్వేషన్‌లు అవకాశాలు మాట్లడుతారే కాని- ప్రధానమంత్రి వదవి, ముఖ్యమంత్రి వదవి హరిజనులకివ్వాలని ఎందుకనరో మన పెద్దలు?

ఇవాళ ప్రతిపక్ష నాయకులలో చంద్రశేఖర్‌కి రామకృష్ణ హెగ్డేకి మధ్య పచ్చిగడ్డి వేయండి- ఏమవుతుంది?

ఎన్ టి ఆర్ ని వి పి సింగ్ వెనకాతల నడవమనండి- ఏమవుతుంది? గద్దె మీద వున్న వాడిని క్రిందికిలాగే ప్రయత్నాలలోనే నిమగ్నమై వుండే యీ పార్టీలు తాము గద్దెనెక్కి పాలనా యంత్రాంగాన్ని వట్టుకోగల ప్రయత్నాలేం చేస్తున్నాయి? పైగా 'ఫ్రంట్'లోని పార్టీలు ఎక్కడికక్కడ 'లోకల్ అరేంజిమెంట్సు', చేసుకుంటాయట! నీలంవారి మాటలు నేషనల్ ఫ్రంటు అవనీండి మరో ఫ్రంటు అవనీండి- కేంద్రం 'గద్దె' నెక్కాలని కలలుగనే వాళ్లకి గోడమీది రాతల్లాంటి హెచ్చరికలు! 'అయితే గియితే అయినంవ్పూడి పెత్తనం' నాది అన్నట్లు- 450 స్థానాలో స్తాయంటూ కబుర్లు చెప్పటం వల్ల దేవీలాల్‌లాంటి నాయకులకు పత్రికల్లో హెడ్‌లైన్లు దొరుకుతాయే తప్ప- ఎన్నికల్లో అన్ని వోట్లు వడవు- వడవు అనకండి వడతాయి- కాంగ్రెస్ అంటే బేజారై విసిగిపోయిన దేశంలో- తాము దానికి బదులుగా నడుం కట్టగలమంటూ ఒకే త్రాటి మీద నిలబడితే 19 77 చరిత్ర వునరావృతం కాదు అన్న మాటలు నీలం వారే అనలేదు ఎవ్వరూ అనరు కాని 'ఫ్రంట్' ఐకమత్యం పిల్లి మెడలాంటిది దానికి గంట ఎవరు కడతారు?-

## "ఏడేళ్లయ్యింది- ఏం లేదు?"

ఎన్ టి ఆర్ ఒక్కోసారి నాటకాల్లోలాగా 'స్వగతాలు' వలికినప్పుడు అక్షర లక్షలు చేసే వాస్తవాలు- త్రాగినవాడు చెప్పే నిజాల్లాగా బయటపడిపోతూ వుంటాయి రాష్ట్ర ప్రణాళికాబోర్డు (సారీ! బ్రాకెట్‌లో 'అభివృద్ధి' అని కూడా వుండాలి) సమావేశంలో ఎన్ టి ఆర్ నిర్వేదంలో వడిపోయి- ఏడేళ్లైంది సింహాసన మధిష్టించి- ఏమి సాధించానంటూ చాలా బాధవడిపోయారు ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి యిలా బేల వడిపోతే యిక

ఆ రాష్ట్రంలో శ్రీవారు తరచుగా వేర్కొనే 'సగటు'మనిషి ఎంతక్షోభ వడాలి. నిన్నటి దాకా అనుభవిస్తున్న విద్యుత్ 'కోత' పెట్టిన రంపువు కోత నంగతే తీసుకోండి. దీనికి ముఖ్యమంత్రి బాధ్యత తనదేనన్నారు. వెరీ గుడ్! దొడ్డమనిషి కనుక ఆయన యిలా అంగీకరించారు కాని విద్యుచ్ఛక్తి నల్లయి రేట్‌లను పెంచకుండా ఏదో ఒక విశ్వామిత్ర సృష్టి చేసి విద్యుత్ బోర్డుకి నద్బిడీ యివ్వలేకపోయాడా? ఆయన- దీనికి కేంద్ర ప్రభుత్వం అడ్డు వచ్చిందేమో మనకి తెలియదు- ముఖ్యమంత్రిగా ఆంధ్రులలో అధిక సంఖ్యాకుల మన్నన పొందిన 'అన్న' యివాళ 'ఆ పేదవాడు నన్ను నమ్మాడు. రామారావుకి వోటు వస్తే మంచి జరుగుతుందని అనుకున్నాడు. అయితే ఏం చేయగలిగాం... అనుకున్నది సాధించగలిగామా?' అంటూ యిప్పటికైనా శ్రీ ఎన్.టి.ఆర్. ఆవేదన చెందడం చాలా గొప్ప నంగతి. ఎన్నికల ముందుగా అన్నగారికి యీ మాత్రం విషాదయోగం రావటం- 'పేదవాడికి' ఏదైనా మేలు చేస్తుందేమోనని ఎదురు చూద్దాం. పేదవాడు అంటే 'పణం' లేని వాడు. చేత 'తడి' లేనివాడు కాను లేనివాడు- యీ పేదవాడు కులమత జాతులకతీతంగా అన్ని రకాల వర్గాలలోను వున్నాడని గ్రహించి- బహిరంగంగా ఢంకా బజాయించిచెప్పగలవాడు ఎన్.టి.ఆర్. గారొక్కడే "మే గాడ్ గివ్ హిమ్ స్ట్రెంగ్త్ టు సీ ది ట్రూత్ అండ్ నథింగ్ బట్ ది ట్రూత్" అన్నాడో 'లా' విద్యార్థి! ఓ. కే.!

(21-7-'89)

## 'మీ పేరు పడాలంటే రెండక్షరాల మాట!'

రెండక్షరాల మాట 'ప్రేమ' ఒకటి వుంది. 'అమ్మ' కూడా అంతే! ఇట్లా ఆ 'మాట' అనంగానే కుతూహలంగా జనం చూసే మాట ఒకటి రాసి పంపండి. 'మాట కారు'ల పేజీలో (కొందరివి) దాన్ని వారి పేరూ వూరూతో సహా వేస్తాము. ఈ తమాషా శీర్షికకి గడువు వారం రోజులు మాత్రం- చమత్కారులూ షూట్!

ఈ 'మాట' కార్డు మీదే చిన్న వాక్యం మరోటి రాయండి. ఆం. స. వా. ప. మీరు ఏ శీర్షిక కోసం చదువుతున్నారూ? కొనా? అద్దె కొనా? గైకొనా? ఎట్లా సంపాయిస్తున్నారు- ఈ జవాబు ముఖ్యం.

-ఎడిటర్




ఇటీవల హైదరాబాదులో ఎంగి అష్టాబ్దంలో నటి మంజు భార్గవికి వేదాంతం జగన్నాథశర్మ అవార్డును కె ఎస్ పురోహిత్ బహూకరిస్తున్న చిత్రం ప్రియుతులు జె వి సోమయాజులు డా సి నారాయణరెడ్డి ఎం ర మర ఎ క ను కూడ ఈ చిత్రంలో చూడవచ్చు



ఇటీవల సామర్లకోట శ్రీ ఆంజనేయస్వామి దేవాలయ ప్రాంగణంలో ఏర్పాటైన సభలో "హనుమల్లీలా తరంగిణి" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి, గ్రంథ ప్రచురణకర్త శ్రీ శిరిపురపు పరదేశి

## శ్రీ వెంకటేశ్వర కళానిలయం

మద్రాసులోని శ్రీ వెంకటేశ్వర కళానిలయం వారు అక్టోబరు మొదటి వారంలో నాటికలు ఏకపాత్రలు పాటలు నృత్యాలు వ్యాసరచన పోటీలు నిర్వహించనున్నారు ఈ కార్యక్రమం చెన్నపురం ఆంధ్ర మహాసభ ప్రాంగణంలో జరుగుతుంది పోటీల మూడు బహుమతులు షీల్డులు ఇస్తారు వివరాలకు ప్రధాన కార్యదర్శి శ్రీ వెంకటేశ్వర కళానిలయం, క్యూ 115 ఎం ఎం డి ఏ కాలనీ అరుంబాకం,మద్రాసుకి వ్రాయాలి

## తిరుమలరావ్ కు సాహితీపురస్కారం

ఈ ఏడాది పతివాడ సుధాకర్ సాహితీ-పురస్కారం ప్రముఖ కవి, తెలుగు విశ్వవి-ద్యాలయం అధ్యాపకుడు డాక్టర్ జయధీర్ తిరుమలరావ్ కు లభించింది



జయధీర్ తిరుమలరావు
పతివాడ సుధాకర్

కాకినాడలోని రంగరాయ కళాశాలలో వైద్య విద్య నభ్యసిస్తూ ఇరవై ఒకటవ యేటనే కన్నుమూసిన సుధాకర్ స్మారకార్థం ఈ పురస్కారాన్ని ఏర్పాటుచేశారు

ప్రతి ఏడాది వివిధ సాహితీ ప్రక్రియల్లో ప్రముఖంగా పనిచేసిన వ్యక్తులకు ఈ పురస్కారాన్ని అందజేయటం జరుగుతోంది

'తెలంగాణా రైతాంగ పోరాటం- ప్రజ సాహిత్యం' అనే డాక్టర్ తిరుమలరావు పి. హెచ్ డి సిద్ధాంత గ్రంథం సాహితీ రంగంలో పేరుగాంచింది వీరి 'డాక్యుమెంటరీ సినిమా' పుస్తకం ప్రశంసలందుకుంది 'అరణ్యనేత్రం'కు 1980 లో సాహితీ పురస్కారం లభించింది ●

# గళ్ల నుడికట్టు-14
## బహుమతులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 జూ | ■ | 2 ఇ | 3 త్వ | ము | ■ | 4 ద్రో | ■ |
| 5 వే | ద | ము | ■ | మే | ■ | 6 ద్వి | ప | ద |
| ■ | ము | ■ | 7 జ | వా | ది | ■ | ది | ■ |
| 8 ఆ | ■ | 9 కా | ■ | హం | ■ | 10 వా | ■ | 11 గి |
| 12 వా | ర | ణా | సి | ■ | 13 శ్రీ | రా | ము | డు |
| లు | ■ | చి | ■ | 14 వా | ■ | శి | ■ | గు |
| ■ | 15 స | ■ | 16 గి | రి | జ | ■ | 17 క | ■ |
| | | ము | ■ | జా | ■ | 19 ఇం | ద్రు | డు |
| | య | ■ | 20 మ | క్షి | క | ■ | వ | ■ |

పాఠకులు అత్యంత ఉత్సాహంతో వందల సంఖ్యలో ఈ పోటీలో పాల్గొన్నారు వారందరికీ మా అభినందనలు సరైన సమాధానం ఈసారి నలుగురు పంపగలిగారు బహుమతి మొత్తం రు 200/-లను ఈ నలుగురికి సమానంగా పంచగా ఒక్కొక్కరికి రు. 50/-లు చొప్పున వచ్చాయి వారికి మా అభినందనలు ! త్వరలో ఈ బహుమతులు నగదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి మీ జవాబు మావద్ద గల సీల్డు జవాబుకి సరిపోవాలి ఒకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చును కాని తెల్లకాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు పత్రికలో కూపన్‌నే నింపిపంపాలి ఒక పజిల్‌లో ఒకరికి ఒక బహుమతికంటే ఎక్కువ రాదు!

-ఎడిటర్

## సరైన జవాబులు పంపినవారి పేర్లు:

టి. అరుణకుమారి (కామారెడ్డి), పి. కేశవయ్య (అనంతపురము), పి. మీనాక్షి (విజయవాడ), ఎ. వెంకటేశ్వరరావు (నందివెలుగు).

# సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

# గళ్ల నుడి కట్టు -16

ఆధారాలు

**నిలువు**

1 శనికి కొంచెం ఎక్కువ భారతంలో వాడు
3 శివుని విల్లు
4 సముద్ర లంఘనం చేస్తున్న హనుమంతుని నీడను పట్టి లాగిన రాక్షసి
8 మందుకు ఒక అక్షరం కలపండి యజమాని
9 తలకు నోరులాగా ప్రతి ఇంటికి ఇది తప్పదు
10 శచీదేవికి భర్తనుబట్టి వచ్చిన పేరు
11 వంకాయ కూర చేదుగావుంటే-ఇలాఅంటారు
14 దుంపకూర ఇంటి పేరు గల కవి విజయుడ్ని గురించి వ్రాశాడు
15 రామ భారత కథలను జోడించిన దక్షుడు
17 ముఖాన్ని కొద్దిగా మార్చండి యుద్ధమవుతుంది

**అడ్డం**

2 ఇది చాల శ్రేష్ఠమయిన ధేనువు
5 పాపకుడులో రాక్షసుడున్నాడు
6 నరికి సేవకు ఒకే మాట
7 భోజనం రుచికరంగా వుండాలంటే ఇది బాగుండాలి
12 హిందీ నటి గంగానది
13 మంచి కన్నులు గలది ఇంద్రజిత్తు భార్య
16 వసంత ఋతువు
18 పదుపేను, నిలువు లాటవాడే కవి భాస్కర శతక కర్త
19 ప్రతివాడు ఇది పడాలని కోరుకుంటాడు
20 కృష్ణుని గానము

ఆదారాలున్నాయి నుడికట్టు గళ్ళు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు 200/- లు బహుమతి లభిస్తుంది- ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది తుది నిర్ణయం సంపాదకునిదే!

– సం

## గడువు తేదీ : 10–8–'89

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | ■ | 2 | 3 | | ■ | 4 | ■ |
| 5 | | | ■ | | ■ | 6 | | |
| ■ | | ■ | 7 | | | ■ | | ■ |
| 8 | ■ | 9 | ■ | | ■ | 10 | ■ | 11 |
| 12 | | | | ■ | 13 | | | |
| | ■ | | ■ | 14 | ■ | | ■ | |
| ■ | 15 | ■ | 16 | | | ■ | 17 | ■ |
| 18 | | | ■ | | ■ | 19 | | |
| ■ | | ■ | 20 | | | ■ | | ■ |

కూర్పు పింగళి వి కృష్ణారావు

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపిన వారిపేరు . .

పూర్తి చిరునామా . . . .

. . . . .

. . . . . పిన్ . .

## డొనేషన్‌లు

'విద్యార్థుల్లో అశాంతి ఎందుకు? అనే శీర్షికన వివిధ కళాశాలలకు చెందిన ప్రిన్సిపాల్స్ అభిప్రాయాలను ప్రచురించడం ఆలోచించదగినదిగానే వుంది– అయితే అది వన్‌సయిడెడ్‌గా వున్నది

డొనేషన్లూ, బిల్డింగ్ ఫండ్లూ, అక్కరలేని ఎంట్రెన్స్ పరీక్షలూ కూడ నేడు విద్యార్థులలో అశాంతికి కారణాలవుతున్నాయి వీటికి తోడు కొన్ని కాలేజీలలో పాలనా యంత్రాంగపు లోపం అసమర్థతల వల్ల, కాలేజీలు ఫాషన్ పెరేడ్స్‌గా మారిపోతూ చదువు కోసం వెళ్లే విద్యార్థులను నిరుత్సాహ పరుస్తున్నాయి ఒక్కొక్కప్పుడు భయపెడుతున్నాయి కాబట్టి పై శీర్షికను ఒక చర్చా వేదికగా చేసి విద్యార్థుల నుండీ విద్యార్థుల తల్లిదండ్రుల నుండి కూడా అభిప్రాయాలను సేకరించి ప్రచురిస్తే సర్వాంగసుందరంగా వెలువడుతున్న ఆంధ్ర సచిత్ర వారపత్రిక మరిన్ని వెలుగులతో బాసిల్ల గలదని ఆకాంక్ష

–ఎ వి బి రామ్ (విశాఖ)

## కొత్త మలుపులు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక కొత్త మలుపులు

**ఈ వారం సలహా**

**వారానికోరోజు అద్దాలలో మొహం చూసుకోకండి ! మర్నాటి కందం ఘనుమడిస్తుంది.**

# వీక్లీ పోస్ట్

(4 వ పేజీ తరువాయి)

తిరుగుతున్నందుకు సంతోషం 7-7-89 నాటి సంచికలో విప్పర్తి ప్రణవమూర్తిగారి 'ఆకు జోళ్లు'కథ చదివి ఎంతో ఆనందించాను బాల్యపు అమాయకత్వాన్ని వాస్తవికతా దర్పణంగా చిత్రించిన కథ ఇది తామరాడ, రాజానగరం కాకినాడల మధ్య తిరిగిన ఈ కథ ఆ ప్రాంతపు ఒక పసివాడి ఆకలికళ్లలో ఆడుకునే నిరాశనూ, కసినీ దైన్యాన్నీ దుఃఖాన్నీ చదువరులకు చూపించింది ఒక చిన్న కాన్వాసులో పెద్ద చిత్రాన్ని చూపిన 'విప్ర'గారు ఇంకా ఎన్నో కథలు రాయాలని కోరిక

–మీరా (తణుకు)

## అమూల్యమైన అంశాలు

రమ్యకృష్ణ నవ్వుతూన్న బొమ్మతో వెలువడ్డ సంచిక 7-7-89 నన్ను ఒక్కక్షణం ఏడిపించింది ముఖచిత్రం మీది తారతోపాటు నేను సైతం చిరునగవులు ఒలకబోస్తూ అలా అలా లోపలి పేజీల్లోకి పోదునుగదా! ఇంకేముంది!! 25వ పుటలో ఒక ప్రకటన నన్ను నిలవేసింది జంట పత్రికలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక' కలువబాల' తమ వెలను పెంచుకుంటున్నట్టు ప్రకటించుకున్నాయి అయినా కాసేపటికి తమాయించుకున్నాను సమాధానపరచుకున్నాను పత్రికలోని ప్రతి అవయవమూ ప్రతి అణువూ సుందర రూపం తొడుగుతున్న వేళ కేవలం యాభై పైసలు అంతగా ఎక్కువగాదని తోచింది నాలుగు రూప్యముల దరగల పత్రికలోని అంశాలు మాత్రం మూల్యం కట్టలేని విధాన తీర్చిదిద్దబడాలి

మన్నెముత్తుల అశోకవర్ధన లేబూరు ఇం<br>
కూరుపేట మం






Editorial Adviser *S RADHAKRISHNA* Editor *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones Editorial 75667, Business 61247, 61248